# భారతి

సాహిత్య మాసపత్రిక

జనవరి 1981

## పూర్వకాలంలో మనగ్రామ వ్యవస్థ

పరబ్రహ్మశాస్త్రి

## ముదిగొండ చాళుక్యులు

సోమసుందరరావు – సూర్యనారాయణ

## కన్నుల ఎదుట కైలాసం

శరభయ్య

## కన్యాశుల్కంలో చిన్నపాత్రలు

రమణారెడ్డి

## శ్రీః

కీ॥ శే॥ నరసింహశాస్త్రి

## నా గీతం

కాళిదాసు

## ఊరంటే స్వర్గం

జోయెల్

ఇంకా భాను, మురళీధర్, తంగిరాల, పెన్నా శివరామకృష్ణ, ఖమ్రుద్దీన్, శశికాంత్ శాతకర్ణి, అంజయ్య, హేమచందర్, మన్మధరావు, రమణ, ప్రభాకరదేవ్, విశ్వనాధం, లీలామోహనరావు, జనార్ధనరావు – సుదర్శన్, పార్ధసారథి ఇతరుల రచనలు

వ్యవస్థాపకులు

దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులు

# భారతి

మాసపత్రిక

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938-1972)

జనవరి 1981

సంపుటము : 58 సంచిక : 1

విడిపత్రిక వెల రెండు రూపాయలు



కీ॥ శే॥ శివలెంక శంభుప్రసాద్‌గారు
సంపాదకుడు 1938 – '72

# స్వవిషయం

భారతిలో ప్రచురణకోసం వచ్చే వ్యాసాలలో ఎక్కువభాగం సాహిత్యం, చరిత్ర మొదలయిన వాటి గురించే ఉంటాయి. సాంఘిక, భౌతికశాస్త్రాలకి సంబంధించిన రచనలుకూడా ప్రచురిస్తే భార ఆధునిక సమాజాన్ని మరింతగా ప్రతిబింబించగలుగుతుంది. ఈమధ్య విశ్వవిద్యాలయాలలో సాంఘికశాస్త్రాలలో పరిశోధనలు జరిపేవారు కొందరు తమ పరిశోధనల ఫలితాలని గురించి వ్యాసాలురాసి భారతికి పంపుతున్నారు వారికి మేము కృతజ్ఞులము. భౌతికశాస్త్రాల పరిశోధనలకి సంబంధించిన "మౌలిక వ్యాసాలు" భారతి వం పత్రికకి వచ్చే అవకాశాలు తక్కువ కాని ఆ శాస్త్రాలలో సాధింపబడుతున్న అభివృద్ధి, అభివృద్ధి ఫలితంగ ఏర్పడే అన్నిరకాల సంకలనాలు–వీటిని వర్ణించే రచనలు భారతి ప్రచురించగలదు. భౌతికశాస్త్రాల చరిత్ర ఎంత స్థూలంగా పరిశీలించినా ఆ శాస్త్రాల సిద్ధాంతాలు ఎప్పటికప్పుడు "పాతబడి" పోతున్నాయని అనిపిం తీరుతుంది. విజ్ఞానం పెరగటంవలన ఉత్పన్నమయ్యే శాస్త్రసిద్ధాంతాలని యుక్త విమర్శకి గురిచేసి, వాట లోపాలని కనుక్కొని, తగిన విధంగా కొత్తసిద్ధాంతాలని తయారు చేసుకొనటం ద్వారానే అభివృద్ధి వీలవుతుం దన్న అభిప్రాయాన్ని కాదనటం తేలికకాదు. శాస్త్రంలో పిడివాదం పనికిరాదు. విమర్శకి తావులేకపోతే విజ్ఞా శాస్త్రాలకి అధోగతి పట్టితీరుతుంది. అంటే, శాస్త్ర పద్ధతితో స్వేచ్ఛ అవసరం. [సాంకేతిక విజ్ఞానం వినియోగంలోకూడా మార్పుని గుర్తించకతప్పదు. ఉదాహరణకి, ఫిజిక్సులో కనిపెట్టిన కొత్త సిద్ధాంతాలు అణుశక్తి ప్రయోగాలకి దారితీశాయి; కెమిస్ట్రీలో పరిశోధనలు వంశపారంపర్య సిద్ధాంతాలని మార్చివేస్తు న్నాయి.] సాంఘిక వ్యవహారాల అనుశీలనలోనూ స్వేచ్ఛ అవసరమే. స్వేచ్ఛకి వ్యతిరేకమయిన సంప్రదాయాలు కొన్ని కనీసం కొన్ని శతాబ్దాలుగా భారతదేశంలో స్థిరపడి ఉన్నాయి. అవి కొత్త వేషాలు వేసుకుని తలఎత్తే సూచనలు ఇటీవల కొంతకాలంగా అధికం అవుతున్నాయి. కొత్తసంవత్సరంలో ఈ ధోరణి మారగలదని ఆశించాలి.



# విషయానుక్రమణిక

## జనవరి 1981


| | | |
|---|---|---|
| శ్రీః | కీ॥ శే॥ నోరి నరసింహశాస్త్రిగారు | 5 |
| తలలో నదులు | శ్రీ కై. అంజయ్య | 9 |
| పూర్వకాలంలో మన గ్రామవ్యవస్థ | శ్రీ పి. వి. పరబ్రహ్మశాస్త్రి | 10 |
| ఊరంటే స్వర్గం | డా. గంధం జోయెల్ | 16 |
| నా గీతం | శ్రీ వఝ్ఝల కాళిదాసు | 17 |
| కన్నులఎదుట కైలాసం | శ్రీ మల్లంపల్లి శరభయ్య | 18 |
| మందార హారం<br>దివినుండి భువికి... | డా. తంగిరాల | 26 |
| ఆత్మ | శ్రీ కె. ఎస్. రమణ | 27 |
| గమ్యం | శ్రీ కొడవంటి లీలామోహనరావు | 27 |
| ప్రాచీన కాలములో ఉన్నతవిద్య | శ్రీ విశ్వనాధం బత్తినేని | 28 |
| సుదూర సామీప్యాలు | శ్రీ జి. భాను | 34 |
| తమసోమా ... | శ్రీ కశింకోట ప్రభాకరదేవ్ | 34 |
| కవితో — సామాన్యుని సణుగుడు | శ్రీ సి. హేమచందర్ | 35 |
| బాల్యం | శ్రీ మేకా మన్మధరావు | 36 |
| మిణుగుర్లు | శ్రీ ఎస్. పార్ధసారథి | 37 |
| మేల్కొన్న చైతన్యం | శ్రీ శశికాంత్ శాతకర్ణి | 43 |
| సామాజిక శాస్త్ర పరిశోధన — పరిశీలన | శ్రీ బి. జనార్ధనరావు<br>శ్రీ జి. సుదర్శన్ | 44 |
| ఆనందజలధి<br>తటిల్లత | పెన్నా శిరాక్ర | 54 |
| నే పూల మొక్కను | సాంధ్యశ్రీ | 56 |
| ముదిగొండ చాళుక్యుల కాలనిర్ణయము | డా. చెళ్ళపిళ్ళ సోమసుందరరావు<br>శ్రీ కొల్లూరు సూర్యనారాయణ | 57 |
| గాజుముక్క<br>కోరిక | శ్రీ బి. మురళీధర్ | 66 |
| కన్యాశుల్కం నాటకంలో చిన్నపాత్రలు | శ్రీ కె. వి. రమణారెడ్డి | 67 |
| వెలుతురుజెండా | ఖ్రమొద్దీన్ | 70 |
| కలగూరగంప | | 71 |
| గ్రంథవిమర్శలు | | 76 |



# కీ. శే. నోరి నరసింహశాస్త్రిగారు

[కీ. శే. నోరి నరసింహశాస్త్రిగారి కుమారుడు శ్రీ నోరి హనుమత్‌శాస్త్రిగారు అందచేసిన పద్యాలవి ఈ క్రింద వేస్తున్నాను]

— సంపాదకుడు.

శ్రీవాణీ గిరిజా శచీశులు భవత్
శ్రీ పాదుకా భావనా
సేవాప్రాప్త మహత్త్వులై మహిమ
వాసింజేసి నీయంతలై
నీ వాడింప నిజేచ్ఛబోలె త్రిజగ
న్నిర్వాహలీలల్ గద
మ్మా, నీనిం గనవే దయామతి
మహామాయా జగన్మోహినీ !

కవు లెబ్బంగిని కావ్యరంగముల
సంకల్పించి యం దిచ్ఛమై
రవణల్ దీర్చి నటింపజేసి
బహుపాత్రల్ గూర్చి క్రీడించుచున్
భువనారాధ్యతగాంతు రట్టులనె
నీవున్ లోకకావ్యాళి, శాం
భవి, నిర్మించు కవీశివో గదె,
మహామాయా జగన్మోహినీ !

స్వచ్ఛంబై తెలుపారు మేల్ యవనికిన్
సారించి యామీద కాం
తిచ్ఛాయల్ పచరించి వర్ణముల
వర్తింపన్ కథాసీమలన్
స్వేచ్ఛారీతి సృజించి ప్రేక్షకుల
మోహీభూతులం జేయు శుం
భచ్ఛాయాచ్ఛవిచిత్ర నేత్రినొ
మహామాయా జగన్మోహినీ !

తెరపై గీలిచి తోలుబొమ్మలను
తంత్రీ బంధముల్ కీలుకీల్
తిరుగం జేతుల బూని నర్తనగతిం
ద్రిప్పించుచున్ చూడుడీ
భరతుం డీతడు రాముడీతడని
దీపం బెత్తి వర్ణించు ద్రి
మ్మరి గంధోడివొ బొమ్మలక్కవొ
మహామాయా జగన్మోహినీ !

వేదార్థంబులు ప్రాతపాటలయి
నిర్వేదంబు పుట్టింప, దు
ర్వాదంబుల్ పరమార్థపాళిగ
సభాద్వారంబులన్ మ్రోయ, మ
న్మాద ప్రక్రియ వల్లెవేయు
జనతానందోక్తు లాలించు క
ర్మా, దౌర్భాగ్యము మా కివేటికె
మహామాయా జగన్మోహినీ !

ఏ పుణ్యాంబుల గ్రుంకులాడుదును నే
నే క్షేత్రమున్ మెట్టుదున్
ఏ పుణ్యాత్ముని జూడబోయెదను నే
నే దైవమున్ మ్రొక్కెదన్
ఏ పుణ్యాక్షరముల్ స్మరింతు శ్రమలే
కిప్పాటనే ముక్తి సం
ప్రాపించే సదుపాయ మేమియొ
మహామాయా జగన్మోహినీ !

జపం జేయగ స్నాన సంధ్యలు
తపో యోగంబులున్ భక్తులే
నోపన్ వీడగ పుత్ర ధాన్య ధన
దారోద్యోగ వృత్తంబు లే
నోపం బట్టగ కామ మోహముల
సద్యో మోక్షమున్ లీల సం
ప్రాపించే తెరువేది చూపవె
మహామాయా జగన్మోహినీ !

తల్లీ, సాధ్విని దైవతాంశ నపనిందల్
మోపి బాధించి తా
నొల్లం బోక గృహంబు పొనడిచి
దంభోక్తుల్ ప్రహర్షంబునన్
పల్లాపింపగ నాలకించెడి ప్రపంచం
బె ట్లసత్కావ్య సం
ప త్లీలారతిమై రచించెను
మహామాయా జగన్మోహినీ !

కుల ధర్మంబులు శైలమాలలయి
సంకోచించు స్వేచ్ఛారతిన్
కుల భేదంబులు రూపుమాపుడని
యాక్రోశించుచున్ రచ్చలన్
కుల విద్వేషమె సర్వకార్య గతులన్
గూఢార్థమై యుంట ని
ర్మల విప్రావళి చేటుకే గద
మహామాయా జగన్మోహినీ !

దంతంబొక్కటి పాదునంగదలు మాత్రన్
బాధ యింతైన దే
హాంతం బందు న ప్రాణ పంచకను
మూలాధారమున్ బాయుచో
నెంతో, పాపఫలానుభూతి యటుపై
నెంతౌనొ, విజ్ఞాను ధీ
మంతుం జేయవె నీ పదాశ్రితు
మహామాయా జగన్మోహినీ ! ౧౦

ద్విజ పీడం దొలగింప దుర్చి యని
తద్దే శంబునన్ కృత్రిమ
ద్విజకాంతి చ్ఛట లూదుకొల్పునటు
లీ దేహంబుతో బుట్టు భా
వజ సంత్రాసము డొల్లగొట్టి యట
నీ పాదాబ్జ దోచిస్సు ఖం
బ, జనుక్లేశము వాయునిల్పవె
మహామాయా జగన్మోహినీ ! ౧౧

అమ్మా యన్నను నాన్న యన్నను
మదీయాత్మేశ్వరా యన్న నా
తమ్ముండా యన నన్న యన్న మరి
పుత్రాయన్న పుత్రీ యనన్
సమ్మోదమ్మున మిత్రమా యన
భవన్న్యస్తేంద్ర జాలమ్ము బిం
బమ్ముల్ గాదె తలంప సర్వము
మహామాయా జగన్మోహినీ ! ౧౨

ఏమే నీ బహు చిత్రలీల లివి మా
కెట్లర్థమౌ నమ్మరో
శ్రీమంతుండు విశుద్ధ శీలుడు
సుధీసింధుండు సన్మాన్యుడున్
ఏమందిచ్చెదొ ఏమి మ్రాకిడెదొ
మోహీభూత చేతస్కుడై
మైమై నిల్వక యిట్టె జారును
మహామాయా జగన్మోహినీ ! ౧౩

కవిగానీ పసిపాపగాని కరుణన్
గన్నంత లోకేశు డౌ
పవి గానీ తృణమైన గాని తలపే
వక్రింప బెండై పడున్
రవిగానీ అణువైనగాని లయలీలన్
పేల్చు లోకాళి, అ
మ్మవు నీ యిచ్చకు లోకు వంతయు
మహామాయా జగన్మోహినీ ! ౧౪

నీ వక్షోజ మహాద్రు లావ సథమై
నిత్యంబు రక్షింపగా
నీ వక్షోజ వినిస్స్రుతామృతము
మేనిం బెంప మృష్టాన్నమై
నీ వక్షోజ సువృత్త పూర్ణత
సమున్మేషించు నా యాత్మ అం
బా వక్షోజ పదంధ యుండను
మహామాయా జగన్మోహినీ ! ౧౫

చవితిన్ సిద్ధి గణేశధాత వయి
బొజ్జం బెంచి యుండ్రాళ్ల మె
క్కవె, ఏకాదశి వాసుదేవ నిశ దాక్ష్యం
దార్చి పస్తుండవో,
భువనాళిన్ శివర్మాత్రి కాలగరళంబుం
బూంచి కంఠాన శాం
భవ రూపంబున గావవో కృప
మహామాయా జగన్మోహినీ! ౧౬

ఒక పంక్తిన్ సురలున్ సురో వరుసలో
న్నుగ్రాసురుల్ తీర, నీ
వొక భాండింగల యొక్క యోగిర
మొకే యుద్ధాత్రి వడ్డింపగా
నొకపాత్రన్ సుధ ఒక్కపాత్రి సుర
రెండొక్కండుగా దోచు న
మ్మకరో (అద్భుత కర్మలీలలు) ఒక్కొక శక్తియిచ్చుచు
మహామాయా జగన్మోహినీ ! ౧౭

శ్వానం బొక్కెడ వానరం బొకతరిన్
స్వప్నంబునన్ గోళ్లతో
మేనం గీరిచి దంష్ట్రలన్ జొనుప
నేమీ సంభ్రమం బంద క
వ్వానిన్ గొంతులు నొక్కుచున్ గెడప
పాపం బంచు పోనిచ్చితిం
బ్రాణాపాయము తప్పె గాదటె
మహామాయా జగన్మోహినీ ! ౧౮

మొడయుం దోకయు నాగుబాము
    లటుపై మేనెల్ల క్రౌంచంబు పై
బడగా దూకుచు నుండె నా పయికి
    నే పన్నుండి యుయ్యాలలో
బడ ద్రోయంగమకింతు నూపులను,
    నే బక్షిన్ ననుం బక్షియున్
బడగొట్టం బడ మేమి స్వప్నమొ
    మహామాయా జగన్మోహినీ! ౧౯

జనిదో మృత్యువు జాతమో పెరిగి
    దుస్స్వప్నంబులంగాంచి పీ
డను శంకించు టిదేమి బుద్ధి జననీ
    డంబాలకుర బోక యా
తను పాతావధి నిష్ఠ నీ పదములే
    ధ్యానించి యర్చించుచున్
మననం జేసెడి బుద్ధి యీగదె
    మహామాయా జగన్మోహినీ! ౨౦

మత్తారాతుల జెందుచో నృపతికిన్
    మత్తేభమే భద్రమై
యుత్తాలోజ్జ్వల వాహనంబగు,
    త్వదీయోగ్రాజి శార్దూలమున్
మత్తేభారియు నెను, కూర్చితిని నే
    మత్తేభ శార్దూల సం
పత్తుల్ వాహన వృత్తముల్ కొను
    మహామాయా జగన్మోహినీ! ౨౧

వరుసన్ వాగ్భవ మాయబున్ సిరిమరిన్ వాక్కామ
    భృగ్వీం నవాంశ్లే
బరో బల్ మాయరో నిద్రరో పశుమనో
    భావాళి చక్షుశ్శ్రుతుల్
మరపించే తెరవో విలోమత మహామంత్రాత్మ
    నీలాంబరీ
మర పొర్చే మెరపై వెలుంగవె
    మహామాయా జగన్మోహినీ! ౨౨

నీలా భ్రా భ తురంగ యానవగుచున్
    నీలోప సంవ్యానవున్
నీలాలంకృతి మాల్యభూషవు
    మహానిస్త్రింశ హస్తాఢ్యవై
ఈ లోకావళి నిద్రమంపు తెర
    మాయించే భవానీ కృపం
బాలింపంగదె దివ్వె చేకొని
    మహామాయా జగన్మోహినీ! ౨౩

జ్వాలా జాజ్జ్వల దుర్నిరీక్ష్యమగు నీ
    సత్యస్వరూపంబు దు
ర్లోలాత్ముల్ జదు లెంత వేడిన సమాలోకింప
    నీవా కృపా
శాలిత్వంబటు నీక చెల్లు, హృద
    యార్ద్రజ్యోతివై వెల్గవే
మాలోలో తెరచాటు వెల్గయి
    మహామాయా జగన్మోహినీ! ౨౪

ఆనందం బెసగన్ కుమారు నెదకున్ హత్తించు
    కో గోర దు
ర్మానం బడ్డుచు మెట్టు దే మొగములోడన్
    తద్గ్రహంబంచు న
జ్ఞా నాకారత ప్రేమ పొంగడచు
    విజ్ఞానంబు డిందించు దు
ర్మానం బెంత ప్రియంబొ బుద్ధికి
    మహామాయా జగన్మోహినీ! ౨౫

అజ్ఞానం బభిమానమున్ కడుపులో నాపేక్షనే
    లోగొనే
ప్రజ్ఞం గల్గినవన్న, నీవరయుగా
    ప్రజ్ఞానపున్ మున్న, నీ
వజ్ఞానంబు హరించు టొక్క బలువా
    ఆత్మాందరాళాన, న
మ్మా, జ్ఞానార్ద్ర గభస్తి నిల్పవె
    మహామాయా జగన్మోహినీ! ౨౬

ఓంకారాత్మక హంసభావమున
    సాంఖ్యుల్ నిన్ను ధ్యానింపరే
హ్రీంకారోజ్జ్వల దివ్యదీపికగ
    యోగీంద్రుల్ ప్రతిష్ఠింపరే
శ్రీంకారామలమూర్తి లోకము సదా
    సేవించి యర్చింపదే
మంకు న్నన్నెటు లుద్ధరించెదో
    మహామాయా జగన్మోహినీ! ౨౭

మూలాధారమునన్ మహాభుజగివై
    ముచ్చుట్టపై నర్దవే
హేలాసుప్తమహోగ్రశక్తి వవి
    యోగీంద్రుల్ ప్రశంసింతు రే
లీలన్ నిద్దురలేపి బుస్సురన
    జేర్పింతున్ సుధాస్థానమున్
మాలిన్యంబు హరింప దెల్పవె
    మహామాయా జగన్మోహినీ! ౨౮

ఈ విశ్వం బిది యెంత దొడ్డదియొ
        ఊహింపంగ సాధ్యంబె? మా
జీవోపాధియు నెంత చిన్నదియొ
        కొల్చేపాటిదా? నీ కృపా
శ్రీ వైదగ్ధ్యము పేర్మి నీ యణవె
        విశ్వేద్దైవమ్మై పొంగు నం
బా వాలాయము నీ ప్రభావము
        మహామాయా జగన్మోహినీ ! ౨౯

వృద్ధుల్ మాన్యులు జన్మలొక్కొకరే
        చాలింప లెక్కింతు, నే
శ్రద్ధా భావనవీడె ప్రాణము
        శరీరం బుండ సాధించె నే
మిద్ధాత్రి న్నని దుఃఖమే తలచుకో
        హెచ్చౌగదే, జ్ఞాన సం
పద్ధాత్రీ, నను నట్లు చేయకె
        మహామాయా జగన్మోహినీ ! ౩౦

ఒక మాత్రావధి వ్యర్థమౌనటుల
        నుద్యోగింతు రశ్రాంతమున్
ఒకచో నిల్పక పర్వు లెత్తుదురు
        నేమో మున్ను చున్నట్లుగా
ఒక మాటాడక పెక్కులాడెదరు
        బాగో ఓగొ భావింప క
మ్మక, నా ద్రొక్కటె కోర్కె, నీ కృప
        మహామాయా జగన్మోహినీ ! ౩౧

ఒకటే యోదువు విశ్వరూప గుణ
        బాహుళ్యంబు చూపెట్టుచున్
ఒకటే మాటవు వేదశాస్త్ర బహుళోక్తుల్
        ప్రపంచించుచున్
ఒకటే నీవలె నాదు ప్రార్థనయు
        చిత్రోద్యోగు లేమున్న న
మ్మక నన్నున్ జరితార్థు జేయవె
        మహామాయా జగన్మోహినీ ! ౩౨

'అమ్మా మాయవె కళ్ళ కంచమున
        నున్నన్నంబు తింటా' ననన్
ఎమ్మాడ్కిన్ జనయిత్రి మాయు కను,
        లట్లే నీవు పెట్టిందె కా
దమ్మా షడ్రసపూర్ణ పాత్రమిది
        మే మానన్ కనుల్ మూసుకో
మమ్ముం జూడకె మాయమ్మగావుగ
        మహామాయా జగన్మోహినీ ! ౩౩

పదయుక్తిన్ క్రమమున్ జటాఘనలతో
        వల్లించితిన్ వేదమున్
హృదయస్థంబులు స్మార్తకర్మములు
        దర్శేష్టుల్ మహాయజ్ఞముల్
ఎదియే శాంతిక పౌష్టికాది నెదురేదీ
        నా కనన్, నీవు స
మ్మదమే పొందక లాభమేమిటి
        మహామాయా జగన్మోహినీ ! ౩౪

జగదాచార్యుడె పూర్ణదీక్ష కొసగెన్
        సామ్రాజ్య పట్టంబుతో
ఒగి మంత్రాళి మహాపురశ్చరణ
        సాంగోపాంగముం జేసితిన్
తగు శ్రయాగ శతం బొనర్చితి ననన్
        ధన్యత్వ మాయమ్మ, మా
మగతల్ వో చిరునవ్వు నవ్వక
        మహామాయా జగన్మోహినీ ! ౩౫

కామక్రోధవిలోభ మోహమదముల్
        గాటంపు మాత్సర్యమున్
నా మా శత్రువు లార్గు రందు రదియున్
        న్యాయంబె యౌగాక, శ్రీ
కామే శేశివి నీ కృపాగరిమ
        ఏ కాస్తున్న మా శత్రువే
మా మిత్రత్వము పూని తేర్పంగా
        మహామాయా జగన్మోహినీ ! ౩౬

కామం బుత్తమ ధర్మవృత్తముల
        దుష్కార్యాళిపై క్రోధమున్
క్షేమ ప్రక్రియలందు లోభము
        భవచ్చింతా రతిన్ మోహమున్
నీ మాహాత్మ్యము విన్న సమ్మదము
        ని న్సేవింప మాత్సర్యమున్
మా మిత్రంబులు కావో కావవా
        మహామాయా జగన్మోహినీ ! ౩౭

ఆడింపన్ మఱి నీకు దోచిన కలం
        బాడున్ కరంబాడు కా
లాడున్ నాలుకయాడు నాడి తనువం
        దాడున్ నరం బాడు కీ
లాడున్ శ్వాసయు నాడు, నీ తలపు
        వేరైనంత డబ్బాటమై
మా డబ్బాటల యాటకట్టును
        మహామాయా జగన్మోహినీ ! ౩౮

ఏ మాటాడిన నీ మహామహిమయై,
ఏ నీట నీరాడినన్
నీ మహోన్యోజ్జ్వల పాదతీర్థ మగుచున్,
నిత్యంబు క్రీడార్థ మే
మే, మాటాడిన తల్లి, నిహ్నులును
మాహేశీ కథా కాళియై
మా మ్మెనాడి యనుగ్రహింపవె
మహామాయా జగన్మోహినీ! ౩౯

చోద్యంబయ్యెడు నీ మహాలయమునన్
జూడంగ స్వప్రాణ ర
క్షోద్యోగాన సమర్థు లింద
రసహాయుల్ వోలె చావంగ, బా
లాద్యల్పిష్ఠు లపూర్వ చిత్రగతులన్
నా పాయులై యుంట, సం
పద్యోగంబు వియోగమిట్టివా
మహామాయా జగన్మోహినీ! ౪౦

తాపం బెత్తగ గాలిలేమి తను
వంతవే దంశముల్ కుట్టని
ద్రాపాయం బయి రాత్రియెల్ల నరకప్రాయం
బగున్, నారకీ
కూప జ్వాలల నాయపాయసపు
మెక్కుంబోటు లెట్లో మనుం
బాపావస్థల బపి కావుము
మహామాయా జగన్మోహినీ! ౪౧

తగు దండంబు విధింప దోషులకు
మున్ ధర్మాసనం బుండి చ
క్కగ యోచింపక దోషహీను చెర
శిక్షన్ వేయ, వాడందు నె
వ్వగ శ్వాసాడక తిట్టెనేమొ నను
నీ శ్వాసానురోధంబు నం
బగలున్ రేలును క్షోభపెట్టెడు
మహామాయా జగన్మోహినీ! ౪౨

ఎటులో చెప్ప మనస్సు పట్టు టది
స్వేచ్ఛాచ్ఛరతి; దుర్గమో
త్కట పాపాధ్వములం జరించు భయ
శంకా లజ్జలున్ వీడుచున్
నిటు లెందే నిను సేవకై దురితవిట్
హేయప్రపంచంపు లం
పటతో చేరు టెటో సుధామల
మహామాయా జగన్మోహినీ! ౪౩

# తలలో నదులు

## శ్రీ కె. అంజయ్య

ముల్లుగట్టె పొడుస్తుంటే
గంతల ఎద్దులు మూగగా కదులుతున్నపుడు
గానుగలో నలుగుతున్న నువ్వుల్లో
ఈ జనం.
చూడిదై (చూలిదై) ఆవు
ఓ దూడ కి జీవంపోస్తున్నపుడు
పితుకుతున్న చేతులమధ్య
కురిసే పాలధారలో ఈ జనం.
తెగతిన్న పశువులచే
చెరచబడి మూలకు పడేయబడ్డ
తొక్కుడుగడ్డిలో ఈ జనం.
జనంలో నేను
నా తలలో అలజడి అలలై
చర్మాన్ని తన్నుకొని వస్తున్న నదులు
ప్రశ్నలు, ప్రశ్నాపరంపరలు
మెరుపులు మెరుపుల విల్లులు
అల్లుక వస్తున్న చేతుల్లో
జారిపోతూ, నిలదొక్కుకుంటూ
అల్లుకుంటున్న ఈతపోచల్లో
ఈ జనం.
చేతులు తిప్పబడుతున్నాయి
తాడు పేనబడుతోంది.
ఈ జనాన్ని చెప్పకిందేసి
నలిపి పారేస్తానని వడిరే గొంతుకు
ఉరేయడానికై తయారౌతున్న తాడు.

శ్రీ పి. వి. పరబ్రహ్మశాస్త్రి

# పూర్వకాలంలో మన గ్రామవ్యవస్థ

మన ప్రాచీన గ్రామాలొకవిధంగా స్వయం సమృద్ధములగు జనావాసములు వారి యవసరములు పరిమితములు. సామాన్య ప్రజకు తినుటకు ఆహారము, కట్టుటకు గుడ్డ, తలదాచుకొనుటకు పంచ మాత్రమే వారి నిత్యజీవితావసరములు. వీటికొఱకై వారు ప్రభుత్వముపై ఆధారపడవలసిన అవసరం మిక్కిలి తక్కువ. ఇంక విలాస భోగాధులకు ప్రజానీకము దూరముగ నుండెడిదనియే చెప్పవలెను. సమీప గ్రామములలో వారానికొకమారు జరుగుచుండు సంతలలో వారికి వలయు సంబారములన్నియు లభించెడివి. పగటివేషగాండ్రు, దొమ్మరివారు, తోలుబొమ్మలాడించువారు, భాగవతులు మున్నగువారు ప్రదర్శించు వీధి నాటకాలు వారి వినోదాలు. గ్రామాల్లో సంభవించు తగవులు గ్రామపెద్దలే తీర్చెడివారు. కనుక న్యాయస్థానాల ప్రసక్తి లేదనియే చెప్పవలెను. గ్రామాలమధ్య వచ్చెడి పొలిమేర తగాదాలు, ఏటి నీళ్ల తగాదాలు ఆయా విషయాధిపతులుగాని, రాజులు పంపించు అధికారులుగాని తీర్చుచుండువారు. కనుక ఆర్థికావసరాల కొఱకుగాని, న్యాయావసరాలకొఱకుగాని పూర్వకాలంలో ప్రజలు ప్రభుత్వాధి కారానికి దూరంగా జీవనం గడుపుకొనువారు. ఇదియొకవిధంగ అనాగరికత లక్షణ మనవచ్చును. ఆటవికులు ఇప్పటికి నాగరికులకు దూరంగా స్వేచ్ఛగా జీవిస్తూవుంటారు. వారికి దేశంలోని రాజకీయాలతోగాని మత విప్లవాలతోగాని యెట్టి సంబంధం ఉండదు. కాని వీరిలో మానవతా లక్షణమగు వైజ్ఞానిక సంస్కృతి శూన్యము. ఇంచుమించు ఆటవిక పశుపక్ష్యాదులవలె స్వేచ్ఛాజీవనం చేస్తూవుంటారు. గ్రామజీవన మిట్టిది కాక కొంత నాగరికతతోబాటు స్వేచ్ఛాజీవనం గలది.

నాగరికతకు సంస్కృతికి ప్రసిద్ధిగాంచిన ప్రాచీన దేశాలలో భారతదేశ మొకటిగా నుండెను. మఱి అప్పట్లో మనదేశం స్వాతంత్ర్య మనుభవించలేదా ? నాగరికత పెరిగినకొలది ప్రజలు ప్రభుత్వానికి తమ స్వేచ్ఛను కోల్పోవుచుందురు. కాని సంస్కృతిలో అట్టి ప్రమాదం తక్కువ. మానవుడు ఉన్నతాశయాలతో భూతదయ, సత్యము, అస్తేయము మున్నగు సత్ప్రవర్తనా లక్షణములు గలిగి సంఘవిద్రోహి గాకుండ వైజ్ఞానికౌన్నత్యమునొందు మార్గములో జీవించు విధానమొక విధముగా సంస్కృతి యనబడును. ఇట్టి సంస్కృతికి విద్యలు మూలకందము. మన ప్రాచీన వైదిక, బౌద్ధ, జైనాది మత సంప్రదాయములు ఆ విద్యలను ప్రచార మొనర్చి ప్రజానీకముపై వాటి ప్రభావమును ప్రసరింపజేసి దేశమును సాంస్కృతికముగ గణనీయమగు నొక యున్నత దశకు గొనిపోయినవి. ఇంక నాగరికత యనునది నగరవాసులకు వర్తకులకు పరిమితమై రాజనీతి యనుపేర పాలకులలోను, సత్యానృతమనుపేర వాణిజ్యమందును ప్రవేశించెను. కొన్ని సవరణలతో ధర్మాన్ని నాగరికతగా రూపొందించిరి. మతాచారాలకు ధర్మప్రభావానికి లోనైనట్లు ప్రజానీకము ప్రభుత్వాధికారుల నాగరికతకు లోను కాదగిన అవసరమానాడు లేకపోయెను. దానికి తగినట్లు ప్రభుత్వానికి కూడ ప్రజలకు తాను తీర్చవలసిన ప్రయోజనాలు చాల తక్కువగా నుండెను. గ్రామాలు స్వయం పోషకములు, స్వయంపాలకములు నై యుండెడివి. అంటే ఆనాడు జాతీయ వ్యవహారాలుండేవికాదు. ఈనాటి నాగరికతలో, రైలు మార్గాలు, విద్యుచ్ఛక్తి, విద్య, రోడ్డు రవాణాలు, చివరికి పాలు కూడ, అన్ని ప్రజావసరాలు జాతీయంగా మార్చి ప్రభుత్వం ప్రజలపై తన ఆధిపత్యాన్ని సుస్థిరం చేసుకొంది. ప్రతి విషయము డబ్బుతో ముడిపడి యుండునట్లు మార్చారు. ఇది ఆర్థికాభివృద్ధిగల వ్యవస్థ. కాని మనం సమీక్షించు గ్రామీణ వ్యవస్థ యిందుకు పూర్తిగా భిన్నమైనది. ఆ వ్యవస్థతో నిత్యజీవితంలో డబ్బు అవసరం అత్యల్పముగ నుండెడిది. నిత్యవ్యవహారముతో వస్తువినిమయ విధానమే (బార్టరు విధానము) బహుళముగా నుండెడిది. ఇప్పుడు పొలంలో కందులు వగైరా ధాన్యాలు పండించుకొనే రైతుకూడ ముందుగా వాటిని డబ్బుగా మార్చుకొని తరువాత తన కుటుంబానికవసరమగు ఆ పదార్థాలను కొనుక్కొనుచుండును. కనుక నిత్యజీవితంలో డబ్బునకే ప్రాముఖ్యముండునట్లు ప్రపంచ నాగరికత మారిపోయెను. ముడిపదార్థాలు డబ్బురూపంగాను, డబ్బు తిరిగి నిత్యావసర వస్తురూపంగాను మార్పు చెందుటకు ప్రభుత్వ యంత్రాంగము, అధికారము తప్పనిసరిగా ప్రవేశించును. మానవుని వ్యక్తిగత స్వేచ్ఛను జాతియొక్క ఆర్థికాభివృద్ధి యనుపేరుతో ప్రభుత్వాధికారము రూపుమాపును. నేటి ప్రపంచ నాగరికతలో ఇది తప్పనిసరిగా నుండును. ఇట్టి యభివృద్ధిలేని కాలంలో గ్రామాలు కొంత స్వతంత్ర ప్రతిపత్తి గలిగి యుండెడివి. దానికి తగినట్లు పాలకులుగూడ గ్రామాలపైన పెద్దగా అధికారము చూపువారుకారు; గ్రామాలకు తాము విశేషించి సాధించవలసిన ప్రయోజనాలు గూడలేవు. జాతీయస్థాయిలో నెరవేర్చవలసిన కార్యక్రమాలు ఆనాడు పూర్తిగా లేవనియే చెప్పవలెను. ఆసేతు హిమాచలం జాతీయస్థాయిలో వ్యాపించింది ధర్మప్రబోధమొక్కటే. దానికి రాజులు కూడ అనుగుణంగానే ప్రవర్తించిరి. భారతీయ సంస్కృతికి పట్టుగొమ్మయైనది ధర్మమేగాని రాజ్యాధికారాలు, ప్రభుత్వాధికారులు మాత్రముకాదు. అశోకుని కాలంనాటినుండి మనకు లభించు శాసనాధారాలు, వాఙ్మయాధారాలు, ధర్మవిషయ ప్రధానంగానే సాధారణంగా కనుపించును. కేవలం రాజప్రశస్తులని చెప్పబడు సముద్రగుప్తుని అలహాబాదు శాసనం, అనుమకొండ కాకతిరుద్రుని శాసనంవంటివి ఆయా రాజుల విజయ పరంపరను జెప్పినుగాని వారు

దేశంలోని ప్రజల కొఱకు చేసిన విశేష ప్రయోజనాలేమిటో పేర్కొనవు. రుద్రదామ మహాక్షత్రపుని జునాగడ్ శాసనం, గణపతిదేవుని పాకాల శాసనం వంటివి కొన్నిమాత్రం గొప్ప చెఱువులు త్రవ్వించి, నిర్మించినట్లు తెలుపుచున్నవి. గణపతిదేవుని మోటుపల్లి శాసనం వంటివికూడ జాతీయ ప్రయోజనము కొఱకు ఉద్దేశించబడినవనియే చెప్పవలెను.

పాలకులకు ప్రజారక్షణ బాధ్యత, అందుకొఱకు దండనాధికారము సంక్రమించియున్నను, ఆరెండును స్థూలముగ శత్రువులనుండి కాపాడుటకు మాత్రమే పరిమితమై యుండెడివి. మన ప్రాచీన గ్రామములు స్వయముగ తమ విషయముల నన్నింటిని తామే నిర్వహించుకొను వ్యవస్థలుగ నుండెడివి. ఈ వ్యవస్థలను గూడ పౌరశ్రేణులను పేరుతో రాజ్యాంగములలో జేర్చిరి. ఈ పౌరశ్రేణులు 'గణము'లని 'పణము'లని రెండు విధములుగ నుండెడివి. గణములు ఆయా కులముల వారి ప్రత్యేకసంఘములు 'కులానాంసమూహస్తు స గణస్సం ప్రకీర్తితః'[1] పణములనగా వృత్తులను బురస్కరించుకొని యేర్పడు సంఘములు (ట్రేడ్ గిల్డ్స్).[2] ఇట్టివి 18 సంఘములుండునని విజయనగర రాజులనాటి శాసన మొకదానిలో కలదు. అన్ని గ్రామాల్లోను, అన్ని సంఘములు ఉండునని చెప్పనక్కరలేదు. గ్రామములోనుండు వృత్తి కర్మకారులు, జాతులనుబట్టి ఆయా సంఘములుండును. గ్రామ ప్రజలందరు ఈ రెండు సంఘముల క్రింద ఆయా సంఘనియమాలకు లోబడి యుందురు. ఇవిగాక ఈ సంఘముల పెద్దలతో కూడినయొక గ్రామసంఘముండును. ఈ సంఘమును మన ప్రాచీన శాసనాల్లో అనేక విధములుగ పేర్కొనుట గనుపించును. పల్లవ విజయస్కన్దవర్మ ఒంగోదు శాసనంలో 'ఒంగోదు గ్రామశ్చ వక్తవ్యః' (క్రీ. శ. 4—5 శతాబ్దులు)[3] అని గ్రామమును సంబోధించి చెప్పుట గ్రామపెద్దల నుద్దేశించి చెప్పుటయే యగును. క్రీ. శ. 935 ప్రాంతము నాటిదగు కొరవి శాసనములో 'కొరవికిచ్చిన స్థితి' అని కలదు.[4] కొరవి పెద్దల కేర్పాటుచేసిన కట్టడి అని అర్థము చెప్పవలసియున్నది. క్రీ. శ. 4వ శతాబ్ద్యంతము నాటిదనదగు కొన్ని శాలంకాయన శాసనాల్లో 'ముతుడప్పముహోగామో భాణితవ్వో' అని దేవవర్మ ప్రాకృత శాసనం లోను,[5] హస్తివర్మ పెనుకొండ ప్రాకృత శాసనంలోను[6] కనుపిస్తుంది. 'ముతుడ' అనగా గ్రామసభకు అధ్యక్షుడని అర్థము. ముతుడ ప్రముఖమైన గ్రామ సంఘము నుద్దేశించి యిచట శాసన మాజ్ఞాపించబడెను. సాధారణంగా 'గ్రామేయ్య కాపుమా జ్ఞాపయతి' అని గాని, 'కుటుంబినస్సమాజ్ఞాపయతి' అని గాని, 'కూటక ప్రముఖాన్ కుటుంబినస్సమాజ్ఞాపయతి' అనిగాని గ్రామ పెద్దల నుద్దేశించి రాష్ట్రకూటాది అధికారుల నుద్దేశించి శాసనాలు ఆజ్ఞాపించబడును. కాకతీయులనాటి తెలుగు శాసనాల్లో కూడ గ్రామసంఘములు, అశేష ప్రజ, సమస్త ప్రజ, వేవురు, అష్టాదశ ప్రజ, కాంపులు మున్నగు పదములతో తెలుపబడుట గానవచ్చును.

ఇట్టి స్థానిక ప్రజాసంస్థలద్వారా మన ప్రాచీన గ్రామ పరిపాలన జరుగుచుండెడిది. ఈ సభల కధ్యక్షత వహించు ప్రముఖుని గ్రామకూటుడు, ప్రభువు, నాయకుడు, పెర్గడ, స్వామి, పెద్దకాపు, రట్టడి, రట్టోడి, రట్టగుడి, రడ్డి, రెడ్డి మున్నగు పదములతో వ్యవహరించుట శాసనములందు గనుపించును. ఇవియన్నియు పూర్తిగ సమానార్థకములని చెప్పజాలము. ఒకేశాసనములో వీటిలో రెండు పదనులతో నిద్దరిని తెలుపుట కూడ గనుపించును. నైదుంబ ఇరుగయ మహారాజుయొక్క కలుకడ శాసనములో వీటిలో కొన్ని పదవులతో కొందరు పేర్కొనబడుట ముందు చెప్పబడును. గ్రామముల ఆదాయ పరిమితులు బట్టిగాని, అధికార పరిమితులు బట్టిగాని యీ యవాం తరభేదము లేర్పడి యుండునని తోచును. శాలంకాయనులనాడు 'ముతుడ' అను పదముతో ఊరి పెద్ద తెలుపబడెను. వీటిలో కొన్ని పదవులు గ్రామమున కొకదానికేగాక కొన్ని సందర్భములలో కొన్ని గ్రామాల సముదాయమునకు లేక నాడులు, కంపనము లనబడు స్థలములకు కూడ వారధిపతులని తెలుపుచుండును. ఆ పదవులు ఇప్పటి సమితి అధ్యక్షుని పదవి వంటివి. ప్రభువు, పెర్గడ, నాయకుడు మున్నగు పదవులు అట్టి విపులాధికారమునుగూడ తెలుపును. కొన్ని సందర్భములలో కంపన ప్రభువు, స్థలనాయకుడు, అని స్పష్టముగ జెప్పబడును. కన్నడదేశములో పూర్వము నాడగౌడు అని నాడున కధికారి చెప్పబడెడివాడు.[7] ఈ సందర్భమున అధికారి యనగా రాజోద్యోగి గాని సామంతుడు కాని కాదు. ప్రజాప్రతినిధియని మాత్రమే అర్థము. వీరు చెప్పుటకు ప్రజాప్రతినిధులైనప్పటికి రాజులచేత వారి కనుకూలురగు వారుగ నియమింపబడుచుండెడివారు. వారికి ప్రభుమాన్యములని, పెర్గడ మాన్యములని వృత్తులను కూడ నొసగువారు. వారి హెూదా ననుసరించి కొన్ని పదవీ లాంఛనములు గూడ నిచ్చువారు.

నల్లగొండ జిల్లాలో అన్మోలు గ్రామంలో నొకశాసనమందు[8] కందూరు చోళవంశానికి చెందిన శ్రీదేవి తొండయ యనురాజు తన దాయాదియు అంతకు పూర్వపు రాజును అగు కందూరు గోకర్ణదేవ చోడుని నిర్జించి క్రొత్తగా సామంత రాజ్యాధిపత్యము వహించిన సందర్భమున నొక ప్రభువును నియమించుట చెప్పబడెను. అజ్జల యొఱయన పెగ్గడను వెలకు—70 పడి అన్మోలు (అలమల) ప్రభుత్వమొసగి యతనికి వృత్తిగ చాగమరి పండ్రెండు, దొడిదొర్తి పండ్రెండు అష్టభోగతేజ స్వామ్యముగ నొసగెను. పదవీలాంఛనముగ అడపము, అందలము, సుఖాసనము, శంఖులు, భేరులు, ఇత్యాదులు కూడ నొసగెను. ఇది సామంత పదవికాదు. సామంత పదవిలో మొత్తము వెలకు—70 గ్రామములపై నాధిపత్యమే గాని వేరుగ వృత్తులిచ్చుట యుండదు. ఇది యిప్పటి మన జిల్లా పరిషత్తు అధ్యక్షుణ్ణి నామినేటు చేయటం వంటిది. కాని మన పరిషత్తు అధ్యక్షుడు నామమాత్రంగానైనా ఎన్నుకొనబడును. పూర్వం అది కూడ లేకుండ రాజులే తమకు అనుకూలమైన వానిని నియమించి వానికి వృత్తులిచ్చేవారు. అతడు రాజునకు—ప్రజలకు నడును పరిపాలన బాధ్యతలు వహించేవాడు. పన్నులు వసూలుచేసి రాజున కిచ్చువాడు. న్యాయ విచారణలు చేయువాడు. స్థల ప్రభువుల క్రింద గ్రామ ప్రభువులుందురు. వారుకూడ రాజుచేత నియమించబడువారే. రాజులు మార్పు చెందినపుడు కొందరు గ్రామ ప్రభువులు మార్పుచేయబడుచుందురు. ఇట్లు

స్థముగ నుండువారి జోలికి రాజులు పోవువారు కాదు. ఈ సందర్భ మున మనకు పరిచితమైన కొరవి శాసనముదహరించదగియున్నది.[9]

ముదిగొండ చాలుక్య వంశానికి చెందిన గొణగయ్య అసురాజు కొన్ని రాజకీయ విషమస్థితుల్లో కొరవి విడిచి పారిపోయెను. అతని సోదరుడగు నిరవద్యుడు, వేంగిచాలుక్య రాజగు రెండవ భీముని ఆశ్రయమున క్రీ. శ. 934–5 ప్రాంతమున కొరవికి రాజయ్యెను.[10] నిరవద్యుడపుడు కొరవి నాయకుడగు పెద్దన యనువానితో నిట్లు చెప్పెను. (శాసనశిల విరిగిపోవుటచే పూర్తిపాఠము లభించుటలేదు).

''శ్రీనిరవద్యుణ్డనేక సమర సంఘట్టణ భుజాసి భాసురుణ్డై తమయన్న రాజ్యశ్రీకెల్ల
న్వాన యరుహుణ్డై చేకొని నిర్భి భీమనలుకి యన్దనేక వస్తువాహనోత్సవంబు
ల్వడయుచు తమయన్న గొణంగయ్య చేసిన ధమ్మస్వులు నసంబును
నెగల్పను గావను రక్షింపను వలయునని చేకొని కొరవికిచ్చిన స్థితి
సల్పి శిలాస్తంభంబు ప్రతిష్ఠించి ............ నల్లమేడెయ కొడుకు పెద్దన
రవించి నీవు నా ప్రాణసమానుణ్డవైన చెలవి నీ చేసిన యుపకారంబు,
నకు ప్రత్యుపకారంబు సేయవలయుంగాన నీకేమివలయు దాని వేణ్డికొ
మ్మన్న.......................''

ఇట్లు నిరవద్యుడు తన యన్నయగు గొణంగయ్య స్థానములో రాజ్య మాక్రమించుకొని కొరవిలోని పెద్దన నాయకుని మర్యాదగా బిలిచి వానిని మంచిగ జేసికొనును. కొరవి యెప్పుడైనను ముదుగొణ్డ వల్లులదే గనుక గొణంగయ్యయైనను నిరవద్యుడైనను తన కొక్కటే యని పెద్దన చెప్పెను. పిమ్మట నిరవద్యుడు తన యన్న లోగడ కొరవి ప్రజలకుచేసిన యేర్పాట్లనే తాను కూడ మన్నించెదవని చెప్పుచు ఆవిషయములను శాసనబద్ధము గావించును. (శాసనములో 'ననంబును' అను పదమునకు అర్థము తెలియదు. అనిశంబును=ఎల్లపుడును అను నర్థములో తప్పుగ వ్రాసెనేమో). ఆ స్థితి వివరము లిట్లుగలవు. ఇందుకొన్ని శాసన శిలభిన్నమగుటచేత లోపించినట్లు తోచును.

''ముక్కు దఱిగినను చఱిచినను చురియ వైచికినను
ముచ్చిలినను అంకాడినను ఇరువాద్యది ఏను ద్రమ్మలు
మాణిసి చేసిన దోసంబునకు వాని జీవితంబ దణ్డువు
వరియారంబంబు పడువరంబు వెల్లారంబంబు ఎరగద్యా
ణంబు పేరామణి పున్నమనాణ్డు ఏనూరు ద్రమ్మలరివెట్టి
సుఖంబు మనువారు నాయకుణ్డయ్యు కాంపులయ్యు
వెఱరాజులం బొచ్చి మనాంజనదు......'' అని కొంతభాగము
''పడియదయుంబోయు వెరెయంబు జిట్టరియెల్లన్దక్కి
చాంబొడిచిన నూటయిరువది ద్రమ్మలు మనం బొడిచిన
నఱువది ద్రమ్మలు అక్కసలకు కఱుకులిలేదు'' అని కొంత
భాగము కలదు.

ఈ రెండు భాగములలోను పెద్దన కొరవి ప్రజలనుండి వసూలుచేసి నిరవద్యునకు చెల్లించవలసిన పన్నులేవో జెప్పబడెను. వీటిలో కొన్ని నేరములకు శిక్షలుగా విధించునవి. నేరముల సంఖ్యను బట్టి యేడాదిలో వసూలుచేసి రాజున కిచ్చెడివి అవి. అవిగాక నికరముగ పన్నుల క్రింద జెల్లించెడివి వరియారంబంబు (=వరి పొలములపై విధించు పన్ను); పడువరంబు (దీని యర్థము సరిగా తెలియదు) పడువరి యని కన్నడములో పట్వారికి సమానమగు అర్థమున నొక పదము శాసనములలో నచ్చటచట గనుపించును. ఈ పన్ను పడువరి యనబడు కరణమువంటి యుద్యోగిద్వారా రాజునకు చెల్లించెడిది కావగును. అంటే పంటలతో నిమిత్తము లేకుండ భూమి మాత్రమునకై రాజునకు తప్పక చెల్లించెడి పన్ను. సిద్ధాయమని శాసనములందు తఱచు జెప్పబడునదిదియే గావచ్చునని తోచుచున్నది. దీని విషయ మింకను యోచించవలసియున్నది. మూడవ పన్ను వెల్లారంబంబు. అలాగే వెలి పొలములలో చేయు కృషికై చెల్లించవలసిన పన్ను. వరి యారంబము, వెల్లారంబము అనునవి రెండు వరి పంటలలోను, మెట్ట పంటలలోను ధాన్య రూపముగ రాజునకు చెల్లించవలసిన భాగములు కావచ్చును. నాలుగవది ఎరగద్యాణము. దీని యర్థము కూడ తెలియదు. గూడూరు శాసనములో విరియాల ఎఱ్ఱనకు బొట్టు బేతరాజు 'బిట్టెర గద్యానంబు' ఇచ్చినట్లు చెప్పబడెను. అనగా ఆ పన్ను వసూలు చేసికొను అధికారమిచ్చెనని అర్థము. సంవత్సరాది తరువాత వర్షాకాలము రాకముందు వ్యవసాయము ప్రారంభించు తరుణమున ముందుగా రాజునకు చెల్లించవలసిన పన్ను యగునని తోచును. ఇందుకుగాను పేరామణి పున్నమినాడు అనగ వైశాఖ పున్నమినాడు ఏనూరు ద్రమ్మలు పన్నుగా చెల్లించవలెనని చెప్పబడెను. ఈ యైదునూర్ల ద్రమ్మలు మొత్తము పన్ను లన్నిటి క్రింద చెల్లించవలసినదో లేక యెరగ ద్యాణముగ మాత్రము చెల్లించవలసినదో స్పష్టముగ తెలియదు. బహుశ ఎరగద్యాణము మాత్రమే కావచ్చును. వరియారంబము, వెల్లారంబము వర్షములపైన, చెఱువులలో నీటినిబట్టి నికరముగ నుండవు. ఒక యేడాది సాగైనది మరో యేడు సాగుకాకపోవచ్చును. ఒక్కొక యేడు రెండుమార్లు కూడ కొన్ని చెఱువుల క్రింది పొలాలు సాగగుచుండును. ఈ పరిస్థితి తెలంగాణములో నిప్పటికి చూచుచుందుము.

రెండవ భాగములో 'పడియద యుంబోయు వెరెయంబు' అను దానికి అర్థము తెలియదు. చిన్న కుంటల క్రింద సాగుజేయు స్వల్పభూములపై విధించు కొద్దిపాటి పన్నులు కాదగునేమో, ఇట్టి వాటిని 'చిట్టరి' (అనగా చిఱు+అరి) అని చిల్లర పన్నులతో జేర్చి చెప్పెను. ఇంటి పన్నులు, వృత్తి పన్నులు, వర్తక సుంకములు, సంత పన్నులు మొదలగునవన్నియు చిల్లర పన్నులలో జేర్చి వాటిని తక్క (విడిచి) మిగిలిన పెద్దపన్నులను రాజునకే చెల్లించవలెననియు, ఆ చిల్లర పన్నులను గ్రామ నాయకుడైన పెద్దన వసూలు చేసికొని, గ్రామము కొరకై వినియోగించవలెననియు చెప్పబడెను. ఊరి నాయ

కుని, కాంపులను ఈ పన్నులు వసూలు చేసికొని 'సుఖంబుండువారు' అని రాజు చెప్పెను. శత్రురాజుల నాశ్రయించరాదని శాసించెను. (కొన్ని పదముల అర్థము సరిగా తెలియకుండుట వలనను, వక్తవ్యాంశమును సూటిగా జెప్పకుండుట వలనను ఈ కొరవి శాసన మిప్పటికిని అర్థమగుట లేదు.)

కొరవి విడిచి పాటిపోయిన గొణగయ్య, అతని కొడుకు బద్దెగుడు వేములవాడ చాలుక్య రాజగు ఇమ్మడి అరికేసరి నాశ్రయించి మంథెన ప్రాంతపు గోదావరీ మండలములో సామంతులుగ నున్నట్లు చెన్నూరు అగస్త్యేశ్వరాలయములోని శాసనమువలన తెలియుచున్నది. నిజమునకు నిరవద్యుడు వారిని కొరవినుండి పారద్రోలలేదు. రాష్ట్రకూట గోవిందుని యొత్తిడివలన వారు వేములవాడ రాజాశ్రయము చేరిరి. ఇంతలో గోవిందుడు పదభ్రష్టుడాయెను. వేంగీశ్వరుడగు రెండవ భీముని సహాయముతో నిరవద్యుడు తన పిత్ర్యమగు కొరవిని స్వాధీనము చేసుకొనెను. ఈ భీమసలుకికి వేములవాడ అరికేసరి శత్రువు. కనుక కొరవిలోని గ్రామసభకు చెందిన పెద్దన నాయకుడు. ఇతర కాంపులు (సభ్యులు) అరికేసరి నాశ్రయించియున్న గొణగయ్య కొడుకగు బద్దెగుని పక్షము చేరుచో కొరవి మండలము శత్రువశమైనట్లగును. వారి దృష్టిలో బద్దెగుడు కూడ ముదిగొండ వంశము వాడే కనుక కొరవికి తగిన వారసుడే యగును. అందుచే నిరవద్యుడు కొరవి గ్రామ సభ్యుల నాదరించి బద్దెగుని పక్షము చేరకుండుటకై వారికి కొన్ని పన్నులధికముగ వసూలు చేసుకొనునట్టి యధికార మిచ్చి యుండును. రాజకీయముగ పూర్వము కొన్ని ముఖ్య గ్రామములలోని గ్రామసభలు ప్రముఖ పాత్ర వహించుచుండెడివి. ఇంతకుముందు చెప్పిన అనుమోలు ప్రభుత్వమును శ్రీదేవి తొండయరాజు ఇట్టి రాజకీయ విషమస్థితులోనే అజ్జల యెఱయన ప్రెగ్గడకు మార్చెను. ఇప్పుడు మనరాజకీయాల్లోగూడ పాలకులు తమ కనుకూలమగువారినే గ్రామ పంచాయితీల్లోను సమితి సంఘాల్లోను మార్చే విధంగా చూస్తూ వుంటారు. ప్రభుత్వాలెట్టివైనా రాజకీయ అవసరాలు, విధానాలు ఇంచు మించు ఒకే పోకడలో నుండును. స్థానిక సంస్థలను పాలకులెప్పుడు తమ చేతుల్లో పెట్టుకొనే యత్నం చేస్తూవుంటారు. అంటే ప్రజాస్వేచ్ఛను సాధ్యమైనంత తక్కువ స్థాయికి దింపితేగాని పాలకుల అధికారవ్యామోహం తీరదు. మన దేశములో ఈ స్థితి 12వ శతాబ్ది తరువాతనే ప్రారంభమైనట్లు తోస్తుంది. దీనికి పాలకుల అధికార కాంక్షతోబాటు తురుష్కరాజ ప్రతినిధుల నూతన పరిపాలన విధానాలుగూడ కారణమైయుండును.

కొరవి శాసనమునుబట్టి తెలియువిశేషాంశములు: (1) రాజులు మారినపుడు ప్రధాన నగర పాలకులను తాము స్వయముగ మన్నన జేసి తమ పక్షము గావించుకొందురు. అందుకు వారు అంగీకరింపనిచో అనుమోలు శాసనమందు జెప్పినట్లు క్రొత్త నాయకుని లేక ప్రభువుని నియమించెడివారు. కుగ్రామముల విషయములో రాజుల జోక్యముండ దనితోచును. (2) గ్రామములనుండి రాజులకు చెందవలసిన పన్నులు పరిమితముగ గ్రామ పెద్దల ద్వారా నిర్ణీతమగు మొత్తములలో చెల్లించబడెడివి. "వరియారంబంబు, పడువరంబు, వెల్లారంబంబు, ఎరగద్యాణంబు" — ఈ నాలుగు పద్దుల క్రింద మాత్రమే మొత్తం అయిదునూర్ల ద్రమ్మలు చెల్లించవలెను. గ్రామపెద్దలు ప్రతి రైతు నుండి యెంతెంత వసూలు చేయువారో రాజు పట్టించుకొనడని తెలియుచున్నది. కాని గ్రామపెద్దలు రైతులని మోసంచేసి యెక్కువ కాలం మనజాలరు. ఆ నిర్ణీతమైన అయిదునూర్ల ద్రమ్మల కంటె కొంచె మెక్కువగానే వసూలు చేయుదురు. కాని అది బహిర్గతముగనే లెక్కలలో చూపబడి గ్రామముయొక్క మంచి కొరకే యుపయోగించబడును. కనుక రైతుల అసంతృప్తికి కారణముండదు. గ్రామాల్లో రాజుల కరణాలు గాక రెడ్డి కరణాలు వేరుగనుండువారు. వీరు గ్రామసభకు చెందిన ఆయ వ్యయాల లెక్కలు వ్రాయువారు. ఈ పరిస్థితిలో గ్రామానికి చెందిన రెడ్డిగాని, నాయకుడుగాని ప్రభువుగాని యేయే భూమిపైన నెంతెంత పన్ను విధించవలెనో నిర్ణయించెడివారు. ఈ పన్ను ధన రూపంలో సిద్దాయమనే పేరుతోను ధాన్య రూపంగా కొలును, గొలుగు, కోల్చు అనే పేర్లతోను నుండెడివి. సిద్ధాయములో మార్పుండదు కాని కొలుచు పంటయొక్క దిగుబడిని బట్టి యుండును. చేలు కోతకువచ్చి పంటలు సిద్ధమైనపుడు ఫలధారు లనబడు ఉద్యోగులు యేయే పంటలో నెంతెంత కొల్చు (లెవి ధాన్యము) వసూలు చేయవలెనో నిర్ధారణ చేయువారు. అందువలన వీరిని ఫలధారులని పిలుచువారు. వరంగల్లు దగ్గర కొండపర్తి గ్రామం చెఱువులో నొక గుండు రాతిపైన 9వ శతాబ్దము నాటిదనదగు తెలుగు శాసన మొకటి గలదు." అందు పాలమెయ రట్టోడి (అంటే ఊరి రెడ్డి) యొక పాలమును సగపాలు కొలున

కిచ్చుచు ఆ నెల ఆయము నాలుగు ద్రమ్మలనియు, గొలుగు పుట్టెం డనియు నిర్ణయించును. ఇందులో ఆయము నేలకు మాత్రముగ రాజునకు చెల్లించవలసిన సిద్దాయమని తోచును. పంట పండినా పండక పోయినా గ్రామపెద్దలు సామూహికంగా రాజునకు చెల్లించే మొత్తంలో చేరుతుంది యీ నాలుగు ద్రమ్మలు. ఇంక రెండవది పుట్టెడు గొలుగు ధాన్య రూపముగ చెల్లించునది. ఇది పంట సక్రమముగా పండునపుడని భావించవలెను. ఈ కొండపర్తి శాసనము చెఱువులో నున్నది గనుక ఆ పొలము వరి పండునది. సాధారణంగా వరి చేలలో పంట నిలకడగా నుండును. కాల వైపరీత్యమేదైన వచ్చి పూర్తిగా పంట నష్టమైనచో ఫలధారుడు కొలుచును తగ్గించి వసూలు చేయును. మెట్టపైర్ల విషయంలో కూడ నిట్టి విధానమే యుండెడిది. కొరవి శాసనంలో కొలుచు సంగతి చెప్పబడలేదు గనుక అన్నిటి క్రింద నైదునూర్ల ద్రమ్మలు ధన రూపముగనే చెల్లించవలెను. కొన్ని సందర్భములలో రాజులు కొలుచులో కూడ భాగము తీసుకొనుట శాసనములందు గనుపించును. కాని ఆ ధాన్యమును రాజోద్యోగులు దగ్గరుండు సంతలలో రైతుల చేతనే అమ్మించి డబ్బుగా మార్చుకొనుట ఆచారముగ నుండెడిది. క్రీ. శ. 11–12 శతాబ్దాల వరకు పన్నులు చెల్లించే విధానం గ్రామ పెద్దల ద్వారానే జరుగుచుండెడిది. ఇంచుమించుగా గ్రామ పెద్దలే గ్రామాదాయానికి గుత్తదారులుగ నుండువారు. కనుక లాభంవస్తే అది గ్రామాభివృద్ధి కొరకే వినియోగించువారు. గ్రామంలోని వారిని మోసంచేసి గ్రామ పెద్దలు దీర్ఘకాలం మనజాలరు. రాజు గ్రామ మొత్తము మీదనే సామూహికంగా తమకు చెల్లించవలసిన సిద్ధాయమును అయిదునూర్లు, మున్నూర్లు మొదలగు పూర్తి వందలలో నిర్ణయించి దానికి గ్రామ కూటుని లేక రట్టడిని బాధ్యునిగ జేయువాడు. ఆ పెద్ద నాయకుడు ఇతర కాపులతో గూడిన సంఘము ద్వారా యేయే రైతునుండి, ఇంటి నుండి, కర్మకారుల నుండి యెంతెంత వసూలు చేయవలెనో నిర్ణయించి వ్యక్తిగతమగు పన్నులు విధించువారు. ఆంధ్రదేశములో కాకతీయులు రాకపూర్వము మండలముల పేర్లు కొల్లిపాక – 7000, వెలనాడు – 6000, వేంగి – 1000, సబ్బి – 1000 మొదలగు పెద్దసంఖ్యలతో అప్పుడపుడు మార్పు చెందుతూ వ్యవహరించబడెడివి. ఇతర ప్రాంతములలో గూడ నిట్టి వ్యవహార ముండుట ప్రసిద్ధము. ఇది కేవలము సిద్ధాయమునకు సంబంధించిన సంఖ్యయో లేక మతే దైనా భేదమును బట్టి యేర్పడినదో నిశ్చయముగ తెలియదు. గ్రామముల ఆదాయము మటుకు గ్రామ సంఘముల ద్వారానే రాజునకు చెల్లు చుండెడిది.

రాజునకు పన్నులు వసూలు చేయుటలో దేశమును శత్రువుల నుండి కాపాడుటయేగాక ప్రజలలో దుష్టులను శిక్షించుటకూడ నొక బాధ్యతయై యున్నది. శత్రువుల నెదుర్కొనుట రాజులే స్వయముగ జూచుకొనువారు. కాని నేరములు జేయువారిని శిక్షించు బాధ్యత యెక్కువగ గ్రామ సంఘ నాయకునికే విడుచువారు. కొన్ని ముఖ్యమగు నేరములకు విధించవలసిన శిక్షలను నిర్ణయించి వాటి ద్వారా ధన రూపముగ వచ్చు ఆదాయము తమకే చెల్లించవలెనని నిర్ణయము చేయువారు. పైజెప్పిన కొరవి శాసనములో పెద్దన నాయకునికి నిరవద్యుడు కొన్ని శిక్షా విధానములను జెప్పి వాటి ఆదాయమునే తనకు చెల్లించమని జెప్పెను. ఇతర స్వల్పశిక్షలను ఆయా కులముల పెద్దలు విధించి తామే వసూలు చేసికొనుటగాని లేక గ్రామ సంఘమునకు చెల్లించుట గాని జరుగుచుండెడిది. చాల పెద్ద నేరములు గాని, సరిహద్దు తగవులు, ఏటినీళ్ల తగవులు మున్నగువాటిని రాజులు స్వయముగనో తమ ప్రతినిధులో తీర్చువారు. గ్రామంలోజరిగే ప్రతి అక్రమము, నేరము గ్రామ నాయకునికి తెలియకుండ తప్పిపోయెడిది కాదు. అందు మూలముగ తాను విధించు దండనలను కొన్నిటిని రాజునకు చెల్లించును. ముక్కు దఱుగుట, చఱుచుట, కత్తితో పొడుచుట, దొంగతనము చేయుట, అంకుతనము చేయుట – వీటికి ఇఱువదియైదు ద్రమ్మలు శిక్ష. మానిసి చేసిన యపరాధమునకు వాని జీవితంబ దండువ. అనగా రాజభటుడేదైనా ద్రోహమునకు పాల్పడినచో వాని వృత్తి మాన్యమును తీసివేయవలెను. లేక వాని ప్రాణమును తీయు శిక్ష విధించవలెను. ఇట్టి నేరములను విచారించి శిక్షలు విధించు అధికారము గ్రామ నాయకుడగు పెద్దన కొసగబడెను.

ఇట్టి గ్రామవ్యవస్థ ఒక్క కొరవి శాసనములోనేగాక మఱికొన్ని శాసనములందుగూడ గనుపించును. ఇంచుమించు అదేకాలమునకు వాయల్పాడు తాలూకాలోని కలుకడ శాసన మొకటి యిట్లే గలదు. దీనిని శ్రీ. హెచ్. కె. నరసింహస్వామిగారు వివరణములో ప్రకటించిరి.[12] వైదుంబాన్వయుడగు భువన త్రినేత్ర శ్రీమదిరిగెయ మహారాజు రాజధానియగు కలుకడలో పట్టాభిషిక్తుడైన సందర్భమున ఆ ప్రాంతము కాపులకు కొన్ని కట్టుబాట్ల నొసగును. ఆ శాసన భాగమిట్లుండును.

> "స్వస్త్యనేక సమరసంఘట్టనోపలబ్ద విజయలక్ష్మి సమాలింగిత విశాళ వక్షస్థల భువన త్రినేత్ర శ్రీ మదిరిగెయ మహారాజు దన పట్టంబు గట్టిన సవోత్సంబున వేనాణ్డి కాపులకు దయసేసిన స్థితి[I*] దొగరాచ పణ్ణును, పడెవాళ పణ్ణును, పడియేరి
> పణ్ణును, సన్దివిగ్రహి పణ్ణును వెలిగాను సద్దక్కంబడిన
> తివుళ్దెసంబు మొదలుగాను జీఱుదెఱశెల్ల వాయురాది
> త్యంబు విడిచె [I*] ఈ స్థితివడసినవారు
> ........................(అని ఆ కాపులపేర్లు గలవు)"

వీరిలో కొందరు గాముణ్డులు, ఒకరట్టోడి, ఒక రట్టగుడి కూడ గలరు. వారిలో తారతమ్యమెట్టిదో సరిగా తెలియదు. ఇందు రాజునకు చెల్లించవలసిన పన్నులు నాలుగుమాత్రము పేర్కొనబడెను. 1. దొగరాచపన్ను. 2. పడెవాళపన్ను. 3. పడియేరి పన్ను, 4. సన్దివిగ్రహిపన్ను. ఇవి యన్నియు కలిసి రాచపన్ను అగును గనుక రాచపన్నును విడిగా జెప్పలేదని తోచును. ఇందు 1. దొగరాచపన్ను– అనగా యువరాజపన్ను. అంటే భవిష్యత్తులో గాదగిన రాజు నేర్పాటు చేసినందుకు ప్రత్యేకించి పన్ను. 2. పడెవాళ పన్ను–అనగా పడవాలు లేక సేనాధిపతి నేర్పాటుచేసి దేశమును కాపాడుచున్నందుకు పన్ను. 3. పడియేరిపన్ను–అనగా పడిహారి లేక రాజద్వారపాలకుల నేర్పాటు చేసి రాజరక్షణ జేయుచున్నందుకు పన్ను. మహా ప్రతిహారి పూర్వపు రాజరిక వ్యవస్థలో నొక గొప్ప పదవి. వాని యనుమతిలేక యెవ్వరు

రాజగృహములోనికి బోజాలరు. కాని యిచటి పడియేరి పన్ను కొరవి శాసనములోని 'పడువరంబు' అనునొక భూమిపన్ను [పడువరి యన బడు నొక రాజోద్యోగి (పట్వారి)కి చెల్లించవలసిన భూమిపన్ను] అగునేమో తెలిసికొనవలసియున్నది. 4. సన్ధి విగ్రహిపన్ను — అనగా దేశముపై యుద్ధములు రాకుండ సామదాన భేదోపాయములద్వారా కాపాడుట కేర్పడిన పన్ను. ఈ నాలుగు పన్నులు వెలిగా మిగిలిన చిఱు దెఱశెల్ల అనగా చిల్లర పన్నులన్నిటిని ఆ కాంపులే వసూలు చేసికొని తమ గ్రామాలకు వినియోగించుకొనవచ్చును. ఇచట తివుళ్దేసంబు మొదలుగా నన్న పదమునకు తమిళదేశము హద్దుగాగల వేనాంటికని అర్థము కావచ్చును. ఈ చిల్లర పన్నులలో పచ్చిక పన్ను, పశువుల పన్ను, పంటలపన్ను, వృత్తిపన్ను, ఇళ్లపన్ను, వర్తకసుంకాలు, మొద లగునవి స్థానిక సంఘముల కాంపులకే రాజు విడిచెను. ఈ శాసన మందు కూడ నేరములకు శిక్షలు విధించు అధికారము కాంపులకే యొసగెను. ఒక్క అంకుతనమునకు మాత్రము శిక్షను నిర్దేశించెను. అక్రమమైన ప్రవర్తనయని నిరూపించబడినచో స్త్రీ పురుషుల నిరు వురిని చంపవచ్చుననెను. అట్లు కాకపోయినచో ఆడదాని ముక్కు కోసి మగవానికి ఇఱువదినాలుగు గద్యెలు (గద్యాణములు) శిక్షవిధించి బహుశ రాజునకే చెల్లించవలెనేమో. మిగిలిన నేరములను గూర్చి చెప్ప లేదు గనుక అవిఅన్నియు కాంపుల నిర్ణయమునకే వదలెను. ఈ శాస నములలో ఆ కాలపు కొన్ని శిక్షావిధానాలు చెప్పబడెను. అవి మన కిప్పుడు అనాగరికములుగా నుండును.

## ముగింపు

సుమారు క్రీ. శ. 12వ శతాబ్దివరకు మన దేశములో గ్రామ వ్యవస్థ యొకవిధమగు స్వతంత్ర ప్రతిపత్తి గలిగియుండెను. గ్రామణి లేక గ్రామపెద్ద, నాయకుడు, ప్రభువు, రట్టడి, గాముండ మున్నగు పదములతో వ్యవహరించబడుచుండెడివాడు. అతడు పాలకునిచే నియ మితుడైనను, గ్రామములో నందరిచేత పెద్దవాడుగ గౌరవింపబడు చుండెను. అతనికి కాంపులనబడు తెగల పెద్దలు సహాయ సభ్యులుగ నుండి గ్రామములోని మంచిచెడ్డలు సమిష్టిగా జూచుచుండెడివారు. ప్రజలకు రాజునకు మధ్య గ్రామ నాయకుడు బాధ్యత వహించి పన్నులు వసూలుచేయుచుండువాడు. నేరము చేసినవారిని విచారించి శిక్షలు విధించువాడు. గ్రామ పాలకుడతడనియే చెప్పవచ్చును. పన్నును వసూలు చేయుటలో రాజులు గ్రామమునొక సమిష్టి పరిమాణము (యూనిట్)గా జేసియుండిరని తోచును. ఏనూరు, మున్నూరు, నన్నూరు ద్రమ్మలనియో గద్యాణములనియో పూర్తి మొత్తంలో గ్రామా దాయమును రాజులు నిర్దేశించుటచేత సేద్యము చేయబడు భూముల వివరములు అంతగా లెక్కింపబడుచుండెడివి కాదు. గ్రామ ప్రజలు సేద్యము చేసుకొను భూమికాక, రాజునకు చెందిన భూమికూడ కొంత కొన్ని గ్రామములలోనో లేక అన్ని గ్రామములలోనో యుండెడి దని తోచును. ఈ యంశముపై పరిశోధించవలసియున్నది. ప్రభు త్వానికి చెందిన కొన్ని భూములను బ్రిటిషు పాలనలో క్రిస్టియను మతము స్వీకరించినవారికి, తరువాత పాలనలో స్వాతంత్ర్య పోరాటంతో పాల్గొన్నవారికి, రాజకీయ బాధితులకు పంచిపెట్టుట మన మెరుగు దుము. మనం చర్చించు 12వ శతాబ్దికి ముందు గ్రామవ్యవస్థ సామా జిక వ్యవస్థకు (సోషలిస్టు విధానానికి) దగ్గరున్నట్లు కనుపించును గాని అట్టిదికాదు.

అట్టి దగ్గర సంబంధ మున్నదని గ్రహించియే మన తొలి కాంగ్రెసు నాయకులు కొందరు ఈ నాగరికత వాతావరణంలో కూడ గ్రామ స్వేచ్ఛను కాపాడవచ్చునని చెప్పుచుండెడివారు. ఆంధ్రకేసరి ప్రకాశం పంతులుగారు ఉత్పత్తి–వినియోగదారుల సహకార సంఘ ఉద్యమమును ప్రతి గ్రామంలోను ప్రచారముచేసి కొన్ని గ్రామాల్లో అట్టి సంఘములను స్థాపించిరి. అంటే రాజకీయ పార్టీలతో నిమి త్తము లేకుండ గ్రామంలో ఉత్పత్తియగు వస్తువులు ఆ సహకార సంఘముద్వారానే గ్రామానికి కావలసినంత ఉంచుకొని మిగిలిన వాటిని యెగుమతిచేయుట, అచట దొరకని వస్తువులను, ఎరువులు మున్నగు వాటిని గ్రామానికి కావలసినంత ఆ సంఘముద్వారానే తెచ్చుకొని పంచుకొనుట, అను సిద్ధాంతముపైన ఆ యుద్యమ మేర్పడెను. ఆశయం గొప్పదేకాని యీ రాజకీయ వాతావరణంలో ఆచరణపట్ల సాధ్యము కాలేదు. అన్ని విషయాలు చాలవటుకు జాతీయం చేయ బడుట, భారీ పరిశ్రమలు స్థాపించుట మున్నగు ఆర్థికాభివృద్ధికి తోడ్పడు నేటి నాగరికతలో గ్రామాభివృద్ధి సాధ్యము కావచ్చును కాని స్వేచ్ఛాయుతమగు గ్రామవ్యవస్థ కష్టసాధ్యము. జాతీయ వ్యవహార లంటూ లేని ఆనాటి విధానా లీనాడు ఆచరణయోగ్యం కావు కాని ప్రకాశం పంతులుగారు సూచించిన విధంగానైన కొంతమటుకు గ్రామాల్లో సామాజిక వ్యవస్థను నిర్మించుకొనవచ్చును.

## విశేషాంశ సూచిక


1 డా. ప్రాణనాథ్ - 'ఎకనమిక్ కండిషన్ ఇన్ ఏన్షంట్ ఇండియా' పు. 54.

2 ఎపి. రిపోర్టు 1918, II–84, 85.

3 ఎపి. ఇండికా XV–పు. 251 -

4 ఎపి. ఆంధ్రికా I–పు. 142:

5 ఎపి. ఇం. IX–పు. 58.

6 ,, ,, XXXV–పు. 148.

7 డా. జి. యస్. దీక్షిత్–'లోకల్ సెల్ఫ్ గవర్నమెంటు ఇన్ మిడీవల్ కర్ణాటక,' పు. 46, 47.

8 పి వి. పి. శాస్త్రి, 'సెలెక్టు ఎపిగ్రాఫ్స్ ఆఫ్ ఆం. ప్ర.'–పు. 38–40.

9 ఎపి. ఆం. I–పు. 142; వరం. జి. శా–పు. 10–15.

10 భారతి, డిసెంబరు 1979,–పు. 32–37.

11 వరం. జి. శా–పు. 315.

12 ఎపి. ఇం. XXX–పు. 283.

# ఊరంటే సొర్గం

డాక్టర్ గంధం జోయెల్

అనగనగ
ఒక ఊరుంటది !
ఆవూరి సుట్టు
దట్టమయిన అడ్వి !
అడ్వంటే కాకులు దూర
కారడ్వి గాదు ! —
శీమలు జొరవడని
శిట్టడివిగాదు;
అటుకొండ !
ఇటుకొండ !
నడ్మ గుమ్మకొండ !
పొద్దు గూకేయాల్ల
కొండమీన సూర్యుడు
పడమటి దిక్కుకు
ఆలిపోతుంటె
శెప్పలేనుగాని, నూశి
తీరాలె సొగుసు !

అత్తగారింటికి
కొత్తల్లుడు
ఎల్తున్నట్లుంటది !
నెత్తురు — కొండల
నెత్తులకు పుల్మినట్లుంటది !

పొద్దుగాల్ల బయలెల్లిన
పస్లగాశె పోరగాల్లు
తుమ్మశెట్లుదాటి,
అరిశెలగట్ల పొంబెల్లి
ఆవలి కాల్వల కాల్లు గడుక్కొని,
తిరిగస్తుంటె ...

అంబటాల్ల కూలికొచ్చిన
ఆశమ్మ; పోశమ్మ;
ఎల్లమ్మ; మల్లమ్మ
పంటోల్లను సరికకెత్తుకొని
ఒయ్యారమొల్కనడ్సుకుంట
ఇంటి తొవ్వబట్టి
ఊర్లెకు మల్తుంటె
మస్క మస్కగ
మబ్బయితది !
మాపయితుంటె
ఊర్కి కలొస్తది !

ముసలావులు
ల్యాగల జూశి,
అంబా అంటవి అరుస్తుంటె
ల్యాగలు తోకలాడిచ్చుకుంట
తల్లి ఆవులసుట్టు
కలె దిర్గుతవి !

శెట్లమీన; గట్లమీన
పిట్టలు; ఊరవిశ్కలు
గూల్లకు మల్తుంటె
వారెవా ! ఎంత బాగుంటది !

ఊర్లెవుంటోల్లకు
పికరుండదు ఎక్వ
గ్యాసునూనె గావాలంటె
వర్సల నిలవడాలని
ఖానూను లేదు ! —

నల్లాలురాని దినం
నల్లల సుట్టు
పడిగాపులు గాశే
పనేవుండదు !

కరెంటు దీపాలెల్గకుంటె
శీకట్ల తారట్లాడే
తిప్పలుండదు !
అందుకే వూరంటె
నాకిష్టం !
వూరంటే అది సొర్గం !
రాతిర్ల
బువ్వల్దిన్నంక
పెద్ద మన్సులు
పుర్సత్గ సుట్టలు
గాల్సుకుంట
సావిడికాడ గూకుండి
అక్కడిక్కడి
మత్లబ్లు జెప్పుకుంట
గూకుంటరు —

నడ్మ నడ్మ ఈనడ్మ
వూరికి సర్కారిచ్చిన
రేడియ బాజల సైన్మ
పాటలిన్కుంట
రుమాలోల్లు తలలూపుతుంటె
దుడ్డెగాల్లు; వయసు పోరలు
పలోల్ల మొకం జూస్కుంట
ముసినగులు నగ్తరు
పరాష్కం జెస్తరు —

అద్దమ్మ న్యాతిర్ల
అల్లంత దూరాన
తొల్త జమానల
రాజు గట్టిన పాత
ఖిల్ల బుర్జు గోడమీన
వోరకు గూకుండి
పెద్ద పిట్టరుస్తుంటె
జరమొచ్చి, లెస్సపెయిగాల్తున్న
శివబాలవి పెద్దకొడ్కు
వుల్కిపడి లేస్తడు !

గుడ్లగూబొర్లుతుంటె
బగ్గ బుగులయితది !
పిరికోడు అదుర్తడు
వాడు బత్కుల శాన్నామాట్లు
సస్తడు –
దైర్నం జేసినోడె
ఏడన్నగని,
ముంగట వడ్తడు !
గందుకే నాకు
ఊరంటే యిష్టం
వూరంటే
వివొద్దె సొర్గం !!!

---

# నా గీతం

శ్రీ వజ్ఝల కాళిదాస్

వినండి వేగం
వినండి గప్పన
విరుచుకు పడుతూంది
మహా ప్రవాహం !

సల సల సల మని
మరిగిన లోహం
భగ భగ భగమని
మండిన దాహం – నా

గుండెల పగిలిన
కండల రగిలిన
శోణిత గీతం
శ్రుత నిర్ఘాతం
చమకిత విద్యు
ల్లతా పునీతం
ద్రుత వేగోద్ధత
ఝంఝూవాతం ... నా గీతం ...

భుగ భుగ భుగమని
పొగలు చిమ్ముతూ
ధగ ధగ ధగమని
వెలుగు రిమ్ముతూ
గుబ గుబ గుబమని
సెగలు క్రక్కుతూ

మానవతా మహాగ్ని పర్వతం
పగిల్చి వచ్చిన లావాప్రవాహం
పరుగులు పెడుతూంది
విరుచుకు పడుతూంది !

సవన వాటికల
హోమ జ్వాలలు
చల్లారిన ఈ పవిత్ర సీమల

ఆర్ష కన్యకల
సామగానములు
వినిపించిన ఈ పునీత భూముల

భగవద్గీతా
ప్రబోధ సంపద
ప్రభవించిన ఈ
కురుక్షేత్రమున

నీలో నాలో
నిలిచే దాకటే
గెలిచే దాకటే

సత్యం ధర్మం
శాంతం యుక్తం
మానవతాచ్ఛ మహత్వం
నవమానవతా తత్వం !

శ్రీ మల్లంపల్లి శరభయ్య

# కన్నుల ఎదుట కైలాసం

[కాళహస్తిలో శ్రీ జమదగ్నిశర్మగారి సన్మాన సమయంలో శ్రీ మల్లంపల్లి శరభయ్యగారు చేసిన ప్రసంగం- సం.]

ఓ దక్షిణ కైలాస వాస్తవ్యులారా! ధన్య జీవులారా! మిమ్మల్ని 'సహృదయులారా!' అని సంబోధించటానికి సంశయంగా ఉన్నది. నేడిచ్చట సమావేశమై యున్న మీలో అలనాటి ఆ శ్రీ, ఆ కాళమూ, ఆ హస్తీ, ఆ కన్నప్పా చేరియుండరు కదా! అని భయంగా ఉన్నది. నిజానికి మిమ్మల్ని 'ప్రమథులారా!' అని సంబోధించవలసి యున్నది. మీరందరూ నాకు ఆత్మబంధువులు. శివమయమైన ధూర్జటి కవితా సంబంధం నన్ను మీ మధ్యకు తీసికొని వచ్చింది. స్వామి సన్నిధిలో శ్రీకృష్ణదేవరాయ మహాప్రభువు నిర్మించి సమర్పించిన యీ మంటపంలో ధూర్జటి మహాకవిని గూర్చి ప్రసంగించే మహాభాగ్యం నేడు లభించింది. స్వామి కృపాకటాక్షం నామీద ప్రసరించిన దనటానికి యింతకంటె ప్రత్యక్ష నిదర్శనం యింకేమి కావాలి?

ఈ ప్రసంగానికి ముందు ఆత్మీయమైన ఒక విషయం స్వామి సన్నిధానంలో మీరు శ్రోతలుగా మనవి చేయవలసియున్నది.

అసలు నే నెవర్నో, చుట్టూ ఉన్న యీ లోకం ఏమిటో, దీనిలోనికి నేను ఎప్పుడు ఎలా వచ్చానో, ఇది ఏదేశమో, ఏ కాలమో, ఈ తెలుగు నాకు తల్లిభాష ఎలా అయిందో, ఇవి యేమీ తెలియనినాళ్లలో నాకు తెలిసినదంతా — ఒక్క మా అమ్మ! నాకు ఆశ్రయమైన యీ శరీర గృహానికే కాదు. నా తెలివికీ ఆమెయే కారణం. ఎన్ని కథలు చెప్పేదో! నేటికి అవన్నీ మఱచిపోయాను కదా! అసలు — ఆమె కథ చెప్పినట్లే ఉండేదికాదు. "కాలకూటము కుత్తుకకు రాకమున్న, త్రాలు పురంబులు కాలకమున్న, గౌరి వివాహంబు గాకటమున్న, అర నజాండమ్ము లలరక మున్న భువి హరి బ్రహ్మలు పుట్టకమున్న, తివిరి మూర్తులు నెన్మిదియు లేకమున్న, అటమున్న అటమున్న అటమున్న మున్న" — ఎన్నడో మఱచిపోయిన సంగతులన్నీ గుర్తుకు వస్తున్నట్లే ఉండేది. ఈ నా బ్రదుకులోని శివ కథా విజ్ఞానం అంతటికీ ఆమెయే మూల కారణం.

ఒకనాఁడు ఆమె యీ పద్యంలోని భావం యిలా చెప్పింది—

"ఫలములఁ గాచు నద్రిసుత పాణి శుకంబు, వృషంబుగాచు శా
ద్వలములఁ; గాచు విఘ్నపతి వాహన మక్షతరాజి; కాచు జో
గుల యిలు వేల్పు వాజి మదిఁ గోరక బోనము; భక్తులీశ్వరున్
గొలిచెడి దాఁక; తత్ కుధరకూట గళత్ తటినీ తటంబులన్."

—"శ్రీ కాళహస్తి కొండ ప్రక్కనే ఒక నది ప్రవహిస్తూ ఉంటుంది. ఆ నది ఒడ్డున తోటల్లో పండ్లమీదికి చిలుకలు రాకుండా పార్వతీదేవి చేతి చిలుక కాస్తూ ఉంటుంది. పచ్చికబీళ్లు నందీశ్వరుఁడు కాస్తూ ఉంటాడు. శివపూజ కోసం అమర్చిన అక్షతలను విఘ్నేశ్వరుని వాహనం కాస్తూ ఉంటుంది. కాలభైరవ స్వామి వాహనం నైవేద్యములను కాస్తూ ఉంటుంది. ఎందుకని? భక్తుల శివపూజలు పూర్తి కాలేదు. పూర్తి అయేటంత వరకూ యివన్నీ నిశ్చలంగా యిలాగే ఉంటాయి!"

నిజానికి ఆ పదార్థాలన్నీ అవి తినేవి! అయినా తాము ప్రలోభపడకుండా, తమ జాతికి చెందిన మిగిలినవీ ఆ ప్రాంతాలకు రాకుండా అవి కాపాడుతున్నాయి. ఎంత ఆశ్చర్యకరమైన దృశ్యం! అన్నింటికన్నా ఆశ్చర్యం ఎలుక అక్షత గింజలను కాపలాకాయటం!

తొలిసారి నా మనస్సులోనికి స్వర్ణముఖరీ తీరాలతో శ్రీ కాళహస్తి మహాక్షేత్రం యీ విధంగా ప్రవేశించింది. శివలోక వైభవము లన్నీ ఆమె కథలలో కన్నులకు కట్టినట్లు ఉండేవి. అప్పుడు తెలిసింది. కాళహస్తి దక్షిణ కైలాసం ఎందుకు అయిందో! ఆమె చెప్పిన ఆ సంగతులే నా గుండెలో దారాలుగా అల్లుకుపోయి స్వామి చుట్టూ గుడులు కట్టాయి. ఆ పసితనంలోని స్వచ్ఛతా, ఆర్ద్రతా, మంచుగా కురిసి అవి ముత్యాల గుడులై మిలమిలా మెఱసిపోయేవి!

ప్రాయం ప్రొద్దెక్కుతున్న కొలఁదీ — అనివార్యంగా దేశకాల జ్ఞానం ప్రబలిపోయి తొలినాటి ఆ జగత్తునకు దూరమైపోతున్నానే! అని నాకు దిగులుగా ఉంటుంది.

మా, మాతామహులది భారద్వాజ గోత్రం. మా అమ్మ ధూర్జటిని గుఱించి ప్రస్తావించేటప్పుడు తమ పుట్టింటి వారిని గూర్చి ముచ్చటిస్తున్నట్లే నాకనిపించేది, ఆ ధూర్జటి తనకు నాన్నగారో అన్నగారో అయినట్లు!

ఆ మాటకు వస్తే — ఈ జమదగ్ని శర్మగారికీ నాకూ రక్త సంబంధం యేమీలేదు. ఈయనను మొదటిసారి చూచినప్పుడు మా అమ్మవైపు చుట్టమల్లే అనిపించింది. బహుశః మా అమ్మ కొడుకే కావచ్చునన్నంత రూఢిగా. అందువల్లనే "అన్నగారూ!" అని పిలవటం అలవాటయింది. నేటికి యీయన యీ కాళహస్తిలో స్థిరపడి

యీ ధూర్జటి జయంతికి అంత దూరం నుండి నన్ను రమ్మని బలవంతపెట్టటం బలంవల్లనే కదా!

ఇంతకూ—మా అమ్మ శ్రీకాళహస్తి క్షేత్రం సేవించనేలేదు. నేను పెరిగి పెద్దవాడనయ్యేసరికి ఆమె కదలలేనంత పెద్దదయింది. చిన్ననాఁడు తాను చెప్పిన కథలన్నీ మళ్ళీ ధూర్జటి కావ్యంలో తనకు వినిపించానే కాని దక్షిణ కైలాసం ఆమెకు చూపించనేలేకపోయాను. శ్రీకాళహస్తి మాహాత్మ్యమూ, శతకమూ వింటూ ఉన్నప్పుడు ఆమె చూచినట్లే పరమానంద భరితురాలయ్యేది. ఈ క్షేత్రాన్ని పసినాడు నా హృదయంలో అంత విస్పష్టంగా ప్రవేశింపజేసిన ఆమెకు నేను ఈ క్షేత్రం చూపించలేకపోయానే! అన్న వెలితి నా కయితే తీఱలేదు గాని ఆమెకేమి? ఆమె ధన్యురాలే. మా అమ్మవంటి వారిని ఉద్దేశించే ధూర్జటి తన శతకంలో యిలా చెప్పియున్నాడు.

"కేదారాది సమస్త తీర్థములు భక్తిన్ గొల్వఁబో నేటికిన్?
గాదా ముంగిలి వారణాసి! గడపే కైలాస శైలంబు; నీ
పాద ధ్యానము సంభవించినపుడే భావింప నజ్ఞాన, ల
క్ష్మీ దారిద్ర్యులు గారె! మర్త్యులకటా! శ్రీకాళహస్తీశ్వరా!"

వెనుకటి రోజుల్లో అంతా తీర్థయాత్రలుచేసే తరించారా! అంటే — లేదు. నిజానికి శ్రీనాథ ధూర్జటుల వంటి మహాకవుల కావ్యాలే వారి పాలిటికి భావస్థిరములైన క్షేత్రాలు. వానినే విని, భావించి, వారు తరించారు. అవి — కావ్య స్వరూపాన్ని ధరించిన జంగమ క్షేత్రాలే కాని కేవలం కావ్యాలు అనటానికి వీలులేదు. వానిని తలంచుకుంటేనే ఒళ్ళు జలదరిస్తుంది.

ఓహో! ఏమి తెనుఁగు భాష! ఏమి తెనుఁగు దేశం! మిగిలిన వారి మాట నాకు అనవసరం. పుడితే నేను ఎన్ని జన్మలకైనా యీ దేశంలోనే పుట్టాలి. ఈ కావ్యాలే చదవాలి. ఈ దైవములనే సేవించాలి. అందులో — శ్రీ కాళహస్తీశ్వర స్వామిని తలంచుకున్నప్పుడు అసలు — ఈ స్వామి తియ్యదనమే వేఱు. కేవలమూ యిది పొత్తపి నాటి అడవుల తేనె! ఈ తేనె తియ్యదనమంతా తెనుఁగు భాషలోనికి అందులోనూ ఒక్క ధూర్జటి పలుకులలోనికే సరాసరి దిగినదేమో అనిపిస్తుంది. ఈ నేలకూ యీ భాషకూ యీ దైవం యేనాటి చుట్టమో కదా!

"ఓ సామీ! యిటువంటి కొండదరిలో ఒంటిన్ పులుల్ సింగముల్
గాసిం బెట్టెడి క్రూర నట్టడవిలో కల్జువ్వి క్రీనీడ, నే
యాసన్ గట్టితివేటి గడ్డ నిలు; నీ వాకొన్నచోఁ గూడు, నీ
శ్లే సుట్టమ్ములు తెచ్చి పెట్టెదరు? నీ కిందేటికే! లింగమా!"

"ఇల్లో ముంగిలియో! యనుంగుఁ జెలులో! యీడైన చుట్టమ్ములో!
యిల్లాలో సుతుఁడో, తరింపవశమే! యే పోదుముల్లేక; మా
పల్లెన్ గోరిన వన్నియున్ గలవు తెప్పల్గాఁగ నీ కిచ్చెదన్
జెల్లంబో! యిట నొంటి నుండ కట విచ్చేయంగదే! లింగమా!"

నిజమే! అసలు అంతవఱకూ ఈ స్వామి ఊసు ఎవరికి పట్టింది? ధూర్జటి యీ పద్యాలే లేనినాఁడు ఈయన సంగతి యెవరికి తెలిసి ఉండేది?

నాకు అయిదు — ఆరేళ్లప్పుడు మా పెద్దన్నయ్య యీతిన్నడి కథ వినిపించటం జరిగింది. కాళహస్తి మాహాత్మ్యంలో యీ పద్యాలే నాకు మొదటగా వచ్చాయి. అయినా మద్రాసు వెళ్లిన పిమ్మట నా యిరవయ్యో యేటగానీ — నేను కాళహస్తి మాహాత్మ్యం చదవటం పడనేలేదు. అప్పటికి నేను చదివింది పాండురంగ మాహాత్మ్యమే. అప్పట్లో ఆ కావ్యమంటే నాకు తెగని మోజుగా ఉండేది. ఇప్పటికీ ఆ గ్రంథం దాదాపు నాకు కంఠస్థమే. అదేమి చిత్రమో! కాళహస్తి మాహాత్మ్యం చదివిన పిమ్మట అంతటి మోజూ నాకు తెలియకుండానే ఎలా విఱిగిపోయిందో విఱిగిపోయింది. అచ్చమైన కవితా మాధుర్యం ఎలా ఉంటుందో, సహజమైన భక్తి లక్షణం ఎలా ఉంటుందో తొలి సారిగా తెలిసింది.

తెనాలి కవి కావ్యంలో సాహిత్య ప్రౌఢి యెంత ఉన్నా, యీ మాధుర్యంలేదే! అనిపించింది. లోపల మధన మొదలయింది. గురువుగారు శ్రీ విశ్వనాథవారు ఒకసారి మద్రాసు విచ్చేసినపుడు — ఈ విషయం మనవి చేశాను. వారిలా అన్నారు: "నీవు అనుకునేది నిజమే. ధూర్జటి ఆత్మకు శివసాన్నిధ్య సుఖం తెలుసు!"

కాళహస్తి మాహాత్మ్యం చదివినప్పటి నుండీ— కాళహస్తి వెళ్లి స్వామిని చూడాలనే తహతహ ప్రబలింది. సరిగ్గా మా గురువుగారికీ మొదట యిలాగే అనిపించిందని యీ మధ్యాక్కరవల్ల తెలుస్తున్నది.

"తొలినాడు కలకండ పలుకులం బోని ధూర్జటివైన
పలుకులం బోని దాహమ్ము చూచెడి వఱకాగిరాని
అలసటై నిను వచ్చి చూచి."
ఇది మా యిద్దఱికీ తుల్యానుభవం!

కలకండ పలుకులలో దప్పిక పోగొట్టే లక్షణం ఉంది. కలకండ పలుకుల వంటి ధూర్జటి పలుకులలో మాత్రం స్వామి మీద దప్పిక పెంచే విలక్షణత్వం ఉన్నది.

మద్రాసు నుండి ఒక తెల్లవారు జామున బస్సులో శ్రీ కాళహస్తి బయలుదేరాను. మనస్సంతా కాళహస్తి మాహాత్మ్యమే నిండియున్నది. జాము ప్రొద్దెక్కేసరికి యెండల్లో ధగద్ధగితమై దూరాన గోపురం కానవచ్చింది. కైలాసం యెదురైనాకు దగ్గఱగా వస్తున్నది! గుండె ఝల్లుమన్నది. ఆ క్షణంలో యీ శరీరబంధం వీడిపోతే ఎంత బాగుండును! అనిపించింది. క్రమంగా మిగిలిన గోపురాలు ఆలయ శిఖరాలు ప్రాకారమూ స్వర్ణముఖరీ కనిపించాయి. ఆ సరస్సులో మునిగి లేచేసరికి ఆ నక్కిరునికి కనిపించినట్లు!

ఎత్తైన ఆ గోపురాలూ ఆలయ శిఖరాలూ చూస్తున్నకొలందీ — యుగ యుగాలనాటి ఆ సాలీడూ ఆ పామూ ఆ యేనుఁగూ ఆ అడవి బోయా అందఱూ ఒకేచోట గుమిగూడి స్వామిని పరివేష్టించికొని అలా ఉన్నారా! అనిపించింది. నిజానికి వారందరూ స్వామిలోనే

లీనమై ఉన్నారు కానీ స్వామికి వెలుపల లేరుగదా! ఒక్క వారే అన్న మాటేమిటి? దృశ్యమానమైన యీ సకల ప్రపంచమూ ద్రష్ట నైన నేనూ, దృక్కూ, అన్నీ స్వామియే అయిఉన్నట్లు భాసించింది. ఇది కేవలమూ ధూర్జటి అనుగ్రహంకాక యింకొకటి అని అనటానికి నాకు నోరు రావటంలేదు.

స్వర్ణముఖరి సన్నని జలులో దారువు తీసికొని స్నానం చేసి గృహిణీ సమేతంగా ఆలయం లోపలికి వెళ్ళాను.

ఎట్ట యెదురుగా — సంవిన్మయమై ఆవిర్భవించిన లింగము, యదృచ్ఛాఽగతమైన కీటకమును నిజపూజా పరాయణముగా చేసి కొన్న లింగము, మరకత మాణిక్య పద్మరాగములనూ మాలూర కల్హార నీరేరుహములనూ పర్యాయముగా మౌళియందు అవధరించికొనియున్న లింగము, అనాది నిజభక్త విరహ పర్యుత్సుకి తాంతరంగమైన లింగము, యుగ యుగములనాటి తన ఒంటరితనము మోయలేనిబరువై నెనరు నిండిన ముగ్ధహృదయముతో సహవాసమునకు మోమువాచి పరామరిక మారి బైసి మారియున్న లింగము, సమస్త వ్యాపకానంత వేదాంత స్థాపిత చిన్మయాంగమైన లింగము, అవిద్యా ధ్వాంత సంతాన సంక్రాంత స్వాంత నిశాంత జంతు సుఖ మార్గ ప్రాపకా భంగ రుక్కాంతా పాంగమై అప్పుడైన ధూర్జటి చెప్పినట్లే యున్న దివ్యలింగము నా చూపును తనలో లయించికొని నిలిచియున్నది.

ఇక ప్రస్తుతాంశం ధూర్జటి కవితా వైభవం కదా! ఇది ధూర్జటి జయంతి సభ కాబట్టి అన్నగారి మాట కాదనలేక అంగీకరించి వచ్చినందుకు ఆచారార్థమై ఆయన కవిత్వాన్ని గూర్చి కొంత ప్రస్తావించవలసి ఉన్నది.

ఏ కవి కవిత్వాన్ని గూర్చియైనా వివరించవచ్చునుగాని ధూర్జటి కవితా స్వరూపాన్నీ కవితా తత్త్వాన్నీ వివరించటం యెలా సాధ్యపడుతుంది? అది మామూలు కవితా ప్రమాణాలకు అందే విషయం కాదాయెను. తన కవితా వస్తువుయొక్క తత్త్వాన్ని గూర్చి ఆయనే యిలా అన్నాడు.

''ఏ లీలన్ నుతియింపవచ్చు నుప మోత్ప్రేక్షాధ్వని వ్యంగ్య శ
బ్దాలంకార విశేష భాషల కలభ్యంబైన నీ రూపమున్
చాలుం జాలు కవిత్వముల్ నిలుచునే! సత్యంబు వర్ణించుచో
ఛీ! లజ్జింపరుకాక మాదృశకవుల్ శ్రీ కాళహస్తీశ్వరా!''

అని ధూర్జటి అన్నాడే కాని — ఉపమాదులకు అలభ్యమైన ఆ సత్య స్వరూపం ఆయన వాక్కులో తనంతట తాను వచ్చి నిలిచింది. ఆయన కవితా తత్త్వం శివతత్త్వమై శ్రీ కాళహస్తి మాహాత్మ్య స్వరూపంగా నిలిచింది.

''చింతాంతస్థలమై ప్రకాశిత జగచ్చిత్ర క్రియాఽభోగమై
భ్రాంతి ప్రాపిత జీవతా ప్రథితమై పద్మ ప్రసూత్యాది కీ
టాంత వ్యాపకమై మనో విషయ దూరానందమై సంస్తుతా
ద్యంతంబైన'' శివలక్షణం దానికి సంపూర్ణంగా పట్టింది.

''అనుభవ గోచరు కృతీశునభి వర్ణింతున్'' అని ధూర్జటి అన్నాడు. ఆ అనుభవంచేత ఆయన ప్రతిమాటా వాసితమైయున్నది.

''సంసార పారదోచ్చాట నా నలకీల
కలుష సంచయ తామ్ర గంధకంబు
కామలతా మూల కంద కుద్దాలంబు
సంకల్ప పాషాణ టంక ముఖము
రాగ శాలి వనాంకుర కడంగ రీయంబు
శంకా కళంక భుజంగన కులి
నవ మనో గోరాజ నాసికా రజ్జువు
కోపనేక్షణ విశిఖోపలంబు
దివ్య దేశిక హంసోపదిష్ట మార్గ
నిర్గుణ ధ్యాన సంధాన నిరుపమాన
సౌఖ్య సంపత్తి సాధక జన నివాస
మమృత లింగాకరము కాళహస్తిపురము.''

శ్రీ కాళహస్తి జ్ఞానక్షేత్రం. జ్ఞాన ప్రసూన సౌరభములు ఆ పొలంలో నిత్యమూ పరిమళిస్తూ ఆ బ్రహ్మకీట పర్యంతమూ జీవసృష్టిని శివమయంగా చేస్తూ ఉంటాయి. ఈ పరమార్థమును శ్రీ కాళహస్తి మాహాత్మ్యం, కావ్య మార్గంలో హృదయంగమంగా స్ఫురింపజేస్తూ ఉన్నది. ఇందులోని శబ్ద ప్రయోగము, అలంకారములు, వర్ణనలు, కథలు, సర్వ రచనా ■ పరమార్థాభిముఖంగానే ఆవిష్కృతములైనాయి. తన కవితా రచనను దివ్యార్చనగా ధూర్జటి రూపించినాడు.

''జలకంబుల్ రసముల్; ప్రసూనములు వాచా బంధముల్; వాద్యముల్ కలశబ్ద ధ్వను; లంచి తాంబర మలంకారంబు; దీప్తుల్ మెఱుంగులు; నైవేద్యము మాధురీ మహిమగాఁ గొల్తున్ నినున్ భక్తిరంజిల దివ్యార్చన గూర్చి నేర్చిన క్రియన్ శ్రీ కాళహస్తీశ్వరా!''

ఈ కావ్యంలో పది కథలున్నాయి. అవి మొదటి పద్యంలోనే వరుసగా పేర్కొనఁబడ్డాయి. ఆ కథాపాత్రములు వసిష్ఠుడు, బ్రహ్మ, సాలీడు, పాము, ఏనుగు, బోయ, శివద్విజుఁడు, నత్కీరకవి, మధురా నగర వేశ్య లిద్దఱు, యాదవరాజు అనువారు. ఈ చివరనున్న యాదవ రాజే మొదట శ్రీ కాళహస్తిలో గుడులు కట్టించినవాడు. ఈ రాజు కథతోనే కావ్యం మొదలు పెడుతుంది.

ఒకనాడు శ్రీ కాళహస్తీశ్వరస్వామి జంగమకుమార వేషంలో యాదవుని రాజధానికి వచ్చి ఆ రాజునకు భోజన సమయంలో పళ్లెరము పెట్టే ఒక దాసిని అనుగ్రహించి, ఆమె కారణముగా రాజును వశీకరించుకొని, కాళహస్తిలో గుడులు కట్టింపుమని ఆదేశించినాడు.

ఈ కథలన్నీ ఆ రాజునకు పరమేశ్వరుఁడు చెప్పినట్లు — ఈ కావ్యంలో విబంధింపఁబడి ఉన్నాయి. ఈ కథా సూత్రాలతో ఏర్పడుతూ ఉన్న యీ కావ్య స్వరూపమే ఒక సాలీని పటం వలె కనిపిస్తుంది

మొదటిదైన దాసి కథలోను, మధురానగర వేశ్యలు శివసాయుజ్యం పొందిన చివరి కథలోను, శివభక్తి వాసితమైన ధూర్జటి తొలినాటి భోగలక్షణం బుగులుకొనుచున్నది.

అందులోను — చివరిది పరమ రమణీయమైన కథ!

"నగవు రాకుండియు మొగము నెత్తమ్ముల
 సగ వంకురించు సోయగము నిగుడ
మదము లేకుండియు సుదతి తారుణ్య
 సంపద మదంబుదయించును దటు దెలుప
మెఱుఁగు పెట్టకయును మెఱయు నిద్దపు మేని
 మెఱుఁగులు తరగలై తుఱఁగలింప
నడపు బిత్తరముగా నడవ నేరకయును
 నడువ నొయ్యారంబు నుడి వడంగ
నిర్వికార వికారాత్ముఁ బార్వతీశుఁ
గలయ నేతెంచెదరు గానఁ గామినులకుఁ
గలుగ కుండునె! తద్గుణ గౌరవంబు—"

సూత్రప్రాయంగా — ఈ మధురా నగర వేశ్యల సౌందర్య లక్షణమే ధూర్జటి కవితా లక్షణమని గోచరిస్తుంది. ఎందువల్లనంటే —

శాంతంలో లీనమవుతూ ఉన్న దశలో కూడా వెలుపలికి ఎస్తోందా! అని భ్రాంతి కలిగించే శృంగార లక్షణం అతిలోకంగా యందులో చిత్రింపబడియున్నది.

అసలు—అర్ధనారీశ్వర రూపమైన పార్వతీ పరమేశ్వరతత్త్వమే అది. ఈ వేశ్యలు శివసాయుజ్యం పొందేముందు శ్రీకాళహస్తీశ్వరుడు అర్ధనారీశ్వర స్వరూపంతో సాక్షాత్కరిస్తాడు. ఆ సన్నివేశం ధూర్జటి అత్యద్భుతంగా కన్నులకు కట్టించాడు.

పార్వతీశ్వరుడైన శివుడు నిర్వికార వికారాత్ముడు అంటే — వస్తుతః తాను వికారరహితుడై యుండి కూడా జగద్రూపమైన వికారాన్ని పొందుతూ ఉన్నాడా! అని భ్రాంతి కల్పిస్తూ ఉంటాడు. ఆ భ్రాంతియే సర్వ సంసారానికీ మూలభూతమయినది. ఈ మధురా వేశ్యలు అట్టి శివునిలో లీనం కాబోతూ ఉన్నారు కాబట్టి 'తద్గుణ' మైన ఆ నిర్వికార వికార లక్షణాన్ని పొందుతున్నారా! అని ఉత్ప్రేక్ష. 'తద్గుణం' దగ్గర శ్లేష ఉంది.

"తద్గుణః స్వగుణత్యాగా దన్య దీయ గుణ గ్రహః" తన గుణాన్ని వదలుకొని అన్యగుణాన్ని పొందటం 'తద్గుణం' అనే అలంకారము యొక్క లక్షణం. ఈ గణికలు తమదైన ప్రకృతి లక్షణాన్ని వదలి పరమేశ్వర లక్షణాన్ని పొందబోతూ ఉన్నారని ధ్వని!

ఇక — వశిష్ఠాదుల కథలున్నాయి. కథలవలె పైకికనిపిస్తాయి కాని యివి కథలు కావు. తత్త్వ నిరూపకములైన నిత్య కథలు.

శుద్ధ సత్త్వంలో జ్ఞానం ఎలా వెలుగుతుందో వశిష్ఠుని కథ రూపిస్తున్నది. కామక్రోధములలో చిక్కుకొన్న మనస్సు వాని వినాశం వల్ల తేరుకొని జ్ఞానంలో ఎలా లీనమవుతుందో బ్రహ్మకథ నిరూపిస్తున్నది. కర్మవలయాన్ని జ్ఞానం ఎలా దగ్ధం చేస్తుందో సాలీని కథ చిత్రిస్తున్నది. పాము రజోగుణమునకు, ఏనుగు తమోగుణమునకు ప్రతి రూపాలు. రజస్సు తమస్సులో దూరినప్పుడు తమస్సు రజస్సును బంధించి చివరికి రెండూ ఎలానశిస్తాయో యీకథ ప్రదర్శిస్తున్నది.

కలిలో భక్తి కంటె శరణ్యము లేదు. అది పరమ ప్రేమ రూపమయినది. పరమ ప్రేమను మాటలు చెప్పలేవు. ఆ మాధుర్యమంతా అడవిబోయ కథలో తేనె పట్టులో తేనెవలె వ్యాపించియున్నది. తొలి యుగములలో జ్ఞానమయమైన ఆ మహాలింగము కలిలో ఒక అడవి బోయను ఆకర్షించి అతని గుండెలోని తియ్యదనంలో భక్తి మయమై కరగిపోయినది.

శ్రీ శంకర భగవత్పాదు లీ విషయాన్నే యిలా సెలవిచ్చి యున్నారు.

"మార్గా వర్తిత పాదుకా పశుపతే రంగస్య కూర్చాయతే
గండూషాంబు నిషేచనం పురరిపోర్ది వ్యాభిషేకాయతే
కించిద్భక్షిత మాంస శేషకబళం నవ్యోప హారాయతే
భక్తిః కింన కరోత్యహో! వన చరో భక్తావతం సాయతే"

శివద్విజుని కథ శ్రౌతార్చనా స్వరూపమునూ నత్కీరుని కథ అహంకార నిర్దళనాన్నీ చూపిస్తున్నాయి.

భిన్న సంస్కారములు గల జీవులను పరమేశ్వరుడు అనుగ్రహించే వివిధ మార్గములను వ్యాఖ్యానిస్తున్నాయి. కాబట్టి యివి యెన్నడో జరిగిన కథలే కావు. ఎన్నడూ జరిగే కథలు. నిత్య కథలు! ఏవం విధ తత్త్వ వస్తు మహితమైన యీ కావ్య సరణిలో ధూర్జటి శివభక్తి నవ్య భాషా శతధాని గుంభన రసస్థితిని పొందియున్నది. ఆ రసస్థితి ధూర్జటి వాక్కులోని మాధురీ మహిమను ఆలంబనంగా చేసికొని యున్నది. 'మాధురీ మహిమ నైవేద్యంబుగా' అని ఆయనే అన్నాడు కదా!

అంతఃకరణమును ద్రవీభవింపజేసే యీ మాధురీ లక్షణం ఆయాజీవుల సంస్కారాన్నిపట్టి స్వానుభవైక ప్రమాణంగా ఉంటుంది. ఆలంకారికులు లక్షణాలు చెప్పటానికేమి? చెబుతారు. "పృథక్ పదత్వం మాధుర్యమ్" అని

"ఆది గృహస్థ శేఖరుడవైన నిసున్ భవ తాపన క్షుధా
వేదనచేఁ దపః కుతపవేళఁ గనుంగొనఁ గల్గె బ్రహ్మ వి
ద్యా దన భిక్ష నాదు హృదయంబను పాత్రమునందు పెట్టవే!
యాదర మొప్పగా పునరయాచిత వృత్తి సుఖింతు నీశ్వరా!"

నిజానికి యీ పద్యంలో ఉన్నది పృథక్ పదత్వం ఒక్కటేనా? ఇది ప్రత్యక్షమైన పరమేశ్వరునితో వశిష్ఠుఁ డన్న మాట. పరమేశ్వరుడు ఆది గృహస్థ శేఖరుడు. అటువంటి పరమేశ్వరుణ్ణి భవతాప మనే ఆకలి బాధలో నకనకలాడిపోతూ ఉన్న తాను, తన తపస్సు అనే రెండు జాముల మిడి యెండలో చూడటం తటస్థించినదట! ఆ గృహస్థును ఈ క్షుధార్తుఁడు తన హృదయమనే పాత్రతో బ్రహ్మవిద్య అనే అన్నమును భిక్షగా పెట్టుమని అభ్యర్థిస్తున్నాఁడు. ఆ పెట్టటం

ఆదరంగా పెట్టాలి. ఏదో విదలించటం కాదు. తిరిగీ యెవరినీ యాచించవలసిన అవసరం లేకుండా తాను సుఖపడతాఁడట!

'పృథక్ పదత్వం' మాట అలా ఉంచి యిందులో రూపకం అనే అలంకారం ఉన్నట్లు స్పష్టపడుతోంది. నిజానికి రూపకం ఒక్కటేనా? యిందులో ఉన్నది?

క్షుధార్తులైన జీవులు రెండుజాముల యెండలో అన్నార్థులై తమ ఆకలి తీర్చగలిగిన గృహస్థుకై అన్వేషిస్తారు. ఆ గృహస్థు ఎటువంటి వాఁడై యుండాలి? ఏ గృహస్థును చూస్తే తిరిగి యితరులను యాచించవలసిన అవసరం అర్థికి కలుగనేరదో అటువంటి గృహస్థై యుండాలి. పరమేశ్వరుఁ డటువంటివాఁడు. అందువల్లనే ఆయన ఆదిగృహస్థ శేఖరుఁడు. అసలు ఆయన ఒక్కఁడే గృహస్థు! మిగిలిన జీవులందఱూ క్షుధార్తులే!

విచారణ జనితమైన యీ తత్త్వముయొక్క అనుసంధానం చేత యీ పద్యంలోని మాధుర్యం అనుభవ గోచరమవుతుంది. కావ్య గుణముల యొక్క అలంకారముల యొక్క పరిజ్ఞానం మాత్రం చేత కాదు. అందుకనే పరమేశ్వర స్వరూపం శబ్దాలంకార విశేష భాషల కలభ్యమనీ— "స్వానుభవంబున తత్త్వము కానంబడుగాని మీయఖండాద్వైత జ్ఞాన మయాకృతి బహుభాషా నైపుణిఁ దెలియునది యశక్యమట! శివా!" అని ధూర్జటి అన్నాఁడు.

మాధుర్యమంటే—సర్వావస్థామనోహరత్వమనికూడా అంటారు. దాసి కథలో ధూర్జటి దాని స్వరూపాన్ని యిలా వివరించినాఁడు.

"ఎక్కడఁ బట్టినన్ గళల యిక్కువ; లెక్కడ నోరు సోకినన్
జక్కెర లప్పలే మనిన సార సుధారస; మెట్టులుండినన్
జక్కదనంబు పెన్నిధులు; సంభ్రమ మొప్పఁగ నేమి చేసినన్
మక్కువ చెయ్వులై మెఱయు" అని—

సర్వేంద్రియ సమ్మోహనమై పరవశింపఁజేసే ఆ శృంగార జగత్తునందు వలె ధూర్జటి వాక్కులో ఒకానొక నిర్వ్యాజ మాధుర్యం సర్వ దశలలోనూ గోచరిస్తూనే ఉంటుంది.

తన శివాచారైక శీల సంపత్తిచేతా, కందర్ప శుద్ధాంత శ్రీ పరిహాస కృన్నిఖిల లోకాతీత సౌందర్య లక్షణంచేతా పరమేశ్వరానుగ్రహ పాత్రమైన ఆ పళ్లెరంపు దాసి యొక్క ధమ్మిల్ల భరమును నిర్దయుఁడై రాజు తీయించివేశాఁడు.

జలదమును బాసిన మెఱుపువలె, తుమ్మెద గుంపులేని పువ్వు దీవ వలె, సిగ్గుతో తొడిబడుచూ ఆమెవచ్చి తపసి చరణములమీద వ్రాలి పరమ దీనంగా పంచమ ధ్వనుల తానము లీను పికాంగనవలె విలపించింది. ఆ అవస్థను ధూర్జటి యిలా వర్ణించాఁడు.

" 'ఓ' యనురోదనం బోంకార మనువుగాఁ
గన్నుగవ నీరు మజ్జనము గాఁగ
విడువాలు గన్నులు నీలోత్పలములుగా
నెమ్మోము క్రొత్త నెత్తమ్మిగాఁగ
కమ్మని నిట్టూర్పు గాడ్పు ధూపంబుగా
దంత కాంతులు దీప తతులు గాఁగ
అధరోష్ఠ సుమ్ముతోప హారంబుగాఁ బదా
బ్జంబులఁ బడుట దండంబుగాఁగ
నవధరించెనుకాక; లోకైక విభుఁడు
భక్త జనముల ముంగిటి పారిజాత
మేల యేడ్చెదు మానవే! చాలు ననుచు
హస్త మస్తక సంయోగ మాచరించి—

ఎత్తెన; నింద్ర జాలగురుఁ డెత్తిన బర్హమనగ మన్మథుం
డెత్తిన పువ్వు వింటి మదమెత్తిన తుమ్మెద పిండు నారినా,
చిత్తజ రాజ్యలక్ష్మి కభిషేకము సేయ శివుండు కాంతకై
యెత్తిన నీలకుంభరుచి హిండనమో యననద్భుతంబుగన్

నెఱి మిగులఁ గలిగి, నలుపై
తఱచై మదన ప్రతాప దావాగ్ని శిఖన్
మెఱయు నవ ధూమ మనఁగా
దెఱవకుఁ గచభరము వచ్చె దేవుని కరుణన్".

సర్వావస్థా మనోహరత్వం అంటే ఇలా ఉంటుంది. ఇందులో శోకానుభావములు రెండే. 'ఓ' యను రోదనమున్నూ, కన్నీరున్నూ. వానిని ప్రణవాను సంధానంగా, అభిషేక జలములనుగా పరమేశ్వరుఁడు అవధరించాఁడేమో! మధురాకృతియైన ఆ దాసి యొక్క కన్నులు మొదలైన అంగములు నల్లగలువలు మొదలైన శివ పూజాంగములుగా పరిణమించాయి. ధూర్జటి కవితాంగములు దివ్యార్చనగా పరిణమించినట్లు!

'ఏల యేడ్చెదు మానవే! చాలును' అన్న పరమేశ్వరుని అనునయ మాధుర్యం అనిర్వచనీయంగా ఉన్నది. హస్త మస్తక సంయోగ మాచరించి శివుఁ డామెను లేవనెత్తెను. ఎత్తక మునుపే శివుని కృప వలన ఆమెకు పూర్వాధికమోహనమై కచభరం వచ్చింది. అది యెంత వేగంగా వచ్చిందో—ఆ వచ్చిన తీఱు ధూర్జటి చెప్పిన పద్ధతి తలంచుకుంటే ఒళ్లు జలదరిస్తుంది. అది యింద్రజాల గురుఁడెత్తిన మయూర బర్హము! శివునిపై మన్మథుఁడెత్తిన పువ్వువింటి మదమెత్తిన తుమ్మెద పిండునారి! మన్మథుని వలన తన ఓటమి నంగీకరించి స్వామి చిత్తజ రాజ్య లక్ష్మీ పట్టాభిషేకార్థమై ఆ దాసి తలకెత్తిన యింద్రనీల మణి కుంభ కాంతి హిండనము! నెఱి, నలుపు, తఱచు, మెఱుపు యిరవుకొని శివకృపా ప్రాప్తమైన ఆ కచభరము మదన ప్రతాప దావాగ్ని శిఖాన వధూమ పటలి వలె ఉన్నదట!

కాళహస్తి మాహాత్మ్య మన్న వెంటనే ఆయా కథలలోని కొన్ని కొన్ని పద్యములు స్మృతి పథంలో అవశంగా తారాపథంలో నక్షత్రాల వలె మెఱుస్తూ ఉంటాయి. ఆ పద్యాలలో ధూర్జటి శివభక్తి దివ్య భాషా శతఘ్ని గుంఫనములతో తరంగితమై మనస్సును రసమయం చేస్తూ ఉంటుంది.

తొలి యుగంలో ఆ సాలీడు ఏనాఁడు నిర్మించిందో కాని తంతుమయములైన ఆ గుడులు ధూర్జటి వాక్కులలో ముత్యాల

గుడులై కొంతసేపటికి బహు రత్నమయములై శాశ్వతములై ప్రకాశిస్తున్నాయి!

"ప్రాతః కాల తుషార శీకరచయ ప్రాప్తిన్ లసన్మౌక్తికో
పేతాగారము లట్లు చెల్వెసఁగి తద్బిందుచ్ఛటా జాతఖ
ద్యోత చ్ఛాయలఁ గొంతసేపు బహురత్నోద్దీర్ణ గేహమ్ములై
లూతా కల్పిత తంతు సద్మములు వొల్చున్ జెప్పఁ జిత్రమ్ములై"

సాము చేసిన నవరత్నమయ పూజ తనకు నచ్చక సామజము స్వామిని యిలా ఊటాడుతోంది!

"అచ్చెపు నీలవర్ణ దృషదావళి నల్లని కల్వలే? కడున్
బచ్చని రాలు బిల్వ నవ పత్రములే? యరుణాశ్మ భంగముల్
విచ్చిన ఖ్యేఱ్ఱఁదామరలె? విశ్వపతీ! విరసో షల్లమ్ములె
ట్లుచ్చు దలయ్యె నీకు? నవియందునె! గంధమృదుత్వ శైత్యముల్"

ఏనుఁగు చేసిన బిల్వ కమలార్చన తనకు నచ్చక ఫణిరాజు యిలా కంటగించుకొంటోంది.

"కంటక మెట్లునాక, సుముఖత్వము నందితివయ్య! పార్వతీ
కంటకితాంగ బాహు లతికా యుగ సంగతిఁ బోలె; దుఃఖకృత్
కంటక బిల్వికా కమల కాండము లెత్తిన మోచిమోచి ము
క్కంటి! యెఱుంగవే! నొసటి కంటి మహత్త్వము నీకుఁగల్గుటల్"

ఈ తెనుఁగు భాష ఉన్నన్నాళ్లూ స్వామికి యీ కాళద్వయముల దెప్పుళ్లు తప్పవట్లుగా చేశాడు ధూర్జటి!

ఇంక తిన్నఁడు వస్తున్నాఁడు!

"పిల్లోక చంక; నంప పొది వీపున; దొప్పలు కేలుదోయి; పు
క్కిళ్లఁ బవిత్ర కాంచన ముఖీజల మొప్పఁగవచ్చి భక్తి రా
జిల్లఁదదంబు మజ్జనము సేయుచు దొప్పల నంజుడ్రిరా
జిల్లని నారగింపుమన; నా పరమేశ్వరుఁ డూరకుండినన్"

ఆతని యీ సాహసోద్యమం ఎప్పటి కప్పుడే క్రొత్తగా అనిపిస్తుంది.

"ప్రాణము పోవునో! తనువు భంగము నొందునొ! నాక, తూణికా
బాణము జిఱ్ఱు నందిగిచి భల్ల ముఖాగ్రము రక్త పద్మ దృ
క్కోణమునందుఁ జేర్చి యొక గ్రుడ్డు వడిన్ బెకలించి శోణిత
ద్రోణికయైన దైవత శిరోమణి కంట నమర్చె నంతటన్."

ఆతనికి స్వామి ప్రసన్నుఁడైన యీ లీల ఎన్ని జన్మలకైనా మఱపురానిది.

"హరి యరవిందసూతి మునులష్ట దిశాపతు లాదిగా వియ
చ్చరు లిరు వంకలన్ గొలువ సత్వరతన్ నిజలింగ నిర్మలాం

తరమున నుండి శీత వసుధా ధర కన్యక ముద్దు గేలు దా
మరకడ వ్రేలు పట్టికొని మన్ననఁ దిన్ననికిన్ బ్రసన్నుఁడై''

దక్షిణ మధురలోని మీనాక్షి సేవార్థమై పోవుచున్న యీ ఆంధ్ర ద్రవిడ స్త్రీల కలకలము లెన్నటికిని వినిపించుచునేయుండును.

''ఏమే! కల్పకవల్లి! రా వమృతవల్లీ! పోవ కర్పూర వ
ల్లీ! మాణిక్యలతా! యిదో మరకతం బెందుండు? నానంద వ
ల్లీ మీనాకులు రండటంచుఁ దమలో తేమల్ శివా భోగవే
ళా మంజూక్తులఁ బిల్చు సంభ్రమ మనల్పం బెప్పుడున్ దత్పురిన్''

వ్రాసిన పద్యంలో తప్పున్నదంటే పరమేశ్వరునికయినా యింత కోపం వస్తుందన్నమాట!

''ఈ రాజన్యుని మీఁదనేఁ గవిత సాహిత్య స్ఫుర న్మాధురీ
చారు ప్రౌఢిమ చెప్పి పఠవ విని మాత్సర్యంబు వాటించి న
త్కీరుం డూరక తప్పు పట్టెనట! యేదీ? లక్షణంబో! అలం
కారంబో! పద బంధమో! రసమో! చక్కం జెప్పడా తప్పనన్''

మనో మందిరంలో ఘంటానాదంవలె ఎప్పుడూ యీ పద్యం మోగుతూనే ఉంటుంది.

''శ్రీ కాళహస్తి పతి పద
కోకనదారాధనంబె కులధనమమ్మా!
లోక వ్యాపక చిద్వి
ద్యాకార స్మృతియె కాణయాచి మదంబా!

భిన్న భిన్న దశలలో ఉన్న యీ పాత్రల ముఖాలు యిలా కనిపిస్తాయి—

''స్వ స్వరూప విచార సంప్రాప్త శాంతితో
మార్పడు చిత్తార్థ మాన జడిమ''
''శివ భక్తి రహితమై చెడిపోయె జగమని
నవ్వి నటన్నొయ్యన నవ్వ సాగె''
''అల్పమే జ్ఞాన పుష్పంబ సేవించిన
పర శివ జ్ఞాన సంపత్తి కలుగు''
''కట్టు గొయ్యకుఁ జేరి కామధేనువు దప్పె
కానవచ్చిన పెన్నిధాని మడఁగె''
''చింతింప లేమైతి మంత కాంతకుఁడని
యెఱుఁగ మైతిమి జగదీశుఁ డనుచు''

దక్షిణ కైలాస పరిసరాలలో పరమశివుఁడు ఇన్ని రూపాలలో తిరుగుతూ ఉంటాడు—

''విహరించు నొక వేళ విపినాగ్ర పల్లవ
చ్ఛాయల గిరిజా సహాయుఁ డగుచు''
''శిష్ట నీవార ముష్టింపచాశ్రమముల
మెలఁగు సంయమి గృహ మేధి యగుచు''

ఇలాగయితే—కావ్యమంతా ఉదాహరించ వలసే ఉంటుంది. వదల దగింది యేదీ కనిపించదు కాబట్టి!

ఒక్కొక్క కథ పరమేశ్వరునిలో లీనమై పోతూ ఉన్నచోట ధూర్జటి రచన నదీ సాగర సంగమ స్థలంవలె ఆకాశంవలె అంతః కర్పూర శకలమైన అఖండ జ్యోతిస్సువలె నిర్వాణసీమగా ఉంటుంది.

''నాకీ భవ దుఃఖంబులు
లేక మహా జ్ఞాన రస విలీనుఁడ నగుచున్
లోకం బెన్నఁడు నెఱుఁగని
యా కైవల్యమె యభీష్టమని ప్రార్థింపన్''

''ఈ సంసార పయోధిలోఁబడి మేమీఁ దీఁది దేహమ్ముపై
నాసల్ మానక తేలుచున్ మునుఁగుచున్ ప్రాణ ప్రయాణోన్ముఖా
యాసంబుల్ శతసంఖ్య లోర్చితిమి దేనా! మమ్ము రక్షించి మి
థ్యా సౌఖ్యంబులు చాలు నిత్య సుఖమిమ్మా! యంచు బ్రార్థించినన్''

''మీ పూర్ణంబగు దివ్య తేజము జగన్మిథ్యాత్మకత్వ ప్రతి
ష్ఠా పారీణతఁ జూపి మమ్ముఁ బొదువన్ జాంచల్య దూరమ్ములై
చూపున్ జిత్తము మిన్నకున్న యవి యిచ్చోఁబాసె దేహమ్ముపైఁ
దీపుం జీఁకటి యింతకంటె వరమేదీ! యిట్లు మన్నింపవే!''

''జగములు నంతరాత్మయును సాక్షియు నీవనుచున్ నిజంబుగా
నిగమములాడగా వినియు నేఁడి తరంబుగ మాకభీప్సితం
బగు వరమెట్లు వేఁడగలమయ్యా! భవన్మయమైన పూర్ణ చి
ద్గగనములో మనుంగలిపి క్రమ్మఱుఁ బుట్టెడుబాధ మాన్పవే!''

''ఈ సంసారము దుఃఖా
వాసా నందంబు దీని వర్జింపంగా
నే సుఖము గలుగు దయ న
న్నా సుఖమునఁ గూర్పవే! కృతార్థుఁడ నగుదున్''

ఈ జీవుల ప్రార్థనలన్నీ యిలా మన్నింపబడినాయి.

''అని ప్రార్థించిన భక్త కల్పక, మ విద్యా సూత్రదాత్రంబు జీ
వన ఖేదాంబర కర్తరీ ముఖము కైవల్యార్థ దానా మృతా
శన రత్నంబు తుషార శైల తనయా జాంపత్య సంపన్న పా
వన గార్హస్థ్యము కాళహస్తిపుర దైవం బిచ్చె సాయుజ్యమున్''

ధూర్జటి వాణి షష్ఠ్యంతములలో యిలా తరంగితమైనది.

''బహుముఖ సువర్ణ ముఖరీ
లహరీ శీతల శిలా తలస్థిత ముని హృద్
బహిర బహిః పరిపూర్ణున
కహర హరుది తునకుఁ గాళహస్తీశునకున్''

''సతత త్రైగుణ్య వశా
చ్యుత కేళి జగన్మహుర్మహుర్నిర్మాణ
స్థితి భంజన కరణునకున్
హతభవ పాశునకుఁ గాళహస్తీశునకున్''

''జ్ఞాన ప్రసూన కలికా
పీన కుచ సుఖచ్ఛమత్త భృంగమునకు సం

ధ్యా నటన పటు విహార మ
హా నట హంసునకుఁ గాళహస్తీశునకున్''

ఆశ్వాసాంతములలో, నివాత దీప కళికవలె యిలా వెలుగుతున్నది!

''లుంటీ కృతాఘ! ముక్తివి
ఒంటీ గాఢోప గూహరత! చిద్విద్యా
ఘంటా పథ చర తారక
ఘంటారవ హృత మనోమృగ వ్యాధేశా!''

''యోగి స్వాంత శకుంత వాగురిక!''
''నీవారాగ్ర శిఖాంత చిద్రసమయా!''

ఇలా ప్రత్యక్షరంలోనూ పరమ శివుడు సన్నిధి చేసియున్న యీ కావ్యంలోని కవితా సౌందర్యము అమ్మవారి దీప్తివలె కన్నులకు కొట్టవచ్చినట్లు గోచరిస్తుంది. శివశక్తి సామరస్య భరితమైయున్న యీ కావ్యముయొక్క సమగ్ర సౌందర్యము నిర్వచన సాధ్యముకాదు.

ఇందలి కథలలో శివ మహః పరివేషం తంతువులలో పట స్వరూపంవలె అభివ్యక్తమవుతూ ఉన్నది. శివమూ సుందరమూ అయిన ధూర్జటి అనుభూతి యీ కృతి స్వరూపంగా పరిణమించింది. సత్యస్వరూపమైన ఆయన అనుభూతి శతకంవలె ఆవిష్కృతమైనది.

''శ్రీ విద్యుత్కలితాజ వంజవ'' అని మొదలైన పద్యశ్రేణి అమృతహ్రదానికి తీర్చిన సోపాన పరంపర! భవనిదాఘ తప్తులైన ప్రాణులకు ఒక్కొక్క పద్యమూ ఒక్కొక్క చలివేంద్రము. ఆయన మాటలన్నీ అనుభవ పరమార్థాలు. తెనుగు భాష వచ్చిన జీవు లందరికీ ధూర్జటి పరమాప్తుడు. ఆప్తుడనగా యథార్థ వక్త. తెనుగు కవులలో ధూర్జటి కంటె యథార్థ వక్త యెవ్వడు? నిప్పు వంటి సత్యముతో అమృత ధారా నిష్యందములు అవినాభావంగా ఉండటము ఆయన వాణిలోని విశిష్టత! ఆ పద్యములన్నీ ఉషస్సులలోనూ ప్రదోష సమయాలలోనూ అంతర్ముఖులమై మననం చేసికొనవలసినవి. ప్రతి పద్యంలోనూ మహాకాల స్వరూపుడైన శివుడు తాండవిస్తూ ఉన్నట్లు హృదయం ప్రతిస్పందిస్తూ ఉంటుంది. ఆ ప్రతిస్పందాన్ని వినగలిగితే చాలు.

ఆయన వైరాగ్యం ఐహిక భోగాల లోతులన్నీ కడముట్ట చూచింది. ఆనుశ్రవిక భోగముల తత్త్వమూ ఆయనకు సువిదితమే. కనుకనే యిలా అన్నాడు —

''అమరస్త్రీల రమించినన్ జెడదు మోహంబింతయున్ బ్రహ్మ ప
ట్టము సిద్ధించిన నాస తీఱదు నిరూఢ క్రోధమున్ సర్వలో
కములన్ మ్రింగిన మాన దిందుఁగల సౌఖ్యం బొల్ల నీ సేవచే
సి మహాపాతక వారి రాశి గడతున్ శ్రీ కాళహస్తీశ్వరా!''

దాపటికమన్నది యే మాత్రము లేదు. బహు నిర్భయుడు. అందువల్లనే సత్య స్వరూపుడయిన పరమేశ్వరునికి అంత దగ్గఱ కాఁగలిగినాడు. ఈ సత్యనిష్ఠ వల్లనే ఆయన వాక్కులకు అంత బలం వచ్చింది.

ధూర్జటిని భావిస్తే ప్రప్రథమంగా కవిగా సాక్షాత్కరిస్తాడు. 'కవి' అంటే చాలదు. ఎటువంటి కవి? 'దివిషదన్న ప్రాయ నాగ్గుంభనుడైన కవి!' అనాలి.

శైవ సంవిత్సార మరాళ రత్నము! మంత్రతంత్ర శాస్త్రములను పరిశీలించినవాడు. సాంఖ్యాది యోగ రహస్యములను పెద్దల వలన వినియున్న బహుశ్రుతుడు. వేదములూ శాస్త్రములూ అధ్యయనము చేసినవాడు. సహజమైన ఆర్తి నుండి పుట్టిన వైరాగ్య జ్ఞానములను అంతర్భూతం చేసికొన్న మహాభక్తిలక్షణంచేత ప్రయాగవలె తీర్థభూతుడు. భక్తి రహితమైన చదువులు నిష్ఫలములని నిర్వేద జనిత వివేకంవల్ల ఆయన చేసికొన్న నిర్ణయం!

''ఏ వేదంబు పఠించెలూత? భుజంగంబే శాస్త్రముంజూచె తా
నే విద్యాభ్యసనం బొనర్చెఁగరి? చెంచే మంత్రమూహించె? బో
ధా విర్భావ నిదానముల్ చదువులయ్యా? కావు నీ పాద సం
సేవా సక్తియెచాలు జంతువులకున్ శ్రీకాళహస్తీశ్వరా!''

లౌకిక జీవితంలో మహా మనస్వి! తృణీకృత బ్రహ్మ పురందరుడు! భవ పరాఙ్ముఖుడు! నిత్య ప్రణవాను సంధాత!

''ఆరావంబుదయించె తారకముగా నాత్మాభ్ర వీధిన్ మహా
కారోకార మకార యుక్తముగ నోంకారాభి ధానంబు చె
న్నారున్ విశ్వమనంగ దన్మహిమచే నానాద బిందుల్ సుఖ
శ్రీ రంజిల్లఁ గడంగు నీవది సుమీ! శ్రీకాళహస్తీశ్వరా!''

ఈ మహాస్థలంలో జలాంత శిలాంతంగా యీనేల త్రవ్వించి ఆయా కాలాలలోని రాజులూ మహాభక్తులైన వణిక్ శ్రేష్ఠులూ స్వామికి గుడులు కట్టిస్తూ వచ్చారు. అనంత కాలంలో ఎందఱెందరు కట్టించారో!

ఎన్నటికీ శిథిలంకాని ఆంధ్ర భాషా పరమోత్తమములైన ఆలయములను ధూర్జటి మహాకవి నిర్మించినాడు. అవే స్వామికి ప్రియతమములైనవి. దేశం నాలుగు చెఱగులలోని భక్తులూ ఆ గుడులలోనే అనుక్షణమూ స్వామి సాన్నిధ్యాన్ని అనుభవిస్తూ ఉన్నారు. ఆ మహాకవికి యీ ఆంధ్రజాతి యెల్లకాలమూ ఋణపడియుంటుంది. కవీశ్వరుల ఋణం యెన్నటికీ తీర్చుకోరానిది.

శ్రీ కాళహస్తి పుర జనులారా! ఏటేటా జయంతులుచేస్తూ ఆయన సాన్నిధ్యాన్ని హృదయాలలో ప్రతిష్ఠింపఁ జేసుకోవాలనే మీ సంకల్పం శివసంకల్పం!

ధూర్జటి సన్నిధానానికీ శివ సన్నిధానానికీ భేదమేలేదు. ఆ మహాకవికి అధిష్ఠాన మందిరం నిర్మించటం అంటే శ్రీ కాళహస్తీశ్వర స్వామికి ఆలయం నిర్మించట మన్నమాట. ఏదో మందిరం కట్టటం కానేకాదు. యథార్థానికి ధూర్జటి కావ్యాలే శ్రీకాళహస్తీశ్వర స్వామికీ ఆయనకూ ఎన్నటికీ శిథిలం కాని ఆలయాలు.



# మందార హారం

నన్ను పశువుని చేశావు
నా ముక్కుకి తాడు పోశావు
నా కళ్లకి గంతలు కట్టావు
నా అండాలు చితగ్గొట్టావు
నన్ను డూడూ బసవన్నను చేసి
నీ యిష్టంవచ్చినట్టు ఆడిస్తున్నావు ...
పైకి నీ బాకాకి తలూపుతున్నట్టు నటిస్తున్నా,
లోపల ఒకప్రక్క ఆలోచిస్తూనేఉన్నా ...
ఆకలితో అమాంతంగా ఒక్క రంకెవేసి
నా వాడి కొమ్ములతో నీ పొట్టపేగులు చీల్చి
మెళ్లో మందార హారం వేసుకోవడం ఎలాగా అని!

# దివి నుండి భువికి...

సాయం సంధ్య ...
చీకటి—చెరువులోకి దూకి ఆత్మహత్య చేసుకుంటోంది
వెలుగు
రాత్రి—కంబళి కప్పుకుని ముసుగుదన్నుతోంది పగలు
ఆకాశంనిండా అయోమయంగా వ్యాపించిన నీలిరంగు
దుమారం
పడమటి కొండమీద కుప్పలు కుప్పలుగా బంగారం సిందూరం
పాటలు పాడుకుంటూ గూళ్లకు మళ్లుతున్న పక్షులు
నింగిలో అక్కడక్కడ తొంగిచూస్తున్న చుక్కలు
బిక్కు బిక్కుమంటూ ఎక్కడో ఒక్కొక్కయిల్లు
చుట్టూ లోయగుండా ప్రవహిస్తున్న ప్రశాంతం
దూరాన విద్యుద్దీపాల జెండాలు నాటిన కొండలమీద
నవరత్న హారంలా పరుచుకున్న సుందరమైన నగరం
ప్రకృతిలో ఐక్యమైపోతున్న నా ఆత్మకి రెక్కలు
మొలుస్తున్నాయి
కాని హఠాత్తుగా జ్ఞాపకం వచ్చింది
కడుపులో ఎలకలు పరుగెడుతున్నసంగతి
కలలోంచి మెలకువలోకి వచ్చి
"ఏమేవ్! అన్నంపెట్టు" ఆజ్ఞాపించింది నా పురుష
దురహంకారం
అప్పుడే గుచ్చడం పూర్తిచేసిన సన్నజాజుల దండను నా
ముక్కు దగ్గరపెట్టి
ఆకాశం నీలిమలోకి ఆశ్చర్యంగా చూస్తూ
"ఆ నక్షత్రాల గుంపు పేరేమిటి ?"
అంటోంది ప్రశాంతంగా శ్రీమతి
"అబ్బబ్బ! ముందు అన్నంపెట్టు!" పెడబొబ్బ పెట్టాను
"ఛి ఛీ! ఎప్పుడూ పాడుతిండి!"
విసుక్కుంటూ వంటింటివైపు వెళ్లింది పెళ్లాం
సిగ్గుతో నన్ను నేను రెండుగా చీల్చుకుంటూ
అందానికీ ఆకలికీ ఉన్నతేడా కొలుచుకుంటూ
నేనుకూడా మేడమెట్లు దిగాను ...!

డా. తంగిరాల



# ఆత్మ

## శ్రీ కె. యెస్. రమణ

చివుక్కుమని
  గుచ్చుకున్న ముల్లుని
చివ్వుమని లాగివేసినట్టు
నరాల తీగను
యెవరో
రూక్షంగా మీటినట్టు
గుండెగూడు పట్లు కదలి

బాధతో ప్రాణం అరిచినట్టు
యేమిటా వేదనాస్మృతి!
'వునికి' ని కరిగించేవీ
కల్పించేవీ
కలలే కాదు
స్మృతులు కూడా ...

మనిషి అణువుల నిర్మాణమే అయితే
మదిలో అనుభూతి మథనం యెందుకు?
అందమైన క్రోటన్ మొక్కలా
బతకలేని యీ ఆత్మ
అనుభవాల సుడిగుండాల్లో
యీతనేర్చుకుంటున్న పిల్లవాడు.

---

# గమ్యం

## శ్రీ కొడవంటి లీలామోహనరావు

చెమ్మగిల్లిన కళ్ళతో
  నాకోసం ఎన్నాళ్ళని చూస్తావు?

అడుగు అడుగుకూ
రాతి బాకుల తూట్లు
భీకర కాననాల
చిక్కు చిక్కుల బాటలు
రక్తం రుచి మరిగిన
నా తోటివాళ్ళ గాలింపులు

ఇంతటితో ఆగేనా
నే బతికి బట్ట కట్టేనా?

సన్న జాజుల కమ్మదనం
నాకోసం పదిల పరచి
చెరగని ఆశల జ్యోతులు
కన్నులలో నిలిపి
నిరీక్షిస్తూ నీవు చూపిన
నిశ్చల మనోనిబ్బరం

నను రమ్మని ఆహ్వానిస్తే
సోలిపోయే శక్తిని
కూడగట్టుకుంటాను.

నీ విచ్చిన ఊపిరితో
అన్నిటినీ అధిగమించి
నిన్ను చేరుకుంటాను.



శ్రీ విశ్వనాథం బత్తినేని

# ప్రాచీనకాలములో ఉన్నతవిద్య

## ఒక సంగ్రహ చారిత్రక పరిశీలన

"అన్ని కాలాలలోను ఉన్నత విద్య అనేక సంక్షోభాలకు గురి అవుతూనే ఉంది. ఉన్నత విద్య ఎదుర్కొనే సమస్యలను ఎప్పటికప్పుడు పరిశోధన, విశ్లేషణ మరియు మూల్యాంకనంద్వారా పరిష్కరించుకోవలె."

—ఆచార్య సతీష్ చంద్ర

జన్మతః మానవుడు ఒక విజ్ఞాన పిపాసి. జ్ఞానంకోసం నిరంతరం పరిశోధన చేస్తాడు. తాను సముపార్జించుకొన్న విజ్ఞాన సంపదను ముందుతరాలవారికి అందజేయాలని అతడు సహజంగా వాంఛిస్తాడు. విజ్ఞానాన్ని ఇట్లా ఒక తరంనుండి మరో తరానికి అందజేయడమనేది అనేక అంశాలపై ఆధారపడుతుంది. అందజేయడమనే ప్రక్రియ అనేక స్థాయిలలో అనేక విధాలుగా జరుగుతుంది. విజ్ఞానాన్ని అందించే యంత్రాంగంమీద, ముఖ్యంగా, అప్పటి సామాజిక, ఆర్థిక, రాజకీయ పరిస్థితులమీద మరియు దానిని అందుకొనేవారి శీలస్వభావ రీతులమీద అధికంగా ఆధారపడుతుంది.

ఈరోజుల్లో ఉన్నత విద్యాబోధన యావత్తు వ్యవస్థాగతమైన విశ్వవిద్యాలయాలలోను, కళాశాలలలోను ఎక్కువగా జరుగుతూఉన్న విషయం మనందరకు తెల్సినదే. సామాజికమైన వాడుకలో ఉన్నత విద్యకు, విశ్వవిద్యాలయస్థాయి విద్యకు ఎట్టిభేదంలేదు. వాడుకలో రెండింటి అర్థము ఒకటే. ఉన్నత విద్యకు విశ్వవిద్యాలయాలకు మధ్య సంబంధమనేది మధ్యయుగపు ఐరోపా సంప్రదాయమునకు చెందినది. మధ్యయుగంలో 'విశ్వవిద్యాలయం' అనేమాట వివిధ పాఠ్యవిషయాల అధ్యాపకులకు లైసెన్సులు మంజూరుచేసే హక్కుగల ఒక శాసనాత్మకమైన కార్పొరేషన్‌నుండి పుట్టింది. కాలక్రమేణ, విశ్వవిద్యాలయ వ్యవస్థకు, ఉన్నత విద్యకు మధ్య సన్నిహిత సంబంధము ప్రప్రథమంగా పశ్చిమ దేశాలలో ప్రారంభమై అభివృద్ధి పడింది. ఐనప్పటికీ, ఐరోపా పద్ధతి విశ్వవిద్యాలయ వ్యవస్థను ఎరుగని ప్రాంతాలలో సహితం, ప్రాచీనకాలంలో ఉన్నతవిద్య 'విద్య' అనే బృహత్తర విషయంలో ఒక ప్రధానాంశంగా ఉండేదని మన ప్రపంచ చరిత్ర చెబుతున్నది. ఆ రోజుల్లో ఉన్నతవిద్య వ్యవస్థాగతం గాకపోయినా, అనేక రూపాలలో ఆచరణలో ఉన్నది.

సంప్రదాయకంగా ఉన్నత విద్యయొక్క ప్రణాళిక వృత్తిసంబంధమైన ఒక ప్రత్యేక శిక్షణ కలిగి బలమైన మానవాంశను ఆధారం చేసుకొని ఉన్నది. వృత్తి ప్రాతిపదికపైన, ఈనాడు, అనేక దేశాలు ఉన్నత విద్యావిధానాన్ని రూపొందించుకొని అమలుపెడుతున్నాయి. అనేకరకాల సాంకేతిక సంస్థలు, అకాడమీలు, ప్రయోగశాలలు, కేంద్రాలు, శిక్షణాసంస్థలు, వృత్తికళాశాలలు వృత్తిప్రధానమైన ఉన్నత విద్యను సమాజాలకు అందిస్తున్నాయి. శతాబ్దాలుగా ఇట్లా 'ఉన్నతవిద్య'. అనే పదం విస్కృత ప్రాతిపదికపై ఒక గొప్ప అర్థాన్ని సంతరించుకొన్నది.

ఈ వ్యాసంలో ఉన్నతవిద్యయొక్క పుట్టు పూర్వోత్తరాలు, ప్రాచీన కాలానికి సంబంధించినంతవరకు, దశలవారిగా అది అభివృద్ధి పడిన పద్ధతులపై సంగ్రహంగా ఒక చారిత్రక పరిశీలన చేయడం జరిగింది.

ఉన్నత విద్యయొక్క చారిత్రకమైన వ్రేళ్ళు నైలునది, సింధు నది, మెసపొటేమియా, క్రీటె, చైనా మొదలైన పట్టణ సంబంధ నాగరికతల అభివృద్ధిలో ప్రధానంగాను, మధ్య, దక్షిణ అమెరికా నాగరికతల అభివృద్ధిలో కొంతవరకు ఉన్నాయి. ఈ ప్రాంతాలలో జనసాంద్రత హెచ్చుగా ఉండటం, సంప్రదాయకంగా ప్రజల జీవనోపాధియైన వ్యవసాయం క్రమేణా క్షీణించడం — దానిస్థానే వివిధ రకాల వృత్తులు నూతనంగా ఆవిర్భవించడం జరిగింది. రోజురోజుకు సంక్లిష్టంగా అభివృద్ధిపడే సమాజాల అవసరాలకోసం అనేక కళలు, చేతి పనులు ఉద్భవించాయి. ప్రత్యేక నైపుణ్యాలకోసం ప్రత్యేకీకరణం ఒక సాధనం గావడం, వివిధ రంగాలతో వృత్తికళాకారులనే ఒక ప్రత్యేక తరగతి ఉద్భవించడం జరిగింది. ఈ ప్రత్యేకీకరణయొక్క నిర్వహణ, పోషణ, శిక్షణ, బోధన మరియు సంస్కరణలు వివిధాలైన పాఠశాలల స్థాపనకు దారితీసాయి. ఇక్కడినుండే విజ్ఞానం ఒక తరంనుండి మరో తరానికి అందించడమనే ప్రక్రియ ప్రారంభమైందని చెప్పవచ్చు. ప్రాచీన సంస్కృతులలో 'ఉన్నతవిద్య' అనేది ఆధునిక అర్థంలో లేకపోయినా, ఇది ఖచ్చితంగా ప్రాచీన నాగరికతల కాలంలో బాగా వర్ధిల్లినదని చెప్పడానికి మనకు అనేక ఆధారాలు ఉన్నాయి. ఎందుకంటే, 'ఉన్నతవిద్య' అనే ఒక భావనే ఆనాడు లేకుంటే, ప్రాచీన సమాజా

లలో మేధాసంపత్తి, కళాసంపత్తి, శాస్త్ర సాంకేతికాభివృద్ధి అసలు జరిగి ఉండేవికావు.

ఈ వ్యాసంలో 'ప్రాచీన కాలంలో ఉన్నతవిద్య' అభివృద్ధి పడిన విధానాన్ని ఆరు దశలుగా విభజించడమైనది. అవి:—1) నైలునదీ నాగరికతా కాలము 2) సింధులోయ నాగరికతా కాలము 3) చైనా నాగరికతా కాలము 4) ప్రాచీన అమెరికా నాగరికతా కాలము 5) గ్రీకుల కాలము 6) రోమన్ల కాలము.

# 1. నైలునదీ నాగరికతా కాలము

ప్రాచీన నాగరికతలలో నైలునదీలోయ నాగరికత అతి ప్రాచీనమైనదికాదు. ఐనప్పటికీ, ఉన్నతవిద్యా చరిత్రలో సుస్థిరమైన ఈ నాగరికతకు ఒక ప్రత్యేకమైన స్థానం ఉన్నది. అందుచేత ఉన్నతవిద్యకు సంబంధించి ఈ నాగరికతను ముందుగా పేర్కొనడమైనది. ప్రాచీన ఈజిప్టులో దేవాలయాలకు ఉన్నత విద్యకు చాలా దగ్గరి సంబంధం ఉన్న కారణంగా ఉన్నతవిద్యకు ఇక్కడ ఒక ప్రత్యేక ఆదరణ లభించినది. పూర్వంనుండి ఇక్కడి రాజ్యపాలనం, ప్రభుత్వం అధికంగా మతాధిపతులపై ఆధారపడ్డని. అందుకే సమాజంలోని అన్ని విషయాలపై ఈ వర్గ ప్రభావం ఎక్కువ. వ్రాత కోతలు, రికార్డుల భద్రత మొదలుకొని మౌలికశాస్త్రాల అధ్యయనంతోసహా అన్నీ ఇక్కడి ఉన్నత విద్యలో భాగాలే. ఈ వ్యవహారాలన్నీ దేవాలయాలలోను, రాజప్రసాదాలలోను, ఆ తర్వాత వచ్చిన విద్యాకేంద్రాలలోను జరిగాయి. హెలియొపోలిస్, కర్నాక్, మెంఫిస్ మొదలైన దేవాలయాలు విద్యాకేంద్రాలుగా పనిచేసాయి. సాహిత్యం, నీతిశాస్త్రం, ఖగోళశాస్త్రం, భౌతికశాస్త్రం, వైద్యశాస్త్రం, ఉన్నతగణితం మరియు మత విషయాలు విద్యార్థులకు మతాచార్యులే బోధించేవారు. గురుశిష్యులిద్దరు సంస్కారంగల, గౌరవనీయమైన ఒక మేధావి వర్గానికి చెందినవారై ఉండేవారు.

దేవాలయాల వెలుపల లాంఛనంకాని పద్ధతిలో వాస్తు, శిల్పం, నీటిపారుదల విషయాలలో వృత్తిపరమైన విద్య ఉన్నది. దీనిపై కూడ మతాధిక్యత ఉండేది. అన్ని విద్యలపై ఈ మతాధిక్యత ఉన్న కారణంగానే సంప్రదాయక స్వభావంగల ఈజిప్టు నాగరికత మూడు వేల సంవత్సరాలదాకా తన సంస్కృతీ పౌరసత్వాన్ని చెక్కుచెదరకుండా నిల్పుకోగలిగింది. నవకల్పన గాకున్నా, ఈజిప్టులో ఉన్నతవిద్య సాంస్కృతిక పరిణామక్రమంలో ఒక సుస్థిరమైన సాధనంగా నిలబడింది.

ఈజిప్టు తర్వాత కొన్నివందల సంవత్సరాలకు టైగ్రిస్—యూఫ్రేట్స్ లోయ నాగరికత వచ్చింది. దీని నావికులు సుమేరియన్లు. వీరిది చాలా బలహీనమైన ఒక సమ్మేళనరాజ్యం. వీరి ప్రభుత్వం ఈజిప్టు ప్రభుత్వమంతటి నిరంకుశమైనది, మతపరమైనదికాదు. సుమేరియన్ దేవాలయాలలో ప్రాథమిక విద్య, గణితము బోధించబడ్డవి. కొన్నిచోట్ల కులీన విద్యార్థులకు ఉన్నత విద్య నేర్పబడింది. మతం, వైద్యం, న్యాయం మొదలైన విషయాలలో శిక్షణ ఇచ్చేవారు. గణితం, ఖగోళం, ఫలశాస్త్రాలు ఇక్కడ బాగా అభివృద్ధి చెందినవి. సుమేరియన్ సంస్కృతి · న్యాయశాస్త్ర సంబంధమైనదే అయినప్పటికీ న్యాయశాస్త్రం మాత్రం బాగా వృద్ధిచెందలేదు. ఇక్కడి ఉన్నతవిద్య స్వభావంపై నిర్దిష్టమైన సమాచారం ఏదీ లభ్యం గానప్పటికీ, సుమేరియన్ల సాహిత్య సంప్రదాయములనుబట్టి, వివిధ శాస్త్రాలలో వీరి కానుకలనుబట్టి, ఏదో ఒకరకమైన ఉన్నతవిద్య లేకుండా ఇవి అసాధ్యమని తెలుస్తున్నది. క్రీ. పూ. 1900 సం॥లో సుమేరియన్ల పరిపాలన క్షీణించినప్పటికీ, వీరు నెలకొల్పిన పాండిత్య ఒరవడిని తర్వాత వచ్చిన బాబిలోనియనులు, అస్సీరియనులు, ఛాల్డియనులు సంరక్షించారు.

ఈజిప్టు, మెసపొటేమియాల ప్రభావం,తర్వాత వచ్చిన ఫొనీషియనుల, హెబ్రూల, హెట్టిటిస్‌ల, మినియనుల నాగరికతలపై స్పష్టంగా మనకు గోచరిస్తుంది. హెబ్రూల విద్యావిధానం దైవ న్యాయానికి, ధర్మానికి ప్రాధాన్యమిచ్చింది. చాలాకాలం మౌఖికపద్ధతి కొనసాగినాక, ఇజ్రాయిల్, జూడాలలో న్యాయాన్ని రచించడానికి, నకలు చేయడానికి, వ్యాఖ్యానించడానికి ఒక లేఖకుల తరగతి ఉద్భవించింది. ఇట్లా ఇక్కడి ఉన్నతవిద్య న్యాయశాస్త్రాలకు మాత్రమే పరిమితమై వర్ధిల్లినది.

# 2. సింధులోయ నాగరికతా కాలము

భారతదేశంలో క్రీ. పూ. మూడువేల సం॥ల మధ్యకాలములో సింధులోయ నాగరికత బాగా అభివృద్ధి చెందినది. నైలునదీ మొదలైన సమకాలీన నాగరికతల సంస్కృతులకు, దీనికి అనేక సామ్యాలు ఉన్నవి. క్రీ. పూ. 1500 సంవత్సరములో ఆర్యులు భారతదేశంపై దండెత్తి ఆక్కడి ఆదివాసులను ఓడించి స్థిరపడటం జరిగింది. ఈ ఆర్యుల ఉనికి కారణంగా భారత సమాజం బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర అనే నాలుగు తరగతులుగా విభజింపబడి ఆ తర్వాత అనేక కులాలుగా చీలిపోవడమైనది. ఈ కులాలలో బ్రాహ్మణులు మేధావులుగా, మతాధిపతులుగా భారతీయ విద్యా సాంస్కృతి చరిత్రలో ప్రముఖపాత్ర నిర్వహించారు. ఒకవిధంగా భారతీయ విద్యా విధానం యావత్తు బ్రాహ్మణులతోనే ముడివడి ఉండేది. శూద్రులకు ప్రాథమికవిద్య సహితం దూరంగా ఉండేది. మతం, తత్త్వవిచారం, వేదాలు, బ్రాహ్మణికాలు, ఉపనిషత్తులు కేవలం బ్రాహ్మణుల అధ్యయనానికి మాత్రమే పరిమితమైనవి. ఆదిలో విద్యాబోధన మౌఖికమైనది/పండిత బ్రాహ్మణుని గృహమే ఆనాడు ఒక పాఠశాల. ఆనాటి విద్యార్థులు వైజ్ఞానికమైన, నైతికమైన ఒక క్రమశిక్షణకు లోబడవలె. వేదాధ్యయనంతోపాటు బ్రహ్మచర్యం చేయవలె. తర్వాత విద్యాబోధన పండితగృహంనుండి వనభూములలోని ఆశ్రమాలకు తరలించబడింది. ఈ ఆశ్రమాలలో విద్యార్థులు ఖగోళశాస్త్రం, శబ్దవ్యుత్పత్తి శాస్త్రం, వ్యాకరణం నేర్చుకొనేవారు. శారీరక శ్రమచేయడం, మతపరమైన ఉత్సవాలు నిర్వహించడం, బ్రహ్మచర్యం పాటించడం, సామాన్య జీవనం గడపడం, ఈ ఆశ్రమ విద్యతో భాగాలు. ఈ చదువు పూర్తికాగానే, విద్యార్థులు హిందూ సంప్రదాయంలో నిష్ణాతులైన

పండిత బ్రాహ్మణులవద్ద శాస్త్రాలు, న్యాయం, ధర్మం, వ్యాకరణం, తర్కం, తత్త్వవిచారం మొదలైన వాటిలో ఉన్నతవిద్య గడించేవారు. ఈకాలంలోనే 'పరిషత్' అనబడే ప్రాచీన విశ్వవిద్యాలయాలు జనించాయి.

క్రీ. పూ. 6వ శతాబ్దంలో బ్రాహ్మణ విద్యావిధానం క్రమీణ క్షీణించడం ప్రారంభమైనది. విద్యావిధానంలో లాంఛనత్వం బాగా పెరిగింది. బౌద్ధ జైనమతాలు భారతీయ విద్యావిధానంలో గొప్ప మార్పులు తేవడం, వీటి ప్రభావంవలన భారతీయవిద్యలో ప్రజాస్వామ్యకరణ, వ్యవస్థీకరణ అనే రెండు ముఖ్యలక్షణాలు చోటుచేసుకోవడం జరిగింది. జైన బౌద్ధాలు బ్రాహ్మణ విద్యావిధానంలోని లింగ, వర్గ భేదాలను తొలగించ యత్నించాయి. మత మందిరాలు క్రమీణ ఈ నూతన విద్యకు కేంద్రాలుగా పైకిరావడం ప్రారంభమైనది.

భారతీయ వైజ్ఞానిక జీవనం క్రీ. పూ. 6వ శతాబ్దంనుండి క్రీ. త. 6వ శతాబ్దివరకు, ముఖ్యంగా గుప్తచక్రవర్తుల కాలములో బాగా అభివృద్ధి చెందినది. ఈ రోజుల్లోనే తక్షశిల, బనారస్, కంచి, వల్లభి, నలంద మొదలైన విశ్వవిఖ్యాతినొందిన ఉన్నత విద్యాకేంద్రాలు నెలకొల్పబడ్డవి. క్రీ. త. 4–8 శతాబ్దాలమధ్య ఒకప్పుడు ప్రబలంగా ఉన్న హిందూవైదిక సంప్రదాయక విధానం తిరిగి ప్రాణంపోసుకొన్నది. జైన బౌద్ధాల ప్రభావం బాగ సన్నగిల్లింది. విద్యా ప్రణాళికలు బాగా విపులమై విస్తరించబడ్డాయి. ఖగోళం, వైద్యం, ఇంజనీరింగ్, ఉన్నతగణితం ఎంతో అభివృద్ధి చెందినవి. శూన్య, దశాంశ సిద్ధాంతాలను కనుగొని ప్రపంచానికి అందించగలిగిన ఘనత భారతీయ పండితులకే దక్కింది. ఆ తర్వాత భారతీయ సాంస్కృతిక విద్యావిధాన ప్రభావం ఆగ్నేయాసియా, చైనా మొదలైన ప్రాంతాలలో స్పష్టంగా గోచరించినది.

## 3. చైనా నాగరికతా కాలము

క్రీ. పూ. రెండువేల సంవత్సరములనాడు ప్రాచీన చైనా నాగరికత ఆవిర్భవించినది. మొదటినుండి ఇక్కడి ప్రభుత్వ పాలనంలో విద్యావంతునికి ఒక ప్రత్యేక ప్రముఖస్థానం ఉన్నది. పౌరనీతికి చైనా విద్యావిధానంలో అగ్రతాంబూలం ఇవ్వబడినది. ఎక్కువకాలం విద్యాబోధన మౌఖికంగానే సాగినది. క్రీ. పూ. 12-8 శతాబ్దాలమధ్య చైనాను పాలించిన ఛౌ వంశీయుల కాలములో చైనీయులు ఒక లిపిని వృద్ధిచేసుకొన్నారు. ప్రాథమికవిద్య, గణితం, సంగీతం, యుద్ధనైపుణ్యాలు నేర్పడానికి పాఠశాలలు నెలకొల్పుకొన్నారు. క్రీ. పూ. 8–3 శతాబ్దాలు చైనా వైజ్ఞానిక చరిత్రలో చాలా ఫలవంతమైన కాలమని చెబుతారు. ఈ రోజుల్లోనే, కన్‌ఫ్యూసియనిజం, టావోయిజమ్, మోయిజమ్‌లకు సంబంధించిన తత్త్వవిచారణా కేంద్రాలు నెలకొల్పబడ్డాయి. పండితులు, తత్త్వవేత్తలు పెరిగారు. అనేక ప్రవేట్ ఉన్నత విద్యాసంస్థలు వెలిసాయి. విద్యార్థులను ఆకర్షించడానికి విద్యాకేంద్రాలన్నీ పోటీపడేవి. ఈ కేంద్రాలన్నింటిలో తత్త్వవిచారణ, సాహితీ కార్యకలాపాలు విరివిగా జరిగేవి. వైజ్ఞానిక పరిశోధనలో ఎంతో స్వేచ్ఛ ఉండేది.

క్రీ. పూ. 3వ శతాబ్దినుండి క్రీ. త. 3వ శతాబ్ది వరకు చైనాను పాలించిన హాన్ వంశీయుల కాలములో కన్‌ఫ్యూసియనిజం అతి ముఖ్యమైన తత్త్వవిచారమైనది. సాహితీరంగంలో పాండిత్యం కొత్తశిఖాలు అందుకొన్నది. మంచి సమాజానికి మూలం పండితుడైన పరిపాలకుడని కన్‌ఫ్యూసియసిస్టులవాదం. ఆనాటి చైనా ప్రభుత్వోద్యోగివర్గంలో పండితుడు ఒక వెన్నెముక.

కన్‌ఫ్యూసియనిజం, అన్యతత్త్వ విచారణలలో ప్రవేశం, సాహిత్య విమర్శ, ప్రాచీన రచనల అధ్యయనం, చరిత్ర మొదలైనవి ఉన్నత విద్యలో భాగాలు. నిర్ణీత పాఠ్య విషయాల అధ్యయనం తర్వాత ప్రభుత్వ ఉద్యోగాలలో చేరేవారికి జాతీయ స్థాయిలో పోటీ పరీక్షలు నిర్వహించేవారు. ప్రభుత్వ ఉద్యోగాలలో యోగ్యతా సూత్రానికి ప్రాధాన్యమివ్వడం చైనీయులనుండి మిగిలిన ప్రపంచానికి అందజేయబడింది.

చైనాలో బౌద్ధం ప్రవేశించడంతో బౌద్ధ సాహిత్యమంతా చైనా భాషలోకి అనువదించబడింది. గణితం, ఖగోళం మరియు ఇతర కళలు, శాస్త్రాలు, ఫలితంగా చైనా ఉన్నత విద్యలో ప్రధాన భాగాలైనవి.

## 4. ప్రాచీన అమెరికా నాగరికతా కాలము

ఉన్నత విద్యకు సంబంధించి, ఈ నాగరికతకు చెందిన సమాచారం చాలా అస్పష్టంగా ఉన్నది. ఐతే, ఆనాటి అమెరికన్లలో ఆచరణలో ఉన్న ఉన్నతస్థాయి మాయనుబట్టి, అజిటెక్ నాగరికతల్లోని సాంస్కృతిక విజయాలనుబట్టి ఇక్కడ కూడా ఒకవిధమైన, లాంఛనమైన ఉన్నతవిద్య ఉన్నట్లు తెలుస్తున్నది. మౌఖికమైన పద్ధతుల పరిణామక్రమం, చరిత్ర, పద్యం ఇక్కడి విద్యలో ముఖ్యవిషయాలు.

ఒక్క 'పెరు' ప్రాంతంలో తప్ప మిగిలిన అన్నిచోట్ల లిపుల ద్వారా మతాధిపతులు లిఖితపూర్వకమైన రికార్డులను భద్రపరిచినట్లు తెలుస్తున్నది. ఖగోళం, గణితం, ఇంజనీరింగ్ మొదలైన వాటిలో నెలకొల్పబడ్డ ఉన్నత ప్రామాణికస్థాయినిబట్టి పూర్వ కొలంబియా, అమెరికాలలో ఏదో ఒకవిధమైన ఉన్నత విద్యావిధానం ఉన్నట్లు విశదమౌతున్నది.

## 5. గ్రీకుల కాలము

అథియనులు, అయోనియన్లులు, డొరియనులు గ్రీక్‌దేశాన్ని జయించి వారు అక్కడ స్థిరనివాసం ఏర్పాటు చేసుకొనే కాలంనాటికి వారికి అక్షరజ్ఞానంలేదు. తర్వాతి చీకటి యుగాలలో (క్రీ. పూ. 1100–800) సహితం గ్రీకుల వైజ్ఞానిక ప్రగతి చాలా అర్వాచీన

మైనదే. ఆ తర్వాతనే వారు వ్రాయడం నేర్చుకొన్నారు. హెమోరిక్ పురాణాల ప్రకారం అప్పటి సజ్జన సమాజంలో మౌఖిక పద్ధతిలో సంగీతం, పద్యం, సైనిక శిక్షణ, శరీర నిర్మాణ విద్యలు మాత్రమే వారికి తెల్సినవి.

క్రీ. పూ. 800 సం॥ల తర్వాత గ్రీకులు నగర రాజ్య విధానాన్ని రూపొందించుకొన్నారు. నేటి ప్రపంచ రాజకీయ వ్యవస్థకు ఈ విధానమే పునాది. అనేక వైజ్ఞానిక కార్యకలాపాలకు కేంద్రముగా, విభిన్న సంస్కృతుల సమ్మేళనానికి ఒక సాధనంగా, అనేక సాంఘిక, ఆర్థిక పరిణామాలకు హేతువుగా, కులీనుల ఆధిక్య పథానికి ఒక పని ముట్టుగా ఈ రాజ్యవిధానం దోహదపడినది. అంతేకాదు. అక్షరజ్ఞానం గల ఒక నూతన సమాజ స్థాపనకు కారణమైనది. క్రీ. పూ. 6వ శతాబ్దిలో విద్యావిషయమై తత్త్వవిచారణా కేంద్రాలన్నింటిలో ఎన్నో మార్పులు మొదటిసారిగా వచ్చాయి.

థేల్స్‌యొక్క మైలీషియనిజం తత్త్వవిచారణలో ఒక ప్రాచీనమైన ప్రముఖ కేంద్రమైనది. ఈ సువిశాల విశ్వంలోని వింతలన్నింటికి వివరణలివ్వడం ఈ కేంద్రముయొక్క ముఖ్యవిధి.

పైథాగరస్, ఆయన శిష్యులు ఒక ఊహాత్మక జీవనాన్ని ఎన్నుకొన్నారు. సంఖ్యల, అంకెల సంగ్రహాలను వీరు అధ్యయనం చేసారు. తత్త్వవిచారణలో వీరిది బలమైన వాదమే ఐనా ఉన్నత విద్యపై అది ఎట్టి ప్రభావం చూపలేదు. ఐనప్పటికీ, వైజ్ఞానిక విషయాభివృద్ధికి, అధ్యయనాలలో ప్రత్యేకీకరణకు వీరివాదం బాగా తోడ్పడింది.

క్రీ. పూ. 5వ శతాబ్దంలో, గ్రీక్ దేశంలో ఒక గొప్ప వైజ్ఞానిక విప్లవం వచ్చింది. స్పార్టా తప్ప, మిగిలిన అన్ని నగర రాజ్యాలలో ప్రజాస్వామికమైన ఆనాటి రాజకీయరంగంలో వ్యక్తివాదం తలెత్తినది. ఈ విప్లవ వాదానికి మూలపురుషులు సోఫిస్టులు. వీరు వృత్తిపరంగా ఉపాధ్యాయులు. మైలీషియన్లవలె వీరు విశ్వంయొక్క అధ్యయనానికి కృషి సల్పలేదు. మానవ సామర్థ్యాల అభివృద్ధిపై వీరు కేంద్రీకరించారు. శాస్త్రీయ తత్త్వవేత్తల హేతువాదాన్ని ఉపయోగిస్తూ, నీతి శాస్త్రాన్ని, రాజనీతిని, అర్థశాస్త్రాన్ని, తర్కశాస్త్రాన్ని అభివృద్ధి చేసారు. ఏథెన్స్‌లాంటి ప్రజాతంత్ర నగరాలలో వీరిబోధనలకు మంచి ఆదరణ లభించినది.

గ్రీక్ విద్యావిధానంపై సోఫిస్టుల ప్రభావం గణనీయమైనది. భాషలు, భాషా శాస్త్రాలు రాజకీయ ప్రగతికి సాధనాలని చెప్పారు. సోఫిస్టుల మూలంగానే గ్రీక్ దేశంలో వైజ్ఞానికాభివృద్ధికి ప్రాముఖ్యత కలిగినది. మానవ జీవనంతో ప్రత్యక్ష సంబంధంగల సకల విషయాలు గ్రీకుల పాఠ్యప్రణాళికల్లో చోటు చేసుకొన్నాయి. ఐతే సోఫిస్టులవాదం అరాజకానికి, నాస్తికతకు దారితీస్తున్నదని సంప్రదాయక గ్రీకులు వీరిపై దండెత్తారు. సోఫిస్టుల ఉపయోగితావాదం, సాపేక్షతావాదం, అవకాశవాదం, అతివ్యక్తివాదం అన్నింటిని వ్యతిరేకించారు. నిజమైన, సత్యమైన విజ్ఞానాన్ని హేతుబద్ధంగాను, సన్మార్గాలద్వారానుమాత్రమే మానవుడు పొందగలడని సంప్రదాయకవాదులు వక్కాణించారు.

సోఫిస్టిజాన్ని ఎదిరించినవారిలో సోక్రటీస్ మొదటివాడు. ఒక ప్రత్యేక వాదానికి ఈయన కర్తగాకున్నా, క్రమశిక్షణలోకూడిన ఒక సంభాషణద్వారా విజ్ఞానాన్ని పొందవచ్చని, నిజమైన విద్యఅంటే నిరంతర పరిశోధనే అని, విద్యకు నైతికంగా కొన్ని లక్ష్యాలు ఉంటాయని సోక్రటీస్‌వాదం. ప్రసంగికుడు ఒక ఆదర్శమైన పౌరుడై ఉండాలని, అందరి మంచికోసం ఆతడు శ్రమించాలని సోక్రటీస్ అభిమతం. ప్రాచీన రచనల అధ్యయనం, విశ్లేషణ అనుకరణలతో కూడిన ఒక సాహిత్యపరమైన చదువు రాజకీయాలలో ప్రవేశించేవారికి అవసరమని సోక్రటీస్‌వాదం. సాహిత్యం, చరిత్ర, సంగీతం, తర్కం, నీతి మరియు ఇతర కళలలో ప్రవేశం, అలంకారశాస్త్రంలో ఆధిక్యతగలవారు మాత్రమే రాజకీయాలలో చేరాలని సోక్రటీస్ కోరాడు.

సోక్రటీస్ వాదానికి బాగా ఆకర్షితులైన వారిలో ముఖ్యుడు ప్లేటో. 'రిపబ్లిక్' అనే తన గ్రంథంలో ఒక ఆదర్శవంతమైన, ఊహాత్మకమైన ఒక ఉన్నత విద్యావిధానాన్ని, ఒక మేధావివర్గాన్ని ఈయన సృష్టించాడు. ఉన్నతవిద్య అనే ఒక సద్గుణంద్వారా ఈ మేధావివర్గం సమాజాన్ని పరిపాలిస్తుందని చెప్పాడు. ఉన్నత విద్యలో గణితం, భాషలు, తత్త్వవిచారణ ప్రధాన పాఠ్యవిషయాలుగా పేర్కొన్నాడు. ఏథెన్స్‌లో ఒక 'అకాడమీ'కూడా స్థాపించాడు.

ప్లేటోయొక్క వైజ్ఞానిక కృషికి ప్రతీకగా ఆయన శిష్యుడు ఆరిస్టాటిల్ నిలుస్తాడు. ప్లేటోయిజాన్ని ఈయన చాలావరకు ఒప్పుకొంటాడు. భౌతిక, జీవశాస్త్రాలను ఈయన పాఠ్యప్రణాళికల్లో చేర్చాడు. ఏథెన్స్‌లో 'లీసియన్' అనే ఒక విద్యాపీఠాన్ని నెలకొల్పి, తత్త్వవిచారణకు, భౌతికశాస్త్రాల అధ్యయనానికి దానిని కేంద్రముగా అభివృద్ధిపర్చాడు.

అలెగ్జాండర్ జైత్రయాత్రలు ప్రపంచంలోని భిన్న సంస్కృతులమధ్య ఒక బాంధవ్యాన్ని స్థాపించాయి. గ్రీక్ నగర రాజ్యవిధానం క్షీణించాక, సమాజంకన్నా వ్యక్తి ప్రధానమనే వ్యక్తివాదం రాజకీయ రంగంలోనేగాక, విద్యారంగంలో కూడ చోటుచేసుకొన్నది.

హెలినిస్టిక్‌యుగం ఉన్నత విద్యారంగంలో ఆవిర్భవిన్నతకు, అనేక నవకల్పనలకు ఒక వెలుగు పట్టినది. ప్లేటో ''అకాడమి'', ఆరి

---

## రచయితలకి మనవి

రచనలలో ఇంగ్లీషు లిపి అధికంగాఉంటే అచ్చు కూర్పుకి ఇబ్బందిగా ఉంటుంది కనుక 'భారతి'కి తమ రచనలు పంపేవారందరూ వీలయినంత వరకు తెలుగు లిపినే వాడాలని మనవి చేసుకుంటున్నాము.

సంపాదకుడు.

స్టాటిల్ 'లీసియన్'లు నిలబడటానికి దోహదపడినది. ఎపిక్యురస్, స్టాయిక్స్ పాఠశాలలనేవి క్రొత్తగా స్థాపించబడినవి. గురు శిష్య సంబంధాలపై ఒక నొక్కు పెట్టబడినది. ఈ కాలంలోనే సెక్యులర్ విద్యకు బీజాలు పడినవి. తత్త్వవిచారణలో వ్యక్తిశ్రేయస్సు ప్రధానమైనది. అన్నింటికన్నా అలంకారశాస్త్రం మహారాణిగా పరిగణించబడినది. సాహిత్యం, చరిత్ర, పద్యం బాగా అధ్యయనం చేయబడినవి. లాంఛనప్రాయంగాని పద్ధతిలో వివిధ శాస్త్రాలలో బోధన జరిగినది. శాస్త్రీయ పరిశోధనకు ముఖ్యంగా ఈయుగం బాగా తోడ్పడినది.

క్రీ. పూ. 3వ శతాబ్దంలో ఈజిప్టును పాలించిన 'టాలిమీలు' శాస్త్రపరిశోధనకై "మ్యూజియం" అనే సంస్థను నెలకొల్పారు. ఇక్కడే ఖగోళ, భౌగోళిక, భౌతికశాస్త్రాలు క్షేత్రగణితము బోధించబడినవి. పట్టభద్రులస్థాయి విద్యార్థులకు శిక్షణ ఇవ్వబడినది. పరిశీలన, ప్రసంగాలద్వారా విద్యార్థులు వైద్యం నేర్చుకొనేవారు.

ఏథెన్స్, అలెగ్జాండ్రియా, పెర్గామమ్, రోడ్స్, కాస్, స్మిర్నా, బేరూట్, ఏంటియోక్ మొదలైన హెలినిస్టిక్ తూర్పు మధ్యధరా నగరాలలో అంతర్జాతీయ ఖ్యాతినొందిన అనేకమంది పండితులు, ఆచార్యులు, అధ్యాపకులు విద్యాబోధనలు చేసినట్లు ఆధారాలు ఉన్నాయి. సాంస్కృతిక వ్యాప్తికి ఈయుగం బాగా తోడ్పడిందని చెప్పవచ్చు. గ్రీకుల విద్యావిధానం మధ్యధరా ప్రపంచంపై, ముఖ్యంగా, రోమన్లపై గట్టి ప్రభావం చూపినది.

## 6. రోమన్ల కాలము

క్రీ. పూ. రెండు, ఒకటి శతాబ్దాలమధ్య తూర్పు హెలినిస్టిక్ ప్రాంతాలను జయించడంద్వారా రోమన్లు, గ్రీక్ సంస్కృతిని, విద్యావిధానాన్ని, విద్యావేత్తలను పొందగలిగారు. కులీనులైన రోమన్ పిల్లల చదువు ఈ గ్రీక్ పండితుల చేతుల్లోనే నడిచినది. సాహిత్య భాషగా లాటిన్ అభివృద్ధిచెందిన తర్వాతకూడ గ్రీక్ భాష ప్రభావం రోమ్‌లో బలంగానే ఉన్నది. తత్త్వ, వైద్య, శాస్త్రరంగాలలో ఇది స్పష్టంగా తెలుస్తుంది. క్రీస్తు జనన కాలంలో అలంకారశాస్త్రం ఉన్నత విద్యలో ప్రధాన విషయం. రాజకీయంగా చైతన్యవంతులైన రోమన్లు భాషావేత్తల ప్రాసంగిక నైపుణ్యాలను బాగా ఆదరించేవారు.

న్యాయశాస్త్రంలో రోమన్లు ఒక నూతన శకాన్ని ఆరంభించారు. క్రీ. శ. 2వ శతాబ్దంలో ఈ శాస్త్రాన్ని వారి ఉన్నతవిద్యలో ప్రధాన విషయంగా ఎంచారు. ప్రసిద్ధికెక్కిన గైయస్, ఉల్పియన్, పపీనియన్, పౌలస్ మొదలైన న్యాయశాస్త్రజ్ఞుల రచనలు, ఉపన్యాసాలు ఈ శాస్త్ర అభివృద్ధికి బాగా సహకరించాయి. క్రమంగా వీరి రచనలు అధ్యయనం చేయడం, వివరించబడటం, వ్యాఖ్యానించబడటం, అవే వాచకాలుగా నిర్ణయించబడటం జరిగింది. రోమ్ తర్వాత బేరూట్, కాన్స్టాంటినోపుల్‌లు న్యాయశాస్త్ర అధ్యయనాలకు ముఖ్య కేంద్రాలైనవి.'

క్రీ. పూ. రోమన్లు ఉన్నత విద్యపై రాజులుగాని, ప్రవేట్ వ్యక్తులుగాని అంతగా ఖర్చుపెట్టలేదు. అధ్యాపకులను, ఆచార్యులను చక్రవర్తులు చెదురుమదురుగా పోషించినట్లు ఆధారాలు కొన్ని ఉన్నాయి. క్రీ. శ. ఒకటవ శతాబ్దములో వెస్పాసియన్ లాటిన్, గ్రీక్ భాషలకు వేర్వేరుగా రెండు విద్యాపీఠాలను రోమ్‌లో నెలకొల్పినాడు. ప్రపంచ ప్రసిద్ధికెక్కిన ఫిలాసఫర్—చక్రవర్తి అయిన మార్కస్ ఆర్లియస్ ఆంటోనినస్ ప్లాటోయిజానికి, అరిస్టాటలిజానికి, స్టాయిసిజానికి, ఎపిక్యూరియానిజానికి ప్రత్యేకమైన నాలుగు తత్త్వవిచారణా కేంద్రాలను, భాషకు సంబంధించి మరొక కేంద్రాన్ని ఏథెన్స్‌లో నెలకొల్పి, వీటి అభివృద్ధికై నిధులు సమకూర్చినట్లు చరిత్ర చెబుతున్నది. క్రీ. శ. 529 సం॥లో మొదటి జస్టీనియన్ చక్రవర్తి పీటన్నింటిని మూసివేయించాడు. తత్త్వవిచారణ, భాషలకుచెందిన అధ్యాపకుల ఆస్తిపాస్తులను జప్తు చేయించాడు. మతాధిపతులు చదువు చెప్పడాన్ని నిషేధించాడు. ఈవిధంగా ఏథెన్స్‌లోని విద్యాకేంద్రాలు అంతరించడములో ప్రాచీన ఉన్నత విద్యా చరిత్రయొక్క చివరి అధ్యాయం పరిసమాప్తమైనది. ఐనప్పటికి, గ్రీకుల వారసత్వము, రోమన్లద్వారా పశ్చిమదేశాల విద్యాచరిత్ర ప్రాంగణములో ప్రవేశించి తర్వాత అభివృద్ధిచెందడం జరిగింది.

## సంప్రదించవలసిన గ్రంథములు


1 ప్రొ. బి. సి. రాయి: "హిస్టరీ ఆఫ్ ఇండియన్ ఎడ్యుకేషన్, పార్ట్ 1: ఎడ్యుకేషన్ ఇన్ ఏన్షన్ట్ ఇండియా."

2 ఎఫ్. ఇ. కే: "ఎ హిస్టరీ ఆఫ్ ఎడ్యుకేషన్ ఇన్ ఇండియా ఎండ్ పాకిస్తాన్" (4వ ఎడిషన్) లండన్, ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటీ ప్రెస్, 1964.

3 హెచ్. ఎస్. గాల్ఫ్: "ఎ హిస్టరీ ఆఫ్ చీనీస్ ఎడ్యుకేషనల్ ఇన్‌స్టిట్యూషన్స్ టు ది ఎండ్ ఆఫ్ ఫయివ్ డయినస్టీస్," (960 క్రీ. శ.) లండన్, ప్రొబ్‌స్టన్—హేన్ 1951.

4 ఎమ్. ఎల్. క్లార్క్: "హయ్యర్ ఎడ్యుకేషన్ ఇన్ ది ఏన్షన్ట్ వరల్డ్"— లండన్, రూట్లెడ్జ్ ఎండ్ కెగాన్‌పాల్ 1971.

5 ఎ. ఇ. మేయర్: "ఏన్ ఎడ్యుకేషనల్ హిస్టరీ ఆఫ్ ది వెస్టరన్ వరల్డ్," న్యూయార్క్, మెక్‌గ్రా — హిల్ 1965

6 ఆసా ఎస్. నోల్స్ (సంపాదకత్వం): "ది ఇంటర్నేషనల్ ఎన్‌సయిక్లోపీడియా ఆఫ్ హయ్యర్ ఎడ్యుకేషన్," వాల్యుమ్5. జోస్సే—బాస్ పబ్లిషర్స్, 1977.




# రైతులకు రాయితీలు
# రుణాలు చెల్లింపు కాల వ్యవధి పొడిగింపు

వ్యవసాయదార్ల సాధక బాధకాలను తొలగించే లక్ష్యంతో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, 1980 జూన్ 30వ తేదీ నాటికి వివిధ సహకార ఆర్థిక సంస్థలకు రైతులు బకాయిపడ్డ రుణాల వసూళ్ల విషయంలో కాలవ్యవధిని పునర్నిర్ణయించింది.

**అసలు మొత్తం:**

| | |
|---|---|
| సాధారణ రుణం : | మూడు సంవత్సరాల రుణంగా పునర్నిర్ణయం |
| మధ్యకాలిక (మార్పుచేసిన) రుణ వాయిదా | సాధారణ రుణంతో కలుపుకొని రుణ మొత్తం ఐదు సంవత్సరాల రుణంగా పరిగణింపు |
| మధ్యకాలిక (పునర్నిర్ణాయక) రుణ వాయిదా | మధ్యకాలిక సాధారణ రుణంతోపాటుగా మొత్తం (మార్పుచేసిన) రుణాలన్నీ ఏడు సంవత్సరాల వ్యవధి రుణాలుగా పరిగణింపు |

**వడ్డీ:**

| | |
|---|---|
| ఒక సంవత్సరానికి వడ్డీ బకాయి : | ఒక సంవత్సరంపాటు వాయిదా వేశారు |
| రెండు సంవత్సరాల వడ్డీ బకాయి : | రెండు సంవత్సరాలు గడువు పెంచారు |
| మూడు సంవత్సరాలు, అంతకు మించిన కాలానికి వడ్డీ బకాయి | మూడు సంవత్సరాలపాటు వ్యవధి పెంచారు. |

**దీర్ఘకాలిక రుణాలు:**

మొత్తంమీద గడువు పొడిగింపు మూడు సంవత్సరాలకు మించకుండా దీర్ఘకాలిక రుణాలను రుణం కాల వ్యవధితోపాటుగా, బకాయిపడ్డ వాయిదాల సంఖ్యమేరకు, తిరిగి చెల్లించడానికి ఈ దిగువ విధంగా గడువు పెంచారు.

ఒక వాయిదా బకాయి పడ్డట్లయితే, ఒక సంవత్సరంపాటు గడువు పొడిగింపు.

ఒక వాయిదాకంటే ఎక్కువగా మూడు వాయిదాలకు మించకుండా బకాయిపడ్డ పక్షంలో రెండు సంవత్సరాల పాటు గడువు పొడిగింపు.

మూడు వాయిదాలకు మించి బకాయిపడ్డప్పుడు, కాలవ్యవధి మూడు సంవత్సరాలకు పెంచారు.

**చక్రవడ్డీ లేదు:**

చక్రవడ్డీ వసూలు చేయరాదని సహకార సంస్థలన్నింటికీ ఉత్తర్వులిచ్చారు.

సన్నకారు రైతులు చెల్లించాల్సిన మొత్తం వడ్డీ అసలుకు మించరాదు.

**స్వాధీన భూములు:**

సహకారబ్యాంకులు స్వాధీనం చేసుకున్న భూములింకా వాటి ఆధ్వర్యంలోనే ఉన్నట్లయితే, రుణగ్రహీతలు పైన తెలిపిన రాయితీలకు లోబడి వారి వారి బకాయిలు 1980 డిసెంబరు 31వ తేదీలోగా చెల్లించి వేయడానికి అనుమతించబడ్డారు.

**సన్నకారు రైతుల పథకం:**

సన్నకారు రైతుల ప్రస్తుత పునర్నిర్వచనాన్ని అనుసరించి, ఐదు ఎకరాల మాగాణిభూమి, లేదా పది ఎకరాల మెట్ట భూమిగాని, అంతకు తక్కువ భూమిగాని కలిగివున్న సన్నకారు రైతులకు పై ప్రయోజనాల నన్నింటినీ కల్పించాల్సిందిగా కూడా ప్రభుత్వం ఆదేశాలు జారీ చేసింది.

*డైరెక్టరు, సమాచార, పౌరసంబంధ శాఖ, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, హైదరాబాద్.*

No. 43363/Advt./CI-3/80.

# సుదూర సామీప్యాలు

శ్రీ. జి. భాను

ఆ తీగ బాగా పూస్తుందని పెరటిలో నాటితే
 వేపచెట్టు చిటారుకొమ్మతో జతకట్టి,
అందుకోడానికి వీలుకాకుండా పూచింది పూలు !
కంటికి వదరైన పువ్వులు; మింటిపైన చుక్కలు !
ఆ శృంగాటకంలో నిలబడి పరికిస్తే,
దృగ్గోచరమౌతుంది దేవాలయశృగం !
ఆ సార ప్రసారాలు చేస్తున్న భక్తబృందాలు !
బృందావనాన్ని తలపించే మధుర సంగీతాలు!
కంటూ, వింటూ దర్శించలేనందుకు ఎన్నోతంటాలు
ఎదురుగా గుడి; పథంలో జడివానలా అడ్డంకుల ముడి !
ఇరుగమ్మ పొరుగమ్మలు ఇంటిబైట వేస్తాలు !
పట్టుకొనే గంగాజలం మ్యునిసిపాలిటి పంపులోనే,
కట్టుకునే జరీచీరలు కల్పలతషోరూము లోనే,
చూసే సినిమాలు దుర్గాకళామందిరంలోనే,
చిత్రమేమంటే — ఒకరి ఇల్లు ఇంకొకరు తొంగిచూసు
 కొన్నది లేదు
ప్రక్క ప్రక్కనే ఇళ్ళు ! ఆ దూరం వందల మైళ్ళు !
గగన తలంలోని చందమామ గడపపై,
కాలుమోపిన మహా మానవుడు చిరంజీవి !
చరిత్ర రక్త వర్ణాధరంపై దరహాస కుసుమాలు
పూయించిన శస్త్ర ధరుడు ! శాస్త్రజ్ఞుడు ఈ మనిషి !
అందదనుకొన్న అందలాన్ని అధిరోహించి,
కాలానికి కనుగీటిన రసికావతంసుడు ఈ నరుడు !
కాని తనదేశమే ఆవాసంగా, తన ఎల్లలే ప్రవాసంగా
గిరి గీసుకొని, భేదించిన అల్పజీవి మానవుడే !
మనిషి చేతికైతే అందింది అందాల చందమామ !
ఇంకా అందుకోలేదు డెందాల సీమ !

---

# తమసోమా...

శ్రీ కశింకోట ప్రభాకరదేవ్

ఇది మౌనం అనుకోవద్దు
 ఇందులో
భావాల బాంబుపొతరలున్నాయి.
యివ్వాట్టి అక్షరాలేనవి
కొట్టిపారెయ్యకు
చైతన్యాగ్ని జ్వాల లిందులో దాగివున్నాయి.
వొంగి వొంగి ప్రబలకవాడపై
స్వారీ చెయ్యాలని ముచ్చటపడకు —
మేఘాలు చల్లని జల్లులేనేకాదు
పిడుగుల్నీ కురిపిస్తాయ్.
అంతా చీకటేనని చేతులు కలపకు
తూర్పు దిక్కున వెలుగు కొరడా ఝళిపిస్తుంది.

---

# కవితో - సామాన్యుని సణుగుడు

శ్రీ సి. హేమచందర్

మల్లెచెట్టు కాయలు కాయదని
  పెరికి పారేస్తామా ?
మొగలిపూవు మత్తెక్కిస్తుందని
మొదలంటా నరికేస్తామా ?
శ్రమశక్తి గొప్పదయినా
పక్కనున్న సుగంధపరిమళాన్ని ఆఘ్రాణించక
నాసిరకం స్వేదం వాసనచూస్తూ కూచుంటుందా?
వేడిని కల్గించడంలేదని
చల్లని వెన్నెలను కాదంటామా ?
వెన్నెల సయితం వేడినిస్తుంది కొందరికి
అది సూర్యుని వేడికి భిన్నం.
చమటోడ్చే శ్రామికుని ముక్కు
సువాసనా సౌరభాలను ఆఘ్రాణించాలని కోరదా ?
యంత్రాల మోతతో విసుగొందిన కార్మికుల కర్ణాలు
వీనుల విందయిన సంగీతాన్ని వినాలని కోరుకోవా ?
నిత్యజీవితంలో చూసిన వాటినేచూసి అలసిన కన్నులు
కనుల పండుగగా నాట్యాన్ని వీక్షించాలని కాంక్షించవా?
పడకటింట సతీపతులకు
విప్లవగీతమో, లేక అభ్యుదయ కవిత్వమో
  ఆనందాన్నిస్తుందా ?
ఊయలలో పసివాడు లాలిపాటతో నిద్రపోక,
విప్లవ గీతంతో విశ్రమిస్తాడా ?
సృష్టిలో మల్లెపువ్వు, మొగలిపువ్వు, సువాసనలు
  ఎలాంటివో
జీవితంలో గీతం, నాట్యం, వినోదం అలాంటవే.
కవిత్వాలలో భావకవిత్వం అలాంటిదే.
ఆలోచనలు రూపందిద్దుకుని
భాసిస్తే అది భావం
భావానికి అభ్యుదయం జోడిస్తే
అది అభ్యుదయ భావం
విప్లవానికి 'అభ్యుదయ భావం' గుండె కాయకాదా ?
సమాజంలో సమతను కోరే కవులు
వర్ణ విభేదాన్ని విమర్శించే కవులు
ఎందుకు తమలోతాము వర్గాలను సృష్టించు
  కుంటారు ?
వీడు భావకవి, వాడు అభ్యుదయకవి, ఆతడు
  విప్లవకవి అని
ఎందుకు తమపై తాము గుర్తులు వేసికుంటారు?
వీరు కవిత్వాలలో ఒకరి పరిధిలోకి మరొకరు
అడుగిడడంలేదా ?
నా చిన్న బుర్రకు ఈ లాజిక్కు అర్థం కావడంలేదు.
అందుకే ఈ సణుగుడంతా.
పసివానినుండి – శ్రామికుని వరకు
పామరునినుండి – మేధావి వరకు
కవితతో హృదయాన్ని స్పందింపజేసేవాడే
అసలయిన కవని నా సణుగుడు.
ఇది కవితో – సామాన్యుని సణుగుడు.



# బాల్యం

## శ్రీ మేకా మన్మధరావు

కోయిల గొంతునుండి మధుర గీతంలా
కోవెల గంటనుండి దివ్యనాదంలా —
అమ్మ గర్భంనుండి
హాయిగా, ఆనందంగా ఆవిర్భవించానో ?
లేక,
గోరింత ముల్లుపై మంచుబొట్టులా
గురివింద తీగపై గుమ్మడి పండులా
బాధగా, బరువుగా బ్రతుకు దాల్చేనో ?
నాకై నేనెరుగలేను.

పూరేకు పాన్పు తూగుటుయ్యాలలో
ఎదను జోకొట్టిన విదురగీతాలమా
నే నెరుగను.

మమతలు నిండిన అమ్మ ఒడి వొద్దికలో -
ఆకలి మంటల సెగల వెచ్చదనంలోనో
ఆప్యాయతా జడుల చల్లదనంలోనో
శైశవమంతా విదురించి ఉంటుంది !

అమ్మ పొత్తిళ్ళి అనురాగామృత స్రవంతిలో
అభ్యంగన మాడటం,
కనుదమ్ముల వెలుగు కలల చంద్రికలలో
డోలలాడటం తలదుకొంటే
"ఎంత అదృష్టం !" అనిపిస్తుంది !
బాల్యం తలచుకుంటే బ్రతుకు పులకరిస్తుంది.

రాత్రివేళ రామాయణం చదవడం
రావణ గుణాలను అర్థంచేసుకుని
అలవరచుకోవడానికనీ,
బ్రతుకంతా భారతం పదే పదే వినడం
ఏకవస్త్ర ఇక్కట్లుకు
ఆనందంతో కేరింతలు కొట్టడానికని
నాకు తెలియదప్పుడు !

సిలువవేసి క్రీస్తును
రుధిరాభిషిక్తుని గావించిన
వివేక మనస్కులు నా పూర్వీకులేననీ,
సోక్రటీసుకు, విషపాత్ర
కానుకగా అర్పించిన అమృత హృదయం
నా పూర్వీకులదేననీ,
గాంధీజీ గుండెలలో తుపాకి గుండు
గురిపెట్టి, కన్నీరు తుడుచుకున్న
మానవత్వం నా వెనుకతరం వారిదేననీ
నాకు తెలియదప్పుడు.

మానవ జీవితంలో బాల్యం
కార్తీక పున్నపు చంద్రునిలా కనిపిస్తుంది ।
కవ్విస్తుంది ! !

బాల్యం ఉయ్యాలలో, బ్రతుకు
లాలిపాటగా సాగిపోతుంది !
పూలతోటగా పరిమళిస్తుంది ! !
బాల్యం ఎంత తీయనిది !
అది తిరిగి పొందాలన్నది ఎంత తీరనిది ? !

శ్రీ ఎమ్. పార్థసారథి

# మిణుగుర్లు

500 మంది పనిచేస్తున్న కంపెనీకి ఓ స్టాఫ్ కాంటీన్ వుండటం కనీసావసరం అంటే ఎవరికీ సందేహముండక్కర్లేదు. హోటళ్లలో ధరలు ఎలా మండిపోతున్నాయో అందరికీ తెలుసు. అసలే చాలీ చాలని జీతాలతో సంసారాలు నెట్టుకొస్తున్న వుద్యోగులు ఈ బోడి జీతం యింట్లో పెళ్లాం పిల్లలమీదే ఖర్చుపెడతారా, బైట కాఫీ హోటళ్లకే తగలేస్తారా!

కాని మేనేజిమెంట్లన్నింటికీ ఓ జబ్బుంటుంది— అది మాయ రోగం. అడిగిందాకా ఏదీ యివ్వరు. ఆ అడగటమైనా అలా యిలా కాదు. 'అయ్యో, బాబూ, బీదవాళ్లం. మేం బైట ఉడిపిలో టిఫిన్లు, కాఫీలు భరించలేం. స్టాఫ్ కాంటీన్ పెట్టించండి.' అంటో దయగా, జాలిగా అడిగితే యిస్తారా? ఊహూఁ అలా యిస్తే చులకనైపోరూ! ఉద్యోగులు తమకా్కవలసిన ప్రతీ చిన్న అవసరంకోసమూ అలజడి చేయాల్సిందే. ఆ అలజడి తారస్థాయికి చేరాల్సిందే. అప్పుడుగాని అడిగిందాంట్లో సగమో, పావో యివ్వరు. చివరికి కర్రవిరగదు. పాము చావదు. సమ్మెలన్నీ అంతే. కార్మిక—యాజమాన్య సంబంధాలుఅంతే.

ఈ 500 మంది సభ్యులున్న అతి మిలిటెంటు యూనియన్ కూడా అదే చేసింది.

కాంటీన్ లేకపోవటంవల్ల వుద్యోగు లెదుర్కొంటున్న ఆర్థిక యిబ్బందులు ఏకరువుపెడుతూ, కాంటీన్ అవసరాన్ని నొక్కిచెబుతూ మేనేజిమెంటుకు లాంఛనప్రాయంగా వుత్తరం రాసినప్పుడు వాళ్లకు తెలుసు–ఇవి చదువుకోగానే మేనేజిమెంటు కాంటీన్ ప్రారంభించదని.

ఓ నెలాగి మరో వుత్తరం.

తర్వాత అల్టిమేటం.

—ఫలాని తేదీలోగా కాంటీన్ ప్రారంభించకపోతే ............ (ఏం చేస్తారు? మేనేజిమెంటుకూడా యిలాగే అనుకుంది, ఏం చేస్తారో చూద్దామని.)

ఆ ఫలాని తేదీ గడిచిపోయింది.

యూనియన్‌వాళ్లు సర్వసభ్యసమావేశంలో తీర్మానించారు. —మేనేజిమెంటు తమ న్యాయ సమ్మతమైన కోర్కెతీర్చటం లేదు గనక యిక సహాయనిరాకరణ తప్పనిసరి అని.

'మీ బోడి సహాయం ఎవడిక్కావాలి, మా మాన్యువల్సూ, రూల్సూ, రెగ్యులేషన్సూ వుండటంవల్ల మీరు పని చేస్తున్నారు గాని మాకు సహాయం చెయ్యాలనికాదు' అనుకొని మేనేజిమెంటువాళ్లు సహాయ నిరాకరణ నోటీసును చెత్తబుట్టలో పారేశారు.

తరవాత టూల్—డౌన్ స్ట్రైక్.

'ఠీక్ హై. గో అహెడ్' అన్నది మేనేజిమెంట్.

ప్రదర్శనలు.

నోటీసులు.

ఛాలెంజ్‌లు.

చివర్న—సమ్మె.

కార్మిక—యాజమాన్య సంబంధాలను పర్యవేక్షించే ప్రభుత్వాధికారి కూడా వచ్చి కలుగచేసుకున్నాడు.

మూడురోజుల సమ్మె తర్వాత సంభాషణలు ప్రారంభమయ్యాయి. మొదట సమ్మెమానితే గాని సంభాషణలు ప్రారంభం కావన్నారు మేనేజిమెంటు. 'అమ్మమ్మో. ఇప్పుడు సమ్మె విరమించుకుంటే, మళ్లీ యింతమందిచేత సమ్మెచేయించటం చాలా యిబ్బంది' అన్నారు యూనియనిస్టులు.

ఆ అనిశ్చిత వాతావరణంలోనే సంభాషణల్లాంటివి జరిగాయి. తాడో, పేడో తేలకుండా ఒప్పందాల్లాంటివి కుదిరాయి. ఈ ఒప్పందాల భాష ఎలా వుంటుందంటే అటు మేనేజిమెంటు వాళ్లూ, యిటు యూనియనువాళ్లు కూడా ఎవరిక్కావలిసిన అర్థం వాళ్లు తీసుకోవచ్చు. కాని ఎవరుమాత్రమేం చెయ్యగలరు! ఒప్పందాలభాష ఎప్పుడూ అలాగే వుంటుంది.

మేనేజిమెంటు ఆర్థిక పరిస్థితిని సమాలోచించి, త్వరలో (ఎప్పుడు?) కాంటీన్ గురించి నిర్ణయం తీసుకోవటానికి సుముఖంగా వుంది. కాని మొదట దేశ ఆర్థిక పరిస్థితులదృష్ట్యా, ఉత్పత్తి లక్ష్యాల దృష్ట్యా, కార్మిక—యాజమాన్య సత్సంబంధాలదృష్ట్యా సమ్మె విరమించుకోవాలి. 'నో వర్క్—నో వేజెస్' పద్ధతి ప్రకారం సమ్మెకాలానికి జీతం అడక్కూడదు. ఐతే ఈ సమ్మెకాలాన్ని యింక్రిమెంటు వాయిదా వెయ్యటానికి పరిగణించరు. సమ్మెలో పాల్గొన్న వాళ్లకు ఛార్జిషీట్లివ్వరు. క్రమశిక్షణోల్లంఘనకు చర్య తీసుకోరు. ఈ సమ్మెమూలంగా వచ్చిన వుత్పత్తి నష్టాన్ని పూరించటానికి వుద్యోగులు సంపూర్ణ సహకారాన్నందిస్తారు.

—అదీ ఒడంబడిక.

ఇది చాలా మిలిటెంట్ యూనియనని చెప్పానుగదా — వాళ్ళు ఆ తర్వాత కూడా మేనేజిమెంటును వూపిరి పీల్చుకోనివ్వలేదు. వుద్యోగులకు జీతాల్లో కోతరాకుండా, మేనేజిమెంటుకు చిన్న చిన్న యిబ్బందులనేకం కలిగించి 'న్యూసెన్సు' సృష్టించారు— పక్కవాణ్ణి గిల్లి ఏమీ ఎరగనట్టుగా కూర్చుంటారే, అలాగ. వాళ్లడగలేదు. వీళ్లు చెప్పరు. కాని యిద్దరికీ తెలుసు, ఎవరేమి చేస్తున్నారో. పోట్లాడటం సులభం. కాని శతకకారుడు చెప్పినట్టుగా కంటిలో నలుసు, చెవిలో జోరీగ, చెప్పులో రాయిలాగ మారితే తీసెయ్యటం కష్టం. అందువల్లే మేనేజిమెంటు వాళ్లు ఒప్పందంలో ఏమీ స్పష్టంగా లేకపోయినా నెల తిరక్కుండానే కాంటీన్ గురించి నిర్ణయం తీసుకొన్నారు. లాంఛనంగా యూనియన్‌ను కూడా ఆహ్వానించారు—వివరాలు, పద్ధతి క్రమం మాట్లాడటానికి. తర్వాత యూనియన్ నాయకులు చెప్పారిగ్గా తమ సభ్యులకు—మమ్మల్ని పిలిచి, మాట్లాడి మరీ నిర్ణయం తీసుకొన్నారని.

కాంటీన్ సహకార పద్ధతిలో వుంటుంది—అంటే కాంటీన్‌కు వుద్యోగులే యజమానులు. కాంటన్ పెట్టటానికి స్థలం, బల్లలు, కుర్చీలు, పొయ్యిలు, వంటపరికరాలు, పాత్రలు, కప్పులు, సాసర్లు, ప్లేట్లు వగైరా అన్నీ మేనేజిమెంటు యిస్తుంది. అదికాక మొత్తం కాంటీన్ ఖర్చులో సగానికి మేనేజిమెంటు సబ్సిడీ కూడా యిస్తుంది. అంటే వుద్యోగులకు తినుబండారాలన్నీ సగం ధరకే దొరుకుతాయి. కాని వుద్యోగులు కాంటీన్ ఆవరణను పాడుచెయ్యకూడదు. అక్కడ అల్లర్లు, గొడవలు సృష్టించకూడదు. కంపెనీ ఆవరణలోనే కాంటీన్ వుండటం అదనుగా తీసుకొని వుద్యోగులు అక్కడ బాతాఖానీ కొడుతూ కాలం వృధాచెయ్యకూడదు. ఈ కాంటీన్ నడపటంలో వచ్చే ఎలాంటి యిబ్బందులకు గానీ, నష్టానికిగానీ (ఒకవేళ వస్తే) మరే కోర్కెలకు గానీ మేనేజిమెంటు బాధ్యత వహించదు.

మేనేజిమెంట్ : ఓ. కే?

యూనియన్ : ఓ. కే.

మేనేజిమెంట్ / యూనియన్ } (ఏకకంఠంతో) — థాంక్యూ. వి అష్యూర్ యూ ఆఫ్ అవర్ బెస్ట్ కో-ఆపరేషన్.

తర్వాత కూల్ డ్రింక్స్.

## 2

కాంటీన్ బోర్డ్ ఆఫ్ డైరెక్టర్స్‌గా వుండటానికి యూనియన్‌వాళ్ళు ఎన్నికలు పెట్టుకున్నారు. పనికుర్రాళ్లను అప్పాయింట్ చేసుకున్నారు. 'ఆఫ్టరాల్, మేం కూడా కార్మికులం. సాటి కార్మికులకు వీలైనంత లాభంచేద్దాం' అనుకుని ఆ కుర్రాళ్లకు ఓపూట భోజనం, రెండు మూడుసార్లు కాఫీలు, టిఫిన్లు, నెలకు ఆరవై రూపాయలిచ్చి మరీ పనిచెయ్యమన్నారు.

మూడు కాఫీలూ, ఆరు టీలూ అంటూ కథ సుఖాంతం కావాలిక్కడ.

కాని—కాంటీన్ వచ్చిన సంవత్సరానికి, కుర్రాళ్ళు సణుగుడు మొదలెట్టారు.

"సార్, మా యిల్లు చాలా దూరంసార్. బొలారంనించి రావాలె. రాను పోను రోజుకు రూపాయిన్నరైతది సార్. అరవై రూపాయలు సరిపోవుసార్."

"ఓరి అత్యాశ వెధవా, ఇంతోటి వుద్యోగానికి నిమ్మ బొలారం నించి ఎవ్వరమ్మన్నార్రా — అక్కడే యిలాంటిదేదో చూసుకోకపోయావా?"

"ఎవరిస్తర్సార్?"

"మరింకేం. ఈమాత్రం నౌకరీకూడా ఎక్కడా దొరకదీ రోజుల్లో. ఎవడికి జీతాలు సరిపోతున్నాయని ఈరోజుల్లో—ఇన్నివందలొస్తున్నాయి, మాకు సరిపోతున్నాయా?"

"సార్, మేం రెండుపూటల యిక్కణ్ణే తింటం సార్."

"ఊఁ, నువ్వొక్కడివే ఏం ఖర్మ, యింటిల్లిపాదీవచ్చి యిక్కడే తినండ్రా. ఇది ధర్మసత్రమైపోయింది, ఒరేయ్, మీరు దోచుకోవటానికి మేమే కనిపించామా—, ఆశకు హద్దుండాలి. పొద్దున్న పీకలదాకా మెక్కుతారు. ఇక ఎన్ని టిఫిన్లు మాయంచేస్తారో, ఎన్ని టీ, కాఫీలు తాగుతారో లెక్కలేదు. ఇంకా ఏం కావాల్రా, మీలాంటి వాళ్ళకు వుద్యోగాలిస్తే యిలాగే నెత్తికెక్కుతారు."

"సార్సార్."

"పోరా పో."

కాంటీన్ కుర్రాళ్లుకూడా ఓ యూనియన్‌లాంటిది పెట్టుకున్నారు. ఓనాడు కాంటీన్ వర్కర్స్ యూనియన్ సెక్రటరీవచ్చి, కాంటీన్ బోర్డ్ ఆఫ్ డైరెక్టర్స్‌తో మాట్లాడేడు.

"సార్, జీతం పెంచాలె. కనీసం పదిరూపాయలు. డెబ్బై చెయ్యిని."

డైరెక్టర్స్ జోక్స్ వేసుకున్నారు.

"ఏమోయ్, ఈ కామ్రేడు మనదగ్గిర పాఠాలు నేర్చుకుంటున్నాడా, మనకే చెబుతున్నాడా?"

"యథారాజా తథాప్రజా."

"మనం మేనేజిమెంటును ఘెరవై చేసినట్లుగా వీళ్లు చెయ్యగలరా?"

"ఒరేయ్, కామ్రేడూ, నీ మిలిటెన్సీకి మెచ్చాం. నీ డిమాండ్ న్యాయసమ్మతమైనదే. మీకు పదేం, వందకావాలన్నా పెంచుతాం. మాకు వస్తున్నంత జీతం నీకూ రావాలని డిమాండ్‌పెట్టినా కరెక్టే. కాని, ఇదిగో బుల్లికామ్రేడూ, ఈ కాంటీన్ మేం ఎందుకోసం పెట్టుకున్నామో మొదట తెలుసుకో. బైట హోటళ్ల ధరలు భరించలేకనే

గద. ఏదో, కంపెనీ సబ్సిడీ యిస్తోంది గనక కాస్త చవగ్గా తినగలుగుతున్నాం. ఇప్పుడు నువ్వడిగినవన్నీ యిస్తే కాంటీన్‌లో రేట్లు పెరుగుతాయి. అప్పుడు మేం కాంటీన్ పెట్టుకున్న ప్రయోజనమేపోతుంది. అందువల్ల బ్రదరూ, అత్యాశకుపోయి బంగారు గుడ్లుపెట్టే బాతును చంపకు. ఈ వర్గసమాజంలో, ఈ దోపిడీ వ్యవస్థలో జీతాలు ఎవరికీ, ఎంతకూ సరిపోవు. ఇచ్చేవాడికి తీసుకునేవాడూ, తీసుకునేవాడికి యిచ్చేవాడూ దోపిడీదార్లుగా కనిపిస్తారు.

కాంటీన్ వర్కర్స్ యూనియన్ సెక్రటరీకి చదువురాదు. అతడికి అంతర్జాతీయ కార్మికోద్యమ చరిత్రగానీ, కనీసం మన దేశంలోని కార్మిక సంఘాల పరిణామంగానీ, అవి సాధించిన ఘనవిజయాలుగానీ తెలియవు. అతడికి తెలిసిందల్లా తన తోటి కార్మికులకు అరవై రూపాయలజీతం సరిపోవటంలేదనీ, మరో పది పెంచితే బావుంటుందనీ. అక్కడితో సమస్య పరిష్కారమవుతుందా? అతడికేమీ అలాంటి భ్రమలుండే అవకాశంలేదు. నిరక్షరాస్యుడైన అతడి ఆర్గ్యుమెంటు కూడా క్రూడ్‌గానే వుంటుంది మరి.

'సార్సార్, ఏమైతదిసార్, చాయ యిచ్చిన్దుకు మీకు పదమూడు పైసలు పడ్తది. ఇంకొక్క రెండుపైసలు పెంచుండ్రి. టిఫిన్లవల్ల గూడ ఒక్క రెండుమూడు పైసలు పెంచుండ్రి.

''ఆఁ, ఆఁ, వీడు ఎకనమిక్సు చెబుతున్నాడు.''

''బాబూ, నీ తెలివైన వాదనకు సంతోషించాం. రేట్లు పెంచటమంటే నీకంత సులభంగానే కనిపిస్తుంది గాని– ''

''ఇంతింత జీతాలొస్తయి. రెండుపైసలు పెంచితే ఏమైతది సార్ ?''

''ఏమీకాదు కామ్రేడ్, కాంటీన్ పెట్టుకున్న ప్రయోజనం పోతుంది.''

**''సార్.''**

''కామ్రేడూ, మేం నీకు చండశాసనుల్లా కనిపిస్తే ఈ బోడి డైరెక్టర్ల పోస్టులకు యిప్పుడే రాజీనామా యిస్తాం. మళ్లీ ఎలెక్షన్లు పెట్టిస్తాం. అప్పుడు కొత్త బోర్డుతో మాట్లాడండి. మీకు తెలుసుగా, మేమంతా మా మెంబర్లకు, అంటే కాంటీన్ షేర్ హోల్డర్లకు జవాబుదారీగావుంటాం. వాళ్లకు లాభం జరిగే పనులే మేం చెయ్యాలి—నీకో చిన్న కిటుకు చెబుతాం. టైం తీసుకుని వెళ్లి మా సెక్రటరీతో మాట్లాడు. అప్పుడేమన్నా పనిజరిగే అవకాశముంటుంది.

ఆ సాయంత్రం యూనియన్ సెక్రటరీని కాంటీన్ సెక్రటరీ కలుసుకున్నాడు.

ఎన్నెన్నో వుద్యమాలు నడిపి, కార్మికుల హక్కులకు, వారి ప్రయోజనాలకు ఎంతో లాభం చేకూర్చినవాడు, —ఈనాడు ఈ కంపెనీలో పనిచెయ్యటమే ఓ వరం అనుకుంటున్నారంటే దానికి కారణం ఈ సెక్రటరీ చేసిన త్యాగాలు, ధీరోదాత్తత. ఉద్యమాలు, ఆలజడులు నడిపించడంలో అతడికున్న చతురత, తెలివితేటలు, కన్విక్షన్, ఎత్తుగడలు – అతడికి తన సభ్యుల నాడీ, మేనేజిమెంటు ఆయువుపట్టు గూడా తెలును.

మరి, అలాంటి యూనియన్ సెక్రటరీని, పట్టుమని పది మంది సభ్యులు (తనతో కలిపితే పదనుకుంటా) కూడాలేని ఈ కాంటీన్ సెక్రటరీ కలవటానికొచ్చాడు.

విజ్ఞాపన విని, యూనియన్ సెక్రటరీ యిలా వుపదేశించాడు.

''కామ్రేడ్ మీ డిమాండ్ చాలా న్యాయసమ్మతమైనది. నాకూ ఆ డబ్బులు యివ్వాలనేవుంది. కాని నేను మా సభ్యుల బాగోగులు చూడ్డానికి ఎన్నుకోబడ్డాను. వాళ్ల ప్రయోజనాలకు నష్టంచేసే పని ఏదీ చెయ్యను. మొదట కాంటీన్‌లో తినుబండారాల ధరలు నిర్ణయించేటప్పుడే మీ జీతాలు, అవసరాలు అన్నీ లెక్కలోకి తీసుకున్నాం. అసలు మొదట్లోమా మెంబర్లు టీ ధర పది పైసలకే పెట్టమన్నారు. కాని నేనే మీగురించి ఆలోచించి పదమూడు పైసలకు తక్కువ వుండొద్దన్నాను. ఇప్పుడు కాంటీన్ అమ్మకాలు పెరిగాయి. ఖర్చులు, జీతాలు, నడిపే పద్ధతి అంతా ఓ దారిన పడింది—ఇప్పుడిప్పుడే కాంటీన్ కాస్త నిలదొక్కుకుంటోంది. నిజానికిప్పుడు కాంటీన్‌లో ధరలు తగ్గాలి. మరి, మీరేమో పెంచమంటారు, ఎలా వీలుపడుతుంది చెప్పు—

''రెండుపైసలేగద సార్.''

''ఎన్ని పైసలని కాదు. అసలు రేట్లు పెరగకూడదు. తగ్గాలే తప్ప.''

''రెండు పూటలు తిండి.''

''ఎందుకయ్యాబాబూ, నన్ను యిలా యిబ్బంది పెడతావు? ఏమాత్రం వీలువున్నా నేనే చెయ్యనూ. ఆఫ్టరాల్, సాటి కార్మికులం, మిమ్మల్ని మేం దోచుకుంటామా. వీలువడదు. అస్సలు వీలుపడదు. సారీ.''

సర్వశక్తిమంతుడైన ఆ సెక్రటరీబాబే కాదన్న తర్వాత యింక తన మొర ఎవ్వరూ వినరని కాంటీన్ సెక్రటరీకి తెలిసిపోయింది.

తెల్లారి, పనితర్వాత, మిగతా తొమ్మిదిమంది కుర్రాళ్లు కూడా కలిసి కాంటీన్‌ముందరి లైటు స్తంభంకింద సర్వసభ్య సమావేశం జరిపారు.

''ఏంరా, ఏమంటరు? మీరు నెత్తురు గక్కుకుని సచ్చినాసరే, పైస పెరగదట.''

''స్ట్రైకు చేద్దాం. చాయ లేకపోతే వాల్లు పనెట్లచేస్తరు? రోజుకు పదిసార్లు చాయ తాగెటోల్లు—''

''అగ్వ ఒచ్చినయని, బగ్గ టిఫిన్లు తిని బలిశ్రిను.''

"వాళ్లైతె స్ట్రైకులుచేసి బెదిరిస్తరు. వాళ్లెప్పుడు పని చేస్తర్రా, ఎప్పుడు సూసినా కాంటీన్లనే సస్తరు, చాయ కావాలె, కాఫీ కావాలె, దోశ గావాలె, పకోడి కావాలె అంట."

"మరివాళ్లు ఎళ్లగొడ్తె ఎట్లర్రా? ఇంకెవర్నన్న పెట్టుకుంటె మన నోట్లె మన్ను పడ్తదిగద."

"ఏహె. ఎందుకెళ్లగొడ్తర్రోశి. వాళ్లు నౌకర్లు చేస్తలేరా ఏం, వాళ్లను ఎళ్లగొడ్తున్నరా? మంచితనంగ అడిగితె ఎవ్వరియ్యర్రా."

"వాళ్లేమొ పని చెయ్యకుంట తిర్గుతరు. మళ్ల యాడాదికి మూడు నెలల సెలవులు. మందులు ఫ్రీ. ఇంకా అలవెన్సులు, అడ్వాన్సులు—"

"వాళ్లను సూశి ఏడిస్తె ఎట్లర్రో—"

"ఇచ్చే ఈ జీతాలే ఎక్కువైనయని వాళ్లేడుస్తలేదా?"

"ఏమో, నేనైతె స్ట్రైకు చెయ్య. మనం చేస్తే వాళ్లకేమైతది—"

"అరె లంజకొడక, అందరం చేస్తమంటె నువ్వొక్కనివి చెయ్యనంటావు, కాళ్లిరగ్గొడ్తం."

"నాకొక్కడ చెయ్యొద్దనే వున్నది గని, మీకోసం చేస్త."

"ఆఁ, మాకు మెహర్బాని చేస్తున్నావు, బాడకావు—"

కాంటీన్ వర్కర్లు స్ట్రైక్ నోటీసిచ్చారు. డైరెక్టర్లు నవ్వుకున్నారు. నోటీసైతే యిచ్చారు కాని, వర్కర్లు భయపడ్డారు. మళ్లీ బతిమాలేరు. బావూరేరు. కాళ్లు పట్టుకున్నంత పనిచేశారు.

"నోటీసిచ్చి వెనక్కు తగ్గకూడదు కామ్రేడ్. అది రివల్యూషనరీ స్పిరిట్ కాదు. మార్చ్. జీనా హైతో మర్నా సీఖో ఖదం ఖదం పే లడ్నా సీఖో—" అంటూ డైరెక్టర్లు హితవు చెప్పారు.

గడువుతేదీ వచ్చింది. భయంతో, చీలికలతో, అపనమ్మకంతోనైనా సమ్మె జరిగింది. కంప్లీట్ స్ట్రైక్. కాంటీన్ తలుపులు మూతబడ్డాయి. చిన్న గుడ్డముక్కమీద ఎర్రగా యూనియన్ పేరు— ముష్టి పదిమందైనా లేనివాళ్ల యూనియన్‌కు డబ్బు లెక్కన్లేంచి వస్తాయి, బానర్లు, లౌడ్ స్పీకర్లు, బాడ్జీలు, కరపత్రాలు తెచ్చుకోవటానికి.

"మేనేజిమెంట్ డౌన్ డౌన్" అన్నారు.

'న్యాయమైన కోర్కెలు వెంటనే తీర్చా'లన్నారు.

కాని యాజమాన్యాన్ని తిట్టటానికి భయం.

అదే వుద్యోగులైతే బ్రహ్మాండంగా తిట్టగలరు. వాళ్లు నినాదాలిస్తే కంపెనీ ఆవరణ పతిధ్వనిస్తుంది. గోడలు అదిరిపోతాయి. బోర్డు రూంలో కూర్చున్న బడా బూర్జువాలకు చెమట పడుతుంది. సెక్రెటరీ మాటలు, వుపన్యాసం నిప్పురవ్వలు. మెషీన్ గన్ ఫైర్. ఫిరంగి గుళ్లు.

ఉద్యోగులు సమ్మెకారులనుచూసి నవ్వేరు.

సిగ్గు విడిచిన సమ్మెకారులు తిరిగి నవ్వేరు.

ఉద్యోగులు పక్కనేవున్న ఉడిపినీ, ఇరానీనీ పాట్రనైజ్ చేశారు.

"పద. ఇదీ ఘన మంచికే జరిగింది. కాంటీన్ కూడుతిని బోర్ కొట్టింది" అనుకున్నారు.

కాంటీన్ వచ్చిన ఈ యాడాదిలోనూ గిరాకీ తగ్గిన ఆ ఉడిపి, ఇరానీ హోటళ్లవాళ్లు తమ కస్టమర్ల నాకర్షించటానికి అనేక ఎత్తులు వేశారు. సీటింగ్, ఇంటీరియర్ డెకొరేషన్ మార్చారు. టిఫిన్లు రుచిగా చేశారు. ఉద్యోగులు ఖాతా పెట్టొచ్చన్నారు. అప్పటికే ఈ ఆకర్షణలకు సగం మొగ్గుచూపిన వుద్యోగులకు ఇదో మంచి అవకాశంగా దొరికింది.

కాంటీన్ వర్కర్లకు ఆ హోటళ్ల ప్రొప్రయిటర్ల తలలు పగలకొట్టాలనీ, అక్కడి సీట్లు చింపెయ్యాలనీ, యూనిఫాములు వేసుకునే ఆ సర్వర్ల కాళ్లూ చేతులూ విరగ్గొట్టాలనీ అనిపించక పోలేదు. కాని ముష్టి, పదిమంది. అసలు ఈ వుద్యోగులూ, హోటళ్లవాళ్లూ కలిసి తమమీద ఏదన్నా ప్రాక్టికల్ జోక్ వేస్తున్నారా, నాటకమాడుతున్నారా, జాయింటుగా దోచుకుంటున్నారా అని కూడా వాళ్లనుకునే వుంటారు. కాని చేతకాని వెధవలు ఏమనుకుంటేనేం, లోపల ఎంతకోపం దాచుకుంటేనేం—

మొదటిరోజు ప్రశాంతంగా గడిచింది.

డబ్బులు ఖర్చుపెట్టని లోభులుతప్ప, కాంటీన్ మూసివున్నందుకు ఎవరూ బాధపడలేదు. ఉద్యోగులే లంచి టైముకు కాంటీన్ తెరిచారు. కంపెనీ స్వీపర్ వచ్చి వూడ్చివెళ్లాడు. ఇంటినించి తెచ్చుకున్న టిఫిను మాత్రం అక్కడతిని, హోటల్ కాఫీ తాగేరు.

సమ్మెకారులకిది అవమానంగా తోచింది.

రెండో రోజు,

"కాంటీన్ అసలు తెరవద్దుసార్" అన్నారు.

ఉద్యోగులు నవ్వేరు.

"ఇంకేం చేస్తార్రా?" అన్నారు.

అంట్ల వెధవల్ని విధిలించి కొట్టినట్లుగా మాట్లాడేరు. పరిహసించేరు. రోడ్డుమీది జంగ్లీగాళ్లకు నౌకరీ యిస్తే కృతజ్ఞత లేకుండా యిలాగే మాట్లాడతారన్నారు.

తమ యజమానులందరికీ మూలవిరాట్టు యూనియన్ సెక్రటరీ అని కాంటీన్ కుర్రాళ్లకు తెలుసు. అతనితో మరోసారి అర్జీ పెట్టుకోవటానికి వెళ్లారు.

యూనియన్ సెక్రటరీ వాళ్ల మేనేజిమెంటుతో బైపార్టైట్ నెగోషియేషన్స్‌కి కంపెనీ ఖర్చుతో, ప్లేనులో, వాళ్ల ఎం. డి.తో మాట్లాడ్డానికి మద్రాసువెళ్లే సన్నాహంలో వున్నాడు. పక్కన

ఖున్నారు అసిస్టెంట్లున్నారు.

''ఇప్పుడు మాట్లాడ్డానికి వీలుపడదు. తర్వాత రమ్మ''న్నాడు.

''లేదుసార్, స్ట్రైక్ చేస్తున్నాం. ఇప్పుడే మాట్లాడాల'' న్నారు స్ట్రైకర్లు.

సెక్రటరీ నవ్వాపుకోలేకపోయాడు.

''సారీ, మీ సమ్మెను చులకన చెయ్యటం నా వుద్దేశంకాదు. కాని ఎందుకో, మీరు 'స్ట్రైక్' అవేటప్పటికి నవ్వాగలేదు'' అన్నాడు ఎపాలజెటిక్‌గా.

''సార్సార్, ఎంతో కొంతపెంచండి. పది కాకపోతే ఎనిమిది''

వాటెషేవ్. అప్పుడే అట్లా దిగుతారేమిట్రా వాయనా. మరో నాలుగురోజులు చేయండి, చూదాం. మేం ఎన్నెన్ని రోజులు చేశాం, ఎన్ని రిస్కులు తీసుకున్నాం. ఎన్ని త్యాగాలుచేస్తే మాకీమాత్రం దొరుకుతున్నదీనాడు. మీరింకా ఓనమాలు కూడా దిద్దలేదు కార్మిక పోరాటాల్లో. అన్నీ వెండిపళ్లెంలో పెట్టి మరీ యివ్వాలంటారు, ఊఁ—''సెక్రటరీగారు మళ్లీ ఎల్లుండి తిరిగొస్తారు. అప్పుడు ఆలోచిద్దాం—'' అన్నాడో అసిస్టెంటు.

''ఇయ్యాళకూడ తిండి లేదుసార్.''

''అవును మరి, మీరే వండుకొని తినాలిగద, ఎందుకు వండుకోలేదూ? స్ట్రైక్‌చేస్తే మేనేజిమెంటుకేగాదు, మనక్కూడా కష్టాలొస్తాయని తెలుసుకోండి—'' అంటో యూనియనిజం బోధించాడు సెక్రటరీ.

''సార్, మీరింత ఆలోచించేదేముంటది సార్, జెర జాలి పడండి. మాకు మీ అంత అనుభవంలేదు. బలంలేదు. పదిమందిమేమి జేస్తంసార్, కూలోళ్లం. మీ ముందరి పిల్లలం. మీరు దయజూపిస్తే, చాయ, కాఫీ ఒక్కపైస పెంచితే ఏమైతది సార్, డివిడెండ్ కొంచెం తగ్గుతది. మాకో పదిర్పూపాయలు పెరుగుతది.''

''అబ్బబ్బ. ఈబోడి ప్రాబ్లమ్స్ నా దగ్గరకెందుకు తెస్తారు?'' అంటో సెక్రటరీ తన అసిస్టెంట్లవైపు చూశాడు.

''నేను మన టాక్స్ గురించే ఆలోచించనా, ఈ పది రూపాయల గురించీ, పైసలగురించీ ఆలోచించనా?'' అన్నాడు చిరునవ్వూ, చిరాకూ జోడించి.

''ఏయ్, బాబూ, చాల్చాలు. ఏదో సీతో క్రామేడ్‌లీగావుంటే మరీ అలుసు తీసుకుంటున్నావు. సెక్రటరీగారు బిజీగా వున్నారు. అయినా, ఆయనేం చేస్తాడు, మీ డైరెక్టర్ల నడుగు పో!''

''సార్సార్, అందరికీ పెద్దమీరు. ఆ డైరెక్టర్లు మిమ్మల్నడగమంటరు. మీరు చెప్తే అందరు వింటరు.''

''నో. నో. ప్రతీదానికీ ఓ పద్ధతుంటుంది. వాళ్ల ఫీల్డులోకి నేను వెళ్లను. వాళ్ల నిర్ణయం ఏదైనా నేను గౌరవిస్తాను. వాళ్లకు నేను కూడా ఓటువేశాను. డెమోక్రసీలో ప్రజాప్రతినిధులు ప్రజలకు జవాబుదారీ. వాళ్లు మాకు జవాబు దారీ.

''వాళ్లు వినరు సార్.''

''అంటే రేట్లు పెంచటం మెంబర్ల కిష్టంలేదన్నమాట. అంతే. మీరంటే ఎంత సానుభూతివున్నా, మీ డిమాండ్ ఎంత న్యాయసమ్మతమైనా, మా కాంటీన్ షేర్ హోల్డర్ల ప్రయోజనానికీ, యిష్టానికీ వ్యతిరేకంగా ఏమీ చెయ్యలేం.

ఇది కోఆపరేటివ్ కాంటీన్. ఉద్యోగులే దీని షేర్ హోల్డర్లు. వాళ్లకు డివిడెండ్ కావాలి. టిఫిన్లు చవగ్గా కావాలి. అందుకోసమే మేం అన్నాళ్లు పోట్లాడాం. మరి ఆ త్యాగాల ఫలితాన్ని ఈనాడు వృథాచేస్తే 'ఇందుకోసమా స్ట్రైక్ చేసింది ?' అంటారు మెంబర్లు. అందువల్ల ఇది వీలుపడదని మరోసారి చెబుతున్నాను. పైగా యిలాంటి విషయాల్లో నిర్ణయాలు తీసుకోవాలంటే, కాంటీన్ షేర్ హోల్డర్ల మీటింగ్ జరగాలి. అక్కడీ విషయం చర్చకు రావాలి. మెజారిటీ అందుకొప్పుకోవాలి. అప్పుడుగాని ఏమన్నా జరగదు—'' అన్నాడు సెక్రటరీ విషయాలు విశదంచేస్తూ.

కాంటీన్ సెక్రటరీక్కోవ మొచ్చింది. వాడు మాట్లాడలేదు.

''మేం పదిమంది అసహాయులమనేగా మీరిలా మాట్లాడుతున్నది''—అనుకున్నాడు—కాని అది కనిపిస్తూనేవుంది. మాటల్తో మారతారా మనుషులు? దీనాలాపాలకు, ప్రార్థనలకు, మంచిమాటలకు

ఏ మెనేజిమెంట్లూ లొంగవు. కార్మికులను సంతోషపెట్టటం ఏ మేనేజిమెంటు ధ్యేయమూ కాదు.

యూనియన్ సెక్రటరీగారు మద్రాసు కెగిరిపోయారు.

కాంటీన్ కుర్రాళ్ల సమ్మె కొనసాగింది—

ఆ రోజు కాంటీన్ తలుపులు తియ్యకుండా అడ్డంపడుకున్నారు.

ఉద్యోగులు నవ్వేరు.

''లేవండ్రా వెధవల్లారా'', అన్నారు.

కుర్రాళ్లు లేవలేదు. అంతేగాక, 'లేవంసార్' అనికూడా అన్నారు.

వాళ్ల చింకిగుడ్డ జెండాతీసి పక్కన పారేశాడు డైరెక్టర్.

''దాదాగిరీ బంద్ కరో!'' అన్నాడో కుర్రాడు. అది వాడు వీళ్లనోటే విన్నాడు.

ఉద్యోగులకొక్కోపమొచ్చింది.

''జులాయి వెధవా, మమ్మల్నిరా అలాంటి మాటలనేది!'' అంటో, ఆ కుర్రాడి జుట్టు పట్టుకొని పక్కకీడ్చేశాడో ఉద్యోగి.

మంచి జీతాలతో, మంచి భోజనంతో, కాంటీన్‌లో తక్కువ దరకు, ఎక్కువ టిఫిన్లు తిని ఆరోగ్యం పెంచుకొన్న వుద్యోగులు ఆ కుర్రాళ్లను పక్కకునెట్టడం --అందునా ముష్టి పదిమంది అర్ధాకలి అస్థిపంజరాలను, ఇంకా వోటు హక్కుకూడా రాని కుర్రాళ్లను తోసెయ్యటం యిక్కడ రాయవలిసినంత ముఖ్యవిషయంకాదు. ఓ మరీ చిన్న కుర్రాడేడ్చేశాడు. మిగతావాళ్లు కన్నీళ్లాపుకున్నారు. మొహాలు జేవురించాయి. సిగ్గుమాలిన వెధవలు.

మళ్లీ, ''దాదాగిరీ బంద్‌కరో!'' అన్నారు, తన్నులు తింటున్నారనే స్పృహైనా లేకుండా.

అవమానాన్ని సహించని వుద్యోగులు వాళ్లను కంపెనీ ఆవరణ బైట పారేశారు.

''వెధవల్లాలా, మిమ్మల్ని తిండికి మాడ్చి చంపాలి. మీకు జీతాలెక్కువై వొళ్లు బలిశాయి. దొంగతిండ్లతో కొవ్వెక్కారు. మళ్లా ఈ గేటు లోపల కాలుపెడితే జాగ్రత్త. ఈసారికి క్షమించాం. మళ్లీ పేలారో నాలిక చీరేస్తాం. తోళ్లు ఒలిచేస్తాం. జుట్లు పీకేస్తాం. సున్నంలోకి ఎముకలు మిగలకుండా తంతాం. కాళ్లూ చేతులూ విరిచేస్తాం. ఇంట్లో చెప్పొచ్చినార్రా లంజకొడుకుల్లారా, రేప్పొద్దున్న మీకన్నా పదిరూపాయలు తక్కువకే అదే మహాప్రసాదమన్నట్టుగా పచ్చే కుర్రాళ్లు లక్షలమంది వున్నారు. వెళ్లండి. మళ్లీ యిటు చాయలకి రాకండి. హ్హాహ్హాహ్హా'' అన్నారు కోపం వచ్చిన వుద్యోగులు.

తుంటరి వెధవలు కాలికి బుద్ధిచెప్పారు. తన్నులు బాగా తగిలిన వాళ్లు కుంటుతూ పరిగెత్తారు. ఒకడు వూడిపోయిన పంటిని తీసుకొని జేబులో వేసుకున్నాడు. ఒకడికి ముక్కులో నెత్తురొస్తే మరొకడి చెయ్యి రాత్రికి అన్నం కలుపుకోనియ్యలేదు. ఆ సెల్ఫ్ స్టైల్డ్ సెక్రటరీగాడికి తలవగిలినంత పనైంది. గూబమీద తగిలిందేమో, రాత్రంతా చెవిపోటు కూడా వచ్చింది.

''ఇలా వొదిలెయ్యకూడదు వెధవల్ని. మనకు నేర్పిస్తారా పోరాటంలో పాఠాలు!'' అనుకున్నారు వుద్యోగులు.

బొంబాయినుండి తిరిగివచ్చిన యూనియన్ సెక్రటరీకి విషయం తెలిసింది.

''కొట్టారా వాళ్లను?'' అన్నాడు.

''వాళ్లను మనం కొట్టాలటండీ, పిచ్చుకమీద బ్రహ్మాస్త్రమెందుకు! ఊరికే చెయ్యి చూపిస్తేనే పారిపొయ్యారు పిరికిపందలు— కాని ఇదే మంచిపనిలెండి—మనమీద మరీ అలుసు తీసుకున్నారు వెధవలు. ఈమాత్రం భయంలో పెట్టాలి వీళ్లను. ఎందుకూ, మీ బాయ్‌స్ మంచి డెసిషన్ తీసుకున్నారు. నిన్ననే వాళ్లందరికీ జీతాలిచ్చి పంపేశారు. అప్పుడే కొత్త కుర్రాళ్ల అప్పాయింట్‌మెంట్స్‌కూడా జరిగిపోయాయి. చాకుల్లాంటివాళ్లు. ఈ సంవత్సరం మనకు డివిడెండ్ మరో ఐదుశాతం పెరిగింది.''

ధరలు పెరగనందుకూ, డివిడెండు పెరిగినందుకూ, షేర్ హోల్డర్లు సంతోషించారు. కాని కార్మికోద్యమాల చరిత్రా, గతితార్కిక భౌతికవాదమూ తెలిసిన ఆ సెక్రటరీ కూడా సంతోషించాడని నేను చెప్పలేను. సాంఘిక న్యాయం జరిగిందో లేదో కూడా అతడికి తెలియకపోలేదు.

కాని ఆచరించలేని మంచి అభిప్రాయాలవల్ల ఎవరికిమాత్రమేం ప్రయోజనం కలుగుతుంది?

బడా పెట్టుబడిదార్లను గజగజలాడించే ఆ మిలిటెంటు వుద్యోగులముందు కాంటీన్ కుర్రాళ్లు చిత్తుగా ఓడిపోయారు.

''హంసే జో టక్ రాయేగా
మిట్టీమే మిల్ జాయేగా''

ప్రస్తుతానికది వుద్యోగుల నినాదం.

# మేల్కొన్న చైతన్యం

శ్రీ శశికాంత్ శాతకర్ణి

మాంసం కొట్లో కట్టిన
      ఖండిత జంతువుల విడి విడి అంగాల్లా
రక్తం ముద్దలా
సాయం సంధ్య నా బాహువులమీంచి
కిందికి జారింది !
ఒక్క నక్షత్రమయినా
ఆకాశంమీదకు వచ్చి మిసుకు మినుకు మంటుందని
ఎదురు చూసిన నాకు నిరాశే ఎదురయింది !
నిశాకన్య తన చీర కుచ్చిళ్ళను
ఎత్తి పట్టుకుని అలవోకగా నడచివెళ్ళింది
ఎప్పుడో అర్ధరాత్రి ఆకాశం
నక్షత్రాలతో గర్భవతి అయింది
రాత్రంతా వెలిగేందుకు విశ్వప్రయత్నం చేసిన
చంద్రుడు ఉదయమయ్యేసరికి
సూర్యుడు చిమ్మే నీరెండలో
మబ్బుతునకగా మారేడు
చీకటిమాత్రం ఎత్తైన గోదాముల్లోనూ
ఇరుకు హృదయాల్లోనూ విశ్రమించింది
రాత్రంతా కొండపై మునికాళ్ళమీద నిలబడి
నిద్రలో సొమ్మసిల్లిన ధాత్రిని
రిక్కరిక్క చూసిన నక్షత్రాలు
ఆకాశంలోకి చొచ్చుకొని పోయాయి !
చీకటిలో దొంగలా రహస్యంగా కదిలిన భయం
సూర్యోదయంతో రోడ్లమీద చచ్చిపడింది
ఆ దృశ్యం చూసిన మల్లెపూలు
పెద్దపెట్టున నవ్వుతున్నాయి !
గుసగుసలు చేసుకుంటూ
గాలి పిచ్చి పాటలు పాడుతోంది
తెల్లవారుఝామున వీచే చల్లగాలిలో తేలి
కోకిల తనగొంతు సవరించుకొంటోంది !
ముడుచుకుపోయి పడుకున్న వీధుల్లో
అది నూతనోత్తేజాన్ని నింపుతోంది
జాజిపొద మొగ్గలతో పువ్వులతో పొంగుతోంది !
వీధులు నెమ్మదిగా ఒళ్ళువిరుచుకుంటున్నాయి
నా కలల బండశిలలను
సుందర ప్రపంచాకృతిగా మలచాలనే
మధురోహలతో
ఆనందంగా ఆహ్లాదంగా
రేపటి సమష్టి కృషి ఫలితంగా
మహత్తర విజయం సాధించేందుకు
సకల జనావళిని సమాయత్తం చేసే
ఉత్తాలం ఎత్తు చైతన్యంగా నేడే
మేల్కొంటాను నేను !



శ్రీ బి. జనార్దనరావు    శ్రీ జి. సుదర్శన్

# సామాజిక శాస్త్ర పరిశోధన - పరిశీలన

మానవ సమాజ పరిణామంలో విజ్ఞానం కీలకమైన పాత్ర వహిస్తున్నది. ప్రపంచానికి సంబంధించిన మానవ విజ్ఞానాన్ని, ఉత్పత్తి అనుభవాన్ని, సామాజిక జీవిత విధానాన్ని, సాంస్కృతిక విజయాల్ని, భౌతిక విలువల్ని పోగుచేసి నిలువ ఉంచుకోగలగడమే మానవ నాగరికత పురోగమన కీలకాంశము. సమాజం మారే ప్రక్రియలోనూ, పురోగమించే దశలోనూ విజ్ఞానం యొక్క పాత్ర తప్పనిసరి. ఒక శాస్త్రం యొక్క ఆలోచన లక్ష్యం కానీ, కర్తవ్యంకానీ ఆయా సమాజంలో ఉన్నటువంటి వాస్తవికతలను తెలియపరుస్తూ, నిజాల్ని ప్రస్ఫుటం చేయడమే కాక, సమకాలీన సమాజాన్ని విశ్లేషిస్తూ గతం నుంచి వర్తమానానికి వడబోసిన విజ్ఞానాన్ని గ్రహించి భవిష్య సమాజానికి శాస్త్రీయమైన పరిష్కార మార్గాల్ని సూచించడమే. ఈ బాధ్యతను సామాజిక శాస్త్రాలు నిర్వహించవలసి ఉంటుంది. సమాజంతో నిరంతరం ఎదురవుతున్న సమస్యల ఆమూలాగ్రాన్ని తెల్పే పరిశోధన సామాజిక శాస్త్రాల ఉనికికి ఊపిరి లాటిది.

ముఖ్యముగా ఈ సామాజిక శాస్త్రాలు కానీ, వాటి పరిశోధన కానీ వర్ధమాన దేశాలలో ఎంతో ప్రాధాన్యతను కల్గి ఉంది. ఈ అవసరాన్ని గ్రహించినందువల్లనే ఈనాడు అనేక దేశాలు పెద్ద మొత్తంలో వనరులను సామాజికశాస్త్ర పరిశోధనకై వెచ్చించడం జరుగుతున్నది. భారతదేశములో కూడా సామాజిక శాస్త్ర పరిశోధనపై గణనీయమైన ఆసక్తిని కనపరచడం గమనించదగింది.

అభివృద్ధి చెందిన, చెందుతున్న దేశాలలో సామాజిక శాస్త్రాల పరిశోధన ప్రాముఖ్యం వహిస్తున్న దృష్ట్యా "సామాజిక శాస్త్ర పరిశోధన"ను గురించి తెలుసుకోవలసిన అవసరం ఏర్పడింది. సామాజిక శాస్త్ర పరిశోధనను "చారిత్రిక దృక్పథం నుంచి" వేరు చెయ్యవలసిన అవసరం ఉంది. చారిత్రిక క్రమం నుంచి — నేటి వరకు సాగుతూ వచ్చిన సామాజిక శాస్త్ర పరిశోధనను పరిశీలించడమే కాక, భారతదేశములో జరుగుతున్న సామాజిక శాస్త్ర పరిశోధన స్వరూపాన్ని వివరంగా చర్చించడమే ఈ వ్యాసములోని ముఖ్య ఉద్దేశ్యము. ఇదే సందర్భములో, సామాజిక శాస్త్ర పరిశోధన నుండి ఉద్భవించిన విజ్ఞానాన్ని సామాజిక ప్రగతిలో భాగస్వామిగా రూపొందించుకొనేందుకు ఏమి చెయ్యాలన్న అంశాన్ని స్పష్టపరచడము కూడా ఈ వ్యాసములో ముఖ్యాంశము.

సామాజిక శాస్త్ర పరిశోధనను గూర్చి పరిశీలిస్తున్నప్పుడు, సామాజిక శాస్త్రముతోపాటు "శాస్త్రము" అంటే ఏమిటన్న విషయాన్ని తెల్పుకోవడం అవసరము. భౌతిక పదార్థిక జీవనాధారాలను, ప్రకృతి నియమాలను, మానవ విజ్ఞానాన్ని, కార్య కలాపాలను విపులీకరించేదే శాస్త్రం అని క్లుప్తంగా తెల్పవచ్చు. శాస్త్రం అనే పదంలో "క్రియాశీలత" ఇమిడి ఉంటుంది. శాస్త్రం ఆచరణకు అనువుగా లేదంటే, క్రియాశీలతను ప్రోత్సహించడం లేదంటే అది పాక్షికమయినదయినా ఉండాలి. లేదా సామాజిక భౌతిక వాస్తవికతలకు దూరంగానైనా ఉండి ఉండాలి. పై రెండింటిలో ఏదైనా కారణం అయి ఉండవచ్చు. భౌతిక వాస్తవికతలను తెల్పని శాస్త్రం—శాస్త్రంగా పరిగణించబడదు. ఎందుకంటే శాస్త్రం అన్న పదంలోనే "శాస్త్రీయత" ఇమిడి ఉంది. శాస్త్రానికి శాస్త్రీయ ఆలోచన మూలంగా ఉంటుంది. శాస్త్రీయ విశ్లేషణ పునాదిగా ఏర్పడుతుంది. శాస్త్రీయ ఆలోచనను గూర్చి చెపుతూ మార్క్స్ ఈ విధంగా అంటాడు.[1]

"శాస్త్రీయ ఆలోచన అన్ని రకాల చైతన్యం వలె ఊహాత్మక సారూప్యంతో (ఇమాజినేడ్ కాంక్రీట్) పని చేస్తుంది. అంటే, ముడి సరుకులాంటి యథార్థ స్ఫురణతో సిద్ధాంతీకరణ ఆలోచనలోని యథార్థాన్ని పునర్నిర్మించడానికి నిరంతరంచేసే యత్నము. ఇందులో అనేక నిర్ణయ కారకాల సంపన్న సమగ్ర రూపం ఇమిడి ఉంటుంది." మరోక విధంగా చెప్పాలంటే, ఏది శాస్త్రం — ఏది శాస్త్రం కాదు అన్న విషయాన్ని ఈ క్రింది అభిప్రాయం ద్వారా వివరించవచ్చు. "చారిత్రిక భౌతికవాద అవగాహన పాతకాలపు చరిత్రని శాస్త్రీయంగా అర్థం చేసుకోవడానికి మాత్రమే కాదు. ప్రస్తుత చరిత్రను మార్చటానికి, ప్రస్తుతానికి అన్వయించడం కూడా. మార్పుకు ఆయుధం కానిది శాస్త్రం కాదు."[2] అందువల్ల శాస్త్రం మార్పును తెల్పేదిగా, మార్పుకు అనుగుణ్యంగా మార్గదర్శకంగా ఉండాలి. శాస్త్రం విజ్ఞానానికి, శాస్త్రీయతకు ప్రతీకగా గుర్తించినట్లే, ఈనాడు ఉన్నటువంటి యావత్ మానవ విజ్ఞానాన్ని విశాలతరంలో రెండుగా విభజించవచ్చును. అవి: ప్రకృతి శాస్త్రాలు మరియు సామాజికశాస్త్రాలు.

సౌర మండలాది విశ్వక్రమాన్ని, భూమి క్రమాన్ని, ప్రకృతి నియమాలను, జీవరాసుల ఉనికిని గురించి ప్రకృతి భౌతిక శాస్త్రాలు విశ్లేషిస్తే, మానవ పరిణామాన్ని, సామాజిక సమస్యలను, అంతర్ సంబంధాలను, సామాజిక పురోగమన క్రమాన్ని, ప్రాపంచిక దృక్పథంతో (ఐడియాలజికల్ ఓరియంటేషన్) పరిష్కార మార్గాలకై సామాజిక శాస్త్రాలు అన్వేషిస్తాయి. ఆ అన్వేషణా క్రమంలోనే విశ్లేషణ — విమర్శ — సూచన కూడా యిమిడి ఉంటాయి. అంటే "సమాజం అనే భౌతిక ప్రపంచ పునాది నుండి పుట్టే విజ్ఞానాన్ని శాస్త్ర రూపంలో ఇముడ్చుకుంటు, సమాజాన్ని కేంద్రంగా తీసుకొని దానిలో ఉన్న వివిధ విషయాలను చర్చిస్తూ, అందులో ప్రాధాన్యం

వహించే ఉత్పత్తి సంబంధాల స్వరూపాన్ని సామాజిక శాస్త్రాలు వివిధ దృక్కోణాల నుంచి విశ్లేషిస్తాయి." రచయిత జె.డి. బెర్నాల్ సామాజిక శాస్త్రాలను గురించి వివరిస్తూ, సామాజిక శాస్త్రాలను రెండుగా విభజించారు.[3] అవి (1) వివరణాత్మక సామాజిక శాస్త్రాలు, (డిస్క్రిప్టివ్ సోషల్ సైన్సెస్), (2) విశ్లేషణాత్మక సామాజిక శాస్త్రాలు (ఎనలిటికల్ సోషల్ సైన్సెస్). వివరణాత్మక సామాజిక శాస్త్రాలలో, సమాజంలోని గతాన్ని, అభివృద్ధి క్రమాన్ని, వర్ధమాన సామాజిక నిర్మాణాన్ని, అంతర్ సంబంధాలను తెల్పే సామాజికశాస్త్రం, మానవ సమాజ శాస్త్రం, పురావస్తు శాస్త్రం, చరిత్ర మున్నగు వాటిని చేర్చవచ్చు. అట్లాగే, వివరణాత్మకంగానే కాక, విశ్లేషణతో, విమర్శతో చూసే అర్థశాస్త్రం, న్యాయ, రాజనీతి తత్వశాస్త్రాలను విశ్లేషణాత్మక శాస్త్రాల పరిధిలో చేర్చవచ్చు. ఈ శాస్త్రాలలో ప్రధానంగా ఉత్పత్తి సంబంధాలు, మార్కెట్ విధానం, పంపిణీ స్వరూపం, పౌర న్యాయ సూత్రాలు, దేశ రాజకీయ సిద్ధాంతముతోపాటుగా రాజకీయ, పాలనా వ్యవస్థ స్వరూపాదులను గురించి వివరించడం జరుగుతుంది.

సామాజిక శాస్త్రాలు క్లుప్తంగా విభజింపబడుతున్నప్పటికినీ, వర్ధమాన ప్రపంచ పరిజ్ఞాన పెరుగుదలలో ఇవి గణనీయమైన పాత్ర వహిస్తున్నాయి. శాఖోప శాఖలుగా విడిపోయి, ఒక్కొక్క శాస్త్రం ఒక్కొక్క ప్రత్యేకమైన శాస్త్ర పరిధిని పొందడానికి, ఉనికిని సంపాదించడానికి ప్రయత్నాలు చేస్తున్నాయి. ఈ విధమైన ప్రత్యేక పరిధిని కానీ, పరిజ్ఞానాన్ని కానీ పొందాలంటే సామాజిక శాస్త్రాలకు పరిశోధన ఊపిరి లాంటిది. అందువల్ల ఈ సందర్భములో సామాజిక శాస్త్రాల పరిశోధనా పరిధిని, ప్రాముఖ్యతను పరిశీలించడం అవసరం.

## సామాజిక శాస్త్రాల పరిశోధనా పరిధి ప్రాముఖ్యము

ముందే వివరించినట్లుగా, సామాజికాంశము అనేది స్వతంత్రిత — ఆధారిత కారకాల మధ్య ఎల్లప్పుడూ కొనసాగే సహ సంబంధాన్ని తెల్పుతుంది. సమాజంలోని ఏదేని అంశము గూర్చి ఆయా అంశము యొక్క స్వతంత్రిత — ఆధారిత కారకాల మధ్య నున్న సహసంబంధాన్ని అవగాహనతో విశ్లేషించేదే సామాజికశాస్త్ర పరిశోధన. "సమాజ శాస్త్రాల విజ్ఞాన సర్వస్వము"లో సమాజ శాస్త్ర పరిశోధనను ఈ క్రింది విధంగా నిర్వచించింది.[4]

"ది మానిఫెస్టేషన్ ఆఫ్ థింగ్స్, కాన్సెప్ట్స్ ఆర్ సింబల్స్ ఫార్ ది పర్పస్ ఆఫ్ జెనెరేటింగ్ టు ఎక్స్‌టర్నల్, కరెక్ట్ ఆర్ వెరిఫయి నాలెడ్జ్, వెదర్ దట్ నాలెడ్జ్ ఎయిడ్స్ ఇన్ ది కన్‌స్ట్రక్షన్ ఆఫ్ థియరీ ఆర్ ఇన్ ది ప్రాక్టీస్ ఆఫ్ యాన్ ఆర్ట్."

అట్లాగే సామాజిక శాస్త్రాల పరిశోధనా, స్వాభావికంగా రకరకాలయిన పరిసర సంబంధ, స్వభావ సంబంధ, మానసిక, సమాజ, సాంస్కృతిక, రాజకీయ, ఆర్థిక సంబంధమైన ప్రభావాలకు లోనవుతుంది. సమాజం — మానవుని ప్రవర్తనకు గల సహసంబంధ విశ్లేషణలో ఎదురయ్యే అనేక సంక్లిష్ట అంశాలకు అర్థాన్ని వివరించడములో సామాజిక శాస్త్ర పరిశోధన ప్రధానపాత్ర వహిస్తుంది. అందువల్ల సామాజిక శాస్త్ర పరిశోధన పరిధి యావత్తు సమాజమే. యావత్ సమాజ అంతర్భాగాల విశ్లేషణను కొనసాగించడంవల్ల వాస్తవాలను వెలికి దీయడం జరుగుతుంది. సామాజిక శాస్త్ర పరిశోధన ప్రధాన లక్ష్యము సమాజంలో ఉన్నటువంటి పరిస్థితిని వివరించడం ద్వారా నూతన భావాలకు పాదు వేస్తుంది. సంప్రదాయక పరిజ్ఞానంలో ఉన్న లోటుపాటులను గమనిస్తూ, అసంబద్ధతలను విమర్శిస్తూ సహేతుకమైన విజ్ఞానాన్ని అందించడం ద్వారా విజ్ఞాన పరిధులను విస్తరింపచేయడం సామాజిక శాస్త్ర పరిశోధన ముఖ్య లక్ష్యము.

పరిశోధన ద్వారా బయల్పడే నిజాలను అవగాహన చేసుకునే క్రమంలో ఉత్పన్నమయ్యే ఆలోచన ద్వారా, ఆ ఆలోచన నుండి వచ్చే ఆచరణ ద్వారా సరిక్రొత్త సాంఘిక క్రమాన్ని (న్యూ సోషల్ ఆర్డర్) ఆహ్వానించడము సామాజికశాస్త్ర పరిశోధనలో విడదీయరాని భాగము.

కేవలం సంప్రదాయంలోనే కాక, సంప్రదాయ ప్రభావ ఫలితంగా వర్తమానంలో మిగిలిపోయిన భావఅవశేషాలను, సిద్ధాంతాలను, (ఐడియాస్, థియరీస్) విధానాలను, కార్యక్రమాలను, నాటి "వర్తింపు" (అప్లికేషన్)లో ఉన్నటువంటి ఔచిత్యాన్ని పరిశీలిస్తూ అవసరమైన మార్పులను సూచించే బాధ్యత సామాజిక శాస్త్ర పరిశోధనా పరిధిని, ప్రాముఖ్యతను నొక్కిచెప్తుంది. పరిశోధనలో తప్పనిసరిగా అంతర్భాగమయ్యే పరిశోధకుని విలువలను, సామాజిక ఆర్థిక పూర్వాపర ప్రభావాలను వారి వారి భిన్నభిన్న దృక్పథాలను శాస్త్రీయమైన పద్ధతిలో విశ్లేషించడం సామాజిక శాస్త్ర పరిశోధనలో కీలకాంశము. ప్రకృతి శాస్త్ర పరిశోధన ఉధృత స్థాయిలో అభివృద్ధి అవుతున్నప్పటికినీ, ఆ పరిశోధన ఫలితాలు "ప్రయోగశాల వరకే పరిమితమైన పరిజ్ఞానాన్ని" అందచేస్తే, సామాన్య ప్రజల ఆసక్తులనుండి, దూరంగాపోయి సామాజిక అవసరాలను తీర్చడంలో ప్రత్యక్ష దోహదకారిగా లేదు. అందువల్ల, సమాజంలోని ప్రజల మనోభావాలను, ఆసక్తులను విశ్లేషించే సామాజిక శాస్త్ర పరిశోధన అత్యవసర ప్రాధాన్యతను పొందుతుంది.

నూతన విజ్ఞాన సముపార్జనలో "పరిశోధన మాతృ గర్భం నుండి ఉద్భవిస్తున్న శిశువు." శిశువు ఏ విధంగా పెరగడం ప్రారంభిస్తుందో అదే విధంగా పరిశోధన కూడా వృద్ధి చెందుతూ విజ్ఞానం మరింతగా స్వయం సమృద్ధి కావడానికి దోహదకారి అవుతుంది. విజ్ఞానం, విజ్ఞానాన్వేషణలోని భాగమైన పరిశోధన సమాజంలోని అత్యధిక ప్రజల అనుభవాన్ని ప్రతిబింబించేదిగా ఉన్నప్పుడు విజ్ఞానం తన సహేతుకతను చాటుకొంటుంది. దానికి అవసరమయ్యే సామాజిక శాస్త్ర పరిశోధన అవసరాన్ని కూడా వేరే చెప్పనక్కర్లేదు.

సామాజిక గతిని నిర్ణయించే "సమాజ ప్రణాళిక విధానం" (సొసైటల్ ప్లానింగ్) లో సమాజాన్ని నియంత్రించే కారకాల (ఫ్యాక్టర్స్) కదలికల గమనాన్ని పరిశీలిస్తూ నిర్దేశనను ఏర్పరిచే క్రమంలోనూ, సమాజ సత్యాలను వెలికి తీసి బాహ్య ప్రపంచానికి

తెలియపరిచె అవసరం వల్లనూ సామాజిక శాస్త్రపరిశోధన ప్రాముఖ్యత వహిస్తుంది. మానవ విజ్ఞానం మరింత వికాసం చెందాలన్న, విశాలమైన మానవప్రపంచ సంక్లిష్టతలను, వైరుధ్యాలను అర్థంచేసుకోవాలన్న, భవిష్యసమాజానికి దారిచూపించాలన్న సమాజ శాస్త్ర పరిశోధన తప్పనిసరిగా ప్రాధాన్యత వహిస్తుంది. ఇటువంటి సామాజిక శాస్త్ర పరిశోధన ఈనాడు తన ఉనికిచే సమస్యలకు పరిష్కార మార్గాల్ని యిచ్చేస్థితిలో లేదా సూచించే స్థితిలో లేదన్న తీవ్ర విమర్శకు గురిఅవుతున్నది. (తక్షణసమస్యలకు పరిష్కారాన్ని సూచించే స్థితిని రెలవెన్స్ అనడం జరుగుతుంది.)[5] అట్లాగే, ఈనాడు ఉన్న సమాజ శాస్త్ర పరిశోధనలో ఉన్న పద్ధతులు అంతగా ఉపకరించడం లేదనే వాస్తవం ఒక వైపు వేధిస్తున్నప్పుడు -- సహజంగానే సమాజ శాస్త్ర పరిశోధనను -- పరిశోధనా పద్ధతులను మరింతగా పదునెక్కించవలసిన లేదా తీవ్రతరం చేయాల్సిన అవసరం ఎంతైనా ఉంది. ఎందుకంటే ఈనాడు శాస్త్ర పరిశోధనలో ముఖ్యంగా ప్రశ్నావళి రూపంలోనో, పరిశీలనాత్మక పద్ధతి ద్వారానో, మౌఖికపరమైన ఇంటర్వ్యూల ద్వారానో, పరిమితమైన పద్ధతులనే ఉపయోగించడం జరుగుతున్నది. వాటివల్ల వాస్తవాలు బయలుపడుతున్నప్పటికినీ, పూర్తిగా ఒకఅంశముపైన కావలసినంతగా సమాచార సేకరణలో పరిశోధకుడు ఇబ్బందులు ఎదుర్కొనవలసి వస్తున్నది. పరిశోధనలో ఉన్న సాధక బాధకాలను తట్టుకొని, పరిశోధకుడు ఆయా సంబంధిత అంశాలపై క్షేత్ర పరిధిలో కూలంకషంగా జరిగే పరిశీలన కూడా సంతృప్తికరంగా ఉండటం లేదు. పైగా, ఒక సమస్యను ఎంపిక చేసుకోవడములో తక్షణ సమస్యలు — దూర సమస్యలు లేదా అంశాలు ఉంటాయి. మౌలికంగా సమాజ ప్రయోజనానికి ఉపయోగపడే అంశాలు తక్షణమైనవిగా, పాక్షిక ప్రయోజనాలను ఒసగూర్చేవి దూర అంశాలుగా చెప్పవచ్చు. కానీ నేడు జరుగుతున్నదేమిటంటే, దూర అంశాలకు ప్రాధాన్యత హెచ్చయిపోయి, తక్షణ సమస్యలపై కేంద్రీకరించడం లేదనే చెప్పవలసి ఉంటుంది. తత్ఫలితంగా సామాజిక శాస్త్ర పరిశోధన సమాజంలోని సమస్యలకు పరిష్కార మార్గాలను సూచించడములో తన వంతు పాత్రను నిర్వహించలేకపోతున్నది. సామాజిక తత్త్వమునుండి సామాజిక శాస్త్రాలు వేరేగాచేసి చూసినందువల్లనూ, సామాజిక శాస్త్రాలు ఒకశాస్త్రంగ రూపొందడములో జరిగిన ఆలస్యంవల్లనూ, శాస్త్రీయ సాంకేతిక విజ్ఞానము — ప్రకృతి శాస్త్రాలు ఒక వైపూ కావలసినంత రీతిలో అభివృద్ధి చెందుతున్నప్పుడు, సామాజిక శాస్త్ర పరిశోధన పురోగమన స్థాయి తక్కువగానే కనిపిస్తుంది.[6]

అందువల్ల సామాజిక పరిశోధన పురోగమన స్థాయి తక్కువగా ఉండటానికి, వెనుకబడి ఉండడానికి గలకారణాలు పరిశీలించవలసిఉంటుంది. ఒక అంశము తగినఫలితాన్ని ఇవ్వలేదంటే దాని వెనుకటి పూర్వ ప్రభావాన్ని వివరించడము అవసరము. ఈ విధంగా చారిత్రిక నేపథ్యంనుంచి వెనుక సామాజిక శాస్త్రాల పరిణామక్రమాన్ని పరిశీలించినట్లయితే చారిత్రిక ప్రభావం సామాజిక శాస్త్రపరిశోధన పురోగతిలో ఎటువంటి పాత్రనుకల్గి ఉంటూ వచ్చింది, చారిత్రిక పరిణామ ప్రభావమే కాక యితర కారణాలు కూడా ఏ విధంగా పాత్ర వహిస్తూ వచ్చినాయన్న విశ్లేషణ ఈ సందర్భములో అవసరము.

# సమాజ శాస్త్రాల పరిశోధనపై సమాజ శాస్త్రాల చారిత్రిక పరిణామ ప్రభావం క్లుప్తీకరణ - వెనుకబడటానికి గల కారణాలు

(రీసన్స్ ఫర్ బ్యాక్‌వర్డ్‌నెస్ ఆఫ్ సోషల్ సైన్స్ రిసెర్చ్)

సామాజిక శాస్త్రాల ఉద్భవానికి సామాజిక ఆలోచనయే మూలంగా ఉంటుంది. మానవ నాగరికత ప్రారంభమైన నాటినుండి, నాగరికత—సామాజిక ఆలోచనా ఆయా కాలమాన పరిస్థితుల ప్రభావం పొందుతూ వచ్చినాయన్నది చారిత్రిక సత్యము. ఈజిప్టు, భారతదేశము, చైనా, ప్రాచీన గ్రీకు దేశాలు నాగరికత నిలయాలుగా వాసికెక్కినాయి. ఆ నాగరికత పరిణామం వెనుక ఆనాటి అభివృద్ధి దశ క్రమంలో ఆయా సమాజాలలో ఒక సామాజిక ఆలోచన, ఒక నిర్దుష్టమైన జీవన విధానము వుండేది. ఈ నిర్దుష్ట జీవన విధానమే, సామాజిక ఆలోచనయే సామాజిక శాస్త్రాలకు పాదుగా, పునాదిగా పనిచేసినాయి. అందువల్ల ఆనాటి నుండి నేటివరకు వచ్చిన ఈ చారిత్రిక క్రమంలోని ఆలోచనను రెండు దశలుగా విభజించి సామాజిక శాస్త్రాలలో నాటినుండి ఎటువంటి అంశాలు ప్రాధాన్యత వహించుతూ వచ్చినాయన్నది తెలుసుకోవచ్చును.[7]

1. ప్రాచీన కాలం నుండి 16వ శతాబ్ది వరకు,
2. 16వ శతాబ్ద మధ్యకాలం నుండి ప్రస్తుత కాలంవరకు.

ప్రాచీన కాలం నుండి 16వ శతాబ్దం వరకు పరిశీలించినట్లయితే, ఆనాటి సామాజిక ఆలోచనలో మతము, బానిసత్వ విధానం, దైవదత్తాధికార సిద్ధాంతము, భూస్వామ్యవిధానము మున్నగుఅంశాలు ప్రాధాన్యత వహిస్తూ వచ్చినాయి. హిందూ మతంతోపాటుగా, ఇస్లాం మత ప్రవక్త మహ్మద్, క్రీస్తు, గౌతమ, మహావీర మున్నగు మత ప్రవక్తల ఉపదేశాలు వారి వారి పేరిట మతాలుగా యావత్ ప్రపంచాన్ని ప్రభావితంచేస్తూ వచ్చినాయి. సోక్రటీస్, ప్లేటో, అరిస్టాటిల్ వంటి గ్రీకు తత్త్వవేత్తలు అనేకానేక గ్రంథాలను రచించినారు. తాత్త్వికుడు పాలక వర్గానికి రాజ్య వ్యవహారాల్లో సలహాదారుడుగా ఉంటాడని వారు ఉన్నత వర్గీయులకే (అరిస్టాక్రాటిక్ క్లాస్) చెంది ఉంటారని ప్లేటో తన భావనలను, మానవుడు స్వాభావికంగా "సామాజిక జీవి" (సోషల్ ఏనిమల్) అనియు, సమాజంలో ఉన్న వ్యక్తులతో తప్పనిసరిగా అంతర్భాగమని అరిస్టాటిల్ తన అభిప్రాయములను తెల్పుతూ వచ్చారు. సమకాలీన కాలంలోనే చైనాలో కన్‌ఫ్యూసియస్ ఉన్నత వర్గ సంప్రదాయానికి, ఆలోచనలకు ప్రతినిధిగా "దయార్ద్ర హృదయుడైన ప్రభువు — విధేయుడైన బానిస" అనే భావనను వ్యాప్తిలోకి తీసుకరావడానికి ప్రయత్నించినాడు. భారతదేశములో మనువు బ్రాహ్మణాధిక్యతను, కౌటిల్యుడు తన రాజనీతి అర్థశాస్త్రాన్నిరచిస్తూ, క్షత్రియాధిక్యతను లేదా రాజాధిక్యతనుచాటుతూ ఆనాటి ప్రపంచ సామాజిక ఆలోచనా రూపాన్ని ప్రభావితం చేసినారు.

అట్లాగే 16వ శతాబ్దం మధ్యకాలం నుండి చూసినట్లయితే రాజ్యంపై చర్చి ఆధిపత్యాన్ని సమర్థిస్తూ, సిసిరో, అక్వినాస్ "చర్చి ఆధిపత్య వాదాన్ని" రాజుకు నిరపేక్ష అధికారాలు ప్రాప్తింప చేస్తూ, రాజ్యాన్ని పాలించే పాలకునికి ఉండవల్సిన జాగ్రత్తలను కానీ, లక్షణాలను కానీ తెల్పబడేటువంటి మాకియవెలిచే ప్రతిపాదింపబడిన "నిరపేక్ష రాజ్యవాదం" బహుళ ప్రచారంలోకి వచ్చాయి. ప్రపంచములో ఒకవైపు దిశలో లేదా వివిధ ప్రాంతాలలో రకరకాల ఆలోచనలు ఉద్భవిస్తున్నప్పటికి, తరవాతి కాలంలో పాశ్చాత్య దేశాలు తీవ్రమైన సామాజిక పరివర్తనకు (సోషల్ ట్రాన్స్‌ఫర్‌మేషన్) లోనుఅయినాయి. అయితే, పై రచయితలలో చాలామంది తమ తమ సమకాలీన పరిస్థితులకు ప్రభావితులైనప్పటికీ, వ్యక్తిగత ఆలోచన నుంచి వచ్చిన అభిప్రాయాలను వెల్లడించినటువంటివారు. ఆలోచన నుంచి (సామాజిక, ఆర్థిక స్వరూపం నుంచి ప్రభావఫలితంగా) వచ్చిన అభిప్రాయాలే తరువాతి కాలంలో శాస్త్రాలుగా పరిణమించినాయి. ముందే వివరించినట్లుగా పరివర్తనకు లోనవుతున్న యూరోప్ సమాజం మారిన పరిస్థితులవల్ల మత ప్రభావం నుండి బయల్పడిన ఒక క్రొత్త రీతిలో ఆలోచించడం మొదలు పెట్టింది. ఈ ఆలోచనలో జీన్‌బోడిన్ 16వ శతాబ్దిలో ఉత్పన్నమైన "మహాద్రన్యోల్బణ స్వరూపాన్ని వివరించడంలోనూ, అంతర్జాతీయ న్యాయ సూత్రాలు ప్రతిపాదించడములో గ్రోసియస్ ప్రముఖ పాత్ర వహిస్తూ వచ్చారు. రూసో జనేచ్ఛ సిద్ధాంతము, వోల్టేర్ హేతు సిద్ధాంతము ఫ్రెంచ్ సమాజాన్ని ఆ సమకాలీన దశలో విపరీతంగా ప్రభావితం చేస్తూ వచ్చినాయి. మరొక మతపర భావనలపై మార్టిన్ లూథర్ కింగ్, కాల్విన్ వంటి వారు ఒక వైపు దాడి ప్రారంభించగా, మత పర భావనలలో దాగి ఉన్న నిర్హేతుకతను కొంతవరకు చాటగల్గారు. శాస్త్రపరిజ్ఞానం ప్రకృతిపై పెరగడం ప్రారంభించడముతో "పారిశ్రామిక విప్లవం" యూరోప్‌తో ప్రారంభమయింది. ఇంచుమించు అదే కాలంలో సంప్రదాయ అర్థశాస్త్రజ్ఞుడు ఆడమ్‌స్మిత్‌చే "స్వేచ్ఛ విధాన సిద్ధాంతము" ప్రతిపాదింపబడి పెట్టుబడిదారీ విధానానికి పునాదులు పడ్డాయి. తరువాత కాలంలో బెంథామ్, జె. యస్. మిల్. మున్నగువారు ఉపయోగితావాదం — వ్యక్తి శ్రేయోవాదం మొదలగు సిద్ధాంతాలు వ్యాప్తిలోకి వచ్చాయి. ఇవే వాదాలు రానూ రానూ రికార్డో, ఆల్‌ఫర్డ్ మార్షెల్, కీన్స్ నవ్య సంప్రదాయ అర్థ శాస్త్రజ్ఞుల ఆలోచనలను ప్రభావితం చేస్తూ వచ్చినాయి.

18వ శతాబ్ది మధ్యకాలం నుండి పై రకమైన ఆలోచనా విధానానికి వ్యతిరేకంగా ప్రపంచ సామాజిక ఆలోచనలో ఒక నూతనమైనధోరణి ప్రారంభమైంది. హెగెల్ ఆదర్శవాదాన్ని తిరస్కరిస్తూ ఫ్యూయర్‌బా, మార్క్స్, ఏంగిల్స్ ఒక నూతన ఆలోచనకు పునాది వేశారు. మార్క్స్, ఏంగిల్స్, చారిత్రిక గతి తార్కిక భౌతిక వాస్తవికతల ఆధారంగా సమాజాన్ని విశ్లేషిస్తూ, వాటి ఆధారంగానే శాస్త్రీయ సోషలిస్ట్ సిద్ధాంతాన్ని ప్రతిపాదించినారు. మార్క్స్, ఏంగిల్స్ ప్రతిపాదించిన కమ్యూనిస్ట్ సిద్ధాంతము లేదా తత్త్వము సమకాలీన ప్రపంచ సమాజ ఆలోచనా ధోరణిలో మార్పులను తెచ్చినది. గమనించదగ్గ విషయమేమిటంటే, వీరి కంటే ముందు శాస్త్రజ్ఞులు వేరే అంశాలను ప్రతిపాదించ లేదని కాదు. కానీ ముఖ్యంగా వారి ప్రతిపాదనలు ఆలోచనల వరకే పరిమితమైనాయి. కానీ, వీరిద్దరు ప్రతిపాదించిన ఆలోచన మూలాధారంగా రష్యాలో లెనిన్, చైనాలో మావో, ఎన్నో వర్ధమాన దేశాలలో ఆయా నాయకులు, తాత్త్వికులు వీటిని అనుసరిస్తూ వారి వారి సామాజిక గతిని పునర్ నిర్మించుకోవడంతో, మార్క్స్ ఏంగిల్స్‌ల ఆలోచన తత్త్వము ప్రపంచ పరిధిలో కొన్ని దేశాల అనుభవంలో ఆచరణకు అనుగుణమైనదిగా నిరూపించబడుతున్నదన్న అభిప్రాయం కూడా వుంది. ఫ్రాయిడ్ మనో విశ్లేషణ సిద్ధాంతము, డార్విన్ పరిణామ సిద్ధాంతము, సామాజిక శాస్త్రాలపై వెబర్ వ్రాసిన వ్యాసాలు మున్నగునవి కూడా సామాజిక ఆలోచనను ప్రభావితం చేస్తూ వచ్చినాయి. మరొకవైపు అటు కమ్యూనిజాన్ని, ఇటు కాపిటలిజాన్ని పూర్తిగా అంగీకరించక మధ్యేవాదులుగా రస్సెల్, లాస్కీ మున్నగువారు ఉ దా ర వా దు లు గా మిగిలినారు.

పై విధంగా ప్రపంచ సామాజిక క్రమంలో వస్తున్న ఆలోచనా పరిణామంపై అనేక రాజకీయ, ఆర్థిక, సామాజిక కారణాలవల్ల ఉత్పన్నమైన రెండు ప్రపంచ యుద్ధాలు, వలసవాదుల నుండి, సామ్రాజ్య వాదం నుండి విముక్తి చెందిన మూడవ ప్రపంచ దేశాల పోరాట ఫలితం ప్రపంచాన్ని సోషలిస్ట్ పెట్టుబడిదారీ దేశాలుగా మాత్రమే కాక ప్రపంచవ్యాప్తంగా సామాజిక ఆలోచనను ప్రభావితం చేస్తూవచ్చినాయి. అందువల్ల ముఖ్యంగా చెప్పేదేమిటంటే, "సామాజిక పరిణామం నుండి, మార్పుల నుండి ఉత్పన్నమైన సామాజిక ఆలోచనా పరంపర — అవగాహన నుండే సామాజిక శాస్త్రాలు రూపు దాల్చుకున్నాయని, ఆయా కాలాల్లో ఉన్న సమకాలీన సమాజ పరిస్థితులు, శాస్త్రజ్ఞుల భావనలలో బలీయంగా ఉన్నాయని పై చారిత్రిక వివరణాంశాలు స్పష్టపరుస్తున్నాయి." కనుక సామాజిక శాస్త్రాల ఉద్భవం — ఉనికి రెండూ కూడా ఆయా సమాజంచే ప్రభావితమైన ఆలోచన పరంపర, అవగాహన క్రమ ఫలితమే తప్ప వేరొకటి కాదు. ఎంతో చారిత్రిక పూర్వ పరాన్ని కల్గి ఉన్న ఈ సామాజిక శాస్త్రాలు — ప్రకృతి శాస్త్రాలతో సమాన స్థాయిల్లో పురోగతిని సాధించకపోవడంలో చారిత్రక కారణాలేకాక ఇంకా అనేకాంశాలు ఇమిడి ఉన్నాయి.

## సామాజిక శాస్త్ర పరిశోధన పురోగతి సాధించలేకపోవడానికిగల కారణాలు

ఈ అంశాన్ని వివరించే ముందు మరొకసారి సామాజిక శాస్త్ర చారిత్రిక పరిణామాన్ని దృష్టిలో ఉంచుకొని పరిశీలించడం అవసరము. ఎందుకంటే, దాదాపు పరిణామంలోనే ఉత్పన్నమైన సమస్యలు ఈనాటికీ కొనసాగుతూనే వున్నాయి. మొదటిగా

1. సమాజాభివృద్ధిలో, పరిణామంలో మొదటి నుంచి మతము, సాహిత్యం, సంస్కృతి, కళలు మున్నగు వాటిలో ఉండే అశాస్త్రీయ అంశాలు సామాజిక శాస్త్రాలపై ప్రభావం చూపెట్టడం

వల్ల పరిశోధనపై కూడా వాటి ప్రభావం పడింది. ఈ ప్రభావం శాస్త్రీయ పరిజ్ఞాన పెరుగుదలకు ఎటువంటి ప్రభావాన్ని చూపెట్టే నదో రచయిత జె. డి. బెర్నల్ ఉదహరించిన అభిప్రాయం ద్వారా తెలుసుకోవచ్చు.[9]

''హియర్ నాలెడ్జ్ వాస్ సౌట్ యాస్ ఎ వే ఆఫ్ ఎస్కేపింగ్ ఫ్రమ్ సొసయిటీ రాదర్ దాన్ ఎటెంప్టింగ్ టు కంట్రోల్ ఇట్.'' అంటే సామాజిక శాస్త్రాలు — శాస్త్రంగా ఉద్భవించే పురిటి దశలో పరిజ్ఞానం నిర్హేతుకమైన, తాంత్రిక, మాంత్రిక భావనలను, పరలోక భావాలను ప్రతిబింబించి, సామాజిక సమస్యలను ఎదుర్కొనే విధంగా శాస్త్రాలను రూపొందించే బదులు ''పలాయన వాదాన్ని'' తెల్పేవిధంగా ఉన్నప్పుడు సహేతుకత కరవయి శాస్త్రాల పురోగతి కానీ, పరిశోధన స్థాయి కానీ కుంటుపడిపోవడం తక్షణ ఫలితంగా సంభవిస్తుంది.

2. అట్లాగే, ప్రకృతి శాస్త్రాలవలె, సామాజిక శాస్త్ర పరిశోధనప్రయోగాత్మకతకు అనుగుణంగా అన్వయించగలగడం కష్టంతో కూడుకున్నటు వంటిది. ప్రయోగాత్మకతకు అన్వయించలేకపోవడం వల్ల ఫలితాలను ఊహించడం కష్టం కావడంవల్ల శాస్త్ర పరధులు విస్తృతం కావడం పరిమితమైపోయింది.

3. సామాజిక శాస్త్రాలను విశ్లేషించే దశలో వచ్చేటు వంటి ''విలువల ప్రమేయ తీవ్రత'' సామాజిక శాస్త్ర పెరుగుదలకు మూలమైన పరిశోధనలో నిజాలను శాస్త్రీయంగా విశ్లేషించడములో అధికంగా ఉండడంవల్ల సామాజిక శాస్త్రాలు ఇబ్బందులను ఎదుర్కొనవలసి వస్తున్నది.

4. సమాజ శాస్త్ర పరిశోధనలో పరిశోధకుడు — పరిశోధిత అంశము రెండూ మానవుడే. మానవుని గూర్చిన, సమాజాన్ని గూర్చి తెలుసుకొనే ప్రక్రియలో పరిశోధన కొంత కష్టమే కావచ్చు. ఎందుకంటే సంక్లిష్టమైన మానవుని ప్రవర్తన, వైవిధ్యమైన సమాజ కారకాల స్వరూపం ప్రకృతి శాస్త్రాలలో ఉన్న సంక్లిష్టతల కన్నా అధికంగా ఉంటాయి. అందువల్లనే సాపేక్షికంగా ప్రకృతి, సాంకేతిక, భౌతిక శాస్త్రాలు పరిణతికి దగ్గరగా ఉన్నాయి.

5. సమాజ శాస్త్ర పరిశోధనలో మొదటి మంచి క్షేత్ర పరిధిలో పరిశోధన తక్కువయి ''శీతల గృహ నమూనా ధోరణి'' ప్రబలడం వల్ల సామాజిక వాస్తవాల సామీప్యానికి వెళ్ళలేక నాలుగు గోడల మధ్య జరిగే ''ఊహా జనిత దృక్పథము'' సమాజ శాస్త్ర పరిశోధనలో నిర్మాణాత్మకమైన, అనుభవపూర్వకమైన కృషికి ఆటంకాలుగా పరిణమించినాయి.

6. సామాజిక శాస్త్ర పరిశోధనలో పరిమితమైన వనరులు, అర్థంలేని, విషయస్ఫూర్తిలేని నియమ నిబంధనలు, సమస్యలపై నిబద్ధతతో ఆలోచించే సమాజ శాస్త్రవేత్తలు పరిమిత సంఖ్యలోనే ఉండడము, ఎంపికచేసే పరిశోధిత అంశాలు సమకాలీన సమస్యలను స్పందించేవిగా ఉండకపోవడము మొదలగు అంశాలు ముఖ్యమైన సమస్యలుగా మిగిలినాయి.

7. మరొక ముఖ్యమైన విషయ మేమిటంటే, సామాజిక శాస్త్ర పరిశోధనలో, సమగ్రమైన విజ్ఞానాన్ని ఏర్పరిచే ప్రయత్నాలు ఎప్పుడూ జరగక, అతి సూక్ష్మాతిసూక్ష్మంగా ప్రత్యేకాంశాలుగా సమాజ శాస్త్రాలు విడిపోయినాయి. ఒక సామాజిక అంశాన్ని వివిధ దృక్కోణాల నుంచి చూడడము అవసరమే అయినా, వివిధ దృక్కోణాలను తిరిగి పూర్ణ అర్థంలో నిర్వచించడం జరగవలె. సామాజిక శాస్త్రాలలో ఈ అంశము కొరవడినట్లుగా కనపడుతుంది.[10]

ఈ విధముగా సామాజిక శాస్త్రాల పెరుగుదలలో కానీ, పరిశోధనా రీతిలో కానీ, సాధారణార్థంలో అనేక రకాలుగా అడ్డంకులు వచ్చినప్పటికీ ఈనాడు వర్ధమానదేశాలలో ముఖ్యంగా భారతదేశములో ఈనాడు సమాజ శాస్త్ర పరిశోధనా రీతితోపాటు అభివృద్ధి చెందిన దేశాలలోని సమాజ శాస్త్ర పరిశోధనా రీతులను క్లుప్తంగా వివరించడం అభిలషణీయం.

## అభివృద్ధి చెందిన దేశాలలో సామాజిక శాస్త్ర పరిశోధన - తీరుతెన్నులు

పెట్టుబడిదారీ దేశాలలో కూడా సామాజిక శాస్త్రాల అభివృద్ధిపై, పరిశోధనపై తగినంతగా శ్రద్ధను చూపెట్టడం జరుగుతున్నది. ఇట్లా జరుగుతున్నప్పటికినీ, వందల కొలది సామాజికశాస్త్రజ్ఞులు, సామాజిక పరిశోధకులు వివిధ సామాజిక శాస్త్ర రంగ పరిశోధనలో నిమగ్నమైనప్పటికినీ, సామాజిక శాస్త్ర పరిశోధనలో విమాత్నమైన సిద్ధాంతమేదీ ఉద్భవించలేదు.[11] ఈ దేశాలలో సామాజిక పరిశోధనలో గణాంకపద్ధతిని విపరీతంగా సామాజిక శాస్త్రాలలో వాడడం గమనించదగ్గ విషయము. సర్వే పద్ధతి, ప్రశ్నావళి మున్నగు విశ్లేషణ పద్ధతులను చేపట్టడం జరుగుతున్నది. గుర్తించదగ్గ స్థాయిలో అర్థ, రాజనీతి, సామాజిక, విద్యా శాస్త్రాలను అభివృద్ధి పరచడానికి ప్రయత్నాలు జరిగినాయి. అయినప్పటికినీ, విశ్వ విద్యాలయాల్లో బోధించే సామాజిక శాస్త్ర పాఠ్యాంశాలను కొద్దో, గొప్ప తేడాతో తప్ప ఉన్నటువంటి పెట్టుబడిదారీ సామాజిక విధానాన్ని సమర్థించేవిగానూ ఉన్నాయని తెల్పడం జరిగింది.[12]

అట్లాగే సోషలిస్ట్ దేశాలలో ముఖ్యంగా రష్యా, చైనాలో, సామాజిక శాస్త్రాలు ఆయా దేశాల విప్లవాలకు ముందుఉన్న పూర్వ స్థితికి — ఈనాడు ఉన్నటువంటి విప్లవానంతర దశకు చాలా మార్పు కనిపిస్తుంది. అందువల్ల ఈ దేశాలలో సామాజిక శాస్త్రాల పరిశోధనా తీరును గమనిస్తున్నప్పుడు ఆయా దేశాలలో సంభవించిన విప్లవాలకు — శాస్త్ర పెరుగుదలకు మధ్య ఉన్న సంబంధము ప్రముఖపాత్ర వహిస్తుంది. సోషలిస్ట్‌దేశాలలో సామాజిక శాస్త్ర పరిశోధనా పెరుగుదలను ఒక్క మాటలో చెప్పాలంటే విప్లవానంతరము రష్యాలో చేపట్టిన ''ఆర్థిక ప్రణాళికా విధానం''ను నేడు వర్ధమాన దేశాలలో దాదాపు అధిక సంఖ్యాక ప్రభుత్వాలు చేపట్టడమే యిందులకు తార్కాణం.[13]

అట్లాగే మరొక సోషలిస్ట్ దేశమైన చైనాలో కూడా విప్లవానంతరము సామాజిక శాస్త్రాల రంగాలలో గణనీయమైన స్థాయిలో ప్రయత్నాలు జరుగుతున్నాయి. "నేడు చైనాలో ఎన్నడూ లేనంతగా సంస్కృతిమీద, పురావస్తుశాస్త్రం మీద, అక్షరాస్యత, విద్య, ఆరోగ్య రంగాలలో విస్తృత స్థాయిలలో పరిశోధనా ప్రయత్నాలు జరుగుతున్నాయి."[14] ఇటీవలిగా 1978 లో చైనాలో సామాజిక శాస్త్రాల అభివృద్ధి కొరకు "చైనీస్ సోషల్ సైన్స్ అకాడెమీ"ని స్థాపించడం జరిగింది. ఈ సంస్థ అనేకానేక ఉప విభాగాలతో అవసరమైన మానవ, ఆర్థిక వనరుల వ్యవస్థా సామగ్రితో సామాజిక శాస్త్ర పరిశోధనాభివృద్ధికై పాటుపడడం జరుగుతున్నట్లుగా వివరించడం జరిగింది.[15] ఈ విధంగా పెట్టుబడిదారీ, సోషలిస్ట్ దేశాలలో సామాజిక శాస్త్ర పరిశోధనా స్థాయి ఉన్నప్పటికినీ, వర్ధమాన దేశాలలో భారత దేశంలో కూడా ఇవి ఒక ప్రముఖమైన పరిశ్రమగా విద్యారంగములో ప్రాధాన్యత వహిస్తున్నది.

## భారతదేశంలో సామాజిక శాస్త్ర పరిశోధన - తీరుతెన్నులు

భారతదేశములో సామాజిక శాస్త్ర పరిశోధన ఈనాడు ప్రధానంగా ఐదు మార్గాల ద్వారా కొనసాగుతున్నది. అవి :

1. కేంద్ర రాష్ట్ర విభాగాల ఆధ్వర్యములో, అజమాయిషీలో కౌన్సిళ్ల రూపంలోనో, ఇనిస్టిట్యూట్ రూపంలోనో, బ్యూరోలుగానో ఉండేటువంటి పరిశోధనా సంస్థలు.

2. చట్టబద్ధంగా స్వతంత్ర ప్రతిపత్తి కలిగి ఉంటూ, సహాయం పొందుతున్నటువంటి పరిశోధనా సంస్థలు.

3. విశ్వ విద్యాలయ విభాగాలు.

4. ప్రైవేట్ పరిశోధనా మరియు సంప్రదింపు సంస్థలు.

5. వ్యక్తిగతంగా పరిశోధనపై దృష్టిని కేంద్రీకరించే సామాజిక శాస్త్రవేత్తలు, రచయితలు మొదలగువారు కూడా సామాజిక శాస్త్ర పరిశోధనలో ప్రముఖ పాత్ర వహిస్తున్నారు. పై వాటిని క్లుప్తంగా వివరించినట్లయితే,

### 1. ప్రభుత్వ పరిశోధనా సంస్థలు

కేంద్ర లేదా రాష్ట్ర ప్రభుత్వ యాజమాన్యంలో బ్యూరోలుగా, కౌన్సిళ్లుగా, సంస్థలుగా, డైరక్టరేట్‌లుగా అనేక రూపాల్లో పరిశోధనా సంస్థలు, విద్యా, ప్రణాళిక రంగ, గణాంక విభాగ, హరిజన, గిరిజన సంక్షేమ మొదలగు అనేక రంగాలలో పరిశోధనా కార్యక్రమాన్ని నిర్వహిస్తున్నాయి.

## 2. స్వతంత్ర ప్రతిపత్తిగల పరిశోధనా సంస్థలు

భారతదేశ సామాజిక శాస్త్ర పరిశోధనలో ప్రముఖ పాత్ర వహించేవి ''స్వతంత్ర ప్రతిపత్తిగల పరిశోధనా సంస్థలు.'' ఇందులో ప్రధానంగా 1950లో స్థాపించబడిన ఇండియన్ ఇనిస్ట్యూట్ ఆఫ్ పబ్లిక్ ఆడ్మినిస్ట్రేషన్, నేషనల్ కౌన్సిల్ ఆఫ్ ఎడ్యుకేషనల్ రిసెర్చ్ అండ్ ట్రైనింగ్, 1968 లో ఇండియన్ కౌన్సిల్ ఆఫ్- సోషల్ సైన్స్ రిసెర్చ్ (ఐ. సి. యస్. యస్. ఆర్.) మొదలగున్నవి ప్రధాన మైనవి. ఇంకా దేశంలోని ఢిల్లీ, త్రివేండ్రమము, వారణాసి, బీహర్, మద్రాసు, బాంబే, కలకత్తా, పూనా, అహ్మదాబాద్, హైద్రాబాద్ మున్నగు ప్రాంతాలలో భిన్న భిన్న సామాజిక శాస్త్ర పరిశోధనా రంగాలకు సంబంధించిన అనేక పరిశోధనా సంస్థలు ప్రాధాన్యం వహిస్తున్నాయి.[15a] వీటికి విత్త సహాయం అందించడములో యూనివర్శిటీ గ్రాంట్స్ కమీషన్, (యు. జి. సి.) ప్రభుత్వ శాఖలు, అంతర్జాతీయ బ్యాంకు, ఫోర్డ్ ఫౌండేషన్ మొదలగునవి ముఖ్యమైనవి.

## 3. విశ్వ విద్యాలయ విభాగాలు

విశ్వ విద్యాలయాల్లో ఉన్నటువంటి సామాజికశాస్త్ర విభాగాల పరంగా జరిగే పరిశోధన అతి ముఖ్యమైనది. వీటితో పాటుగా మరి కొన్ని విద్యాపర పరిశోధన సంస్థలు కూడా ఉన్నాయి. వాస్తవానికి నేడు ఐ. సి. యస్. యస్. ఆర్. నుండి అతి ఎక్కువగా నిధుల వాటాను పొందేవి ఈ విద్యా సంస్థలే.[16] ఈ విధమైన విద్యాసంస్థలలో ముఖ్యముగా బెంగుళూర్, అహ్మదాబాద్, కలకత్తాలో ఉన్నటువంటి ఇండియన్ ఇనిస్ట్యూట్ ఆఫ్ మేనేజ్‌మెంట్, హైద్రాబాద్‌లోని అడ్మినిస్ట్రేటివ్ స్టాఫ్ కాలెజి, దేశంలోని వివిధ విశ్వ విద్యాలయాలు ప్రముఖమైనవి.

## 4. ప్రైవేట్ పరిశోధనా సంప్రదింపు సంస్థలు

ఆపరేషన్స్ రిసెర్చి గ్రూప్ (బరోడా), టాటా ఎకానమిక్ కన్సల్టెన్సీ సర్వీసెస్ (బాంబే) మరియు సిస్టమ్స్ రిసెర్చ్ యూనిట్ (పూనా) మున్నగునవి ఈ విధమైన వాటిలో ప్రధాన సంస్థలు. ఈ సంస్థలు మేనేజ్‌మెంట్ క్షేత్ర పరిధిలో పరిశోధనపై దృష్టిని ఎక్కువగా కేంద్రీకరించడం జరుగుతున్నది. నిర్వహణకు సంబంధించిన వివిధఅంశాల వివరణార్థమై ఈపరిశోధనా సంస్థలను పకడ్బందీగా ప్రైవేట్ యాజమాన్యం నిర్వహిస్తూండడము గమనించదగ్గది.

## 5. వ్యక్తిగతంగా పరిశోధన చేసే మేధావులు

దేశంలోని వివిధ ప్రాంతాలకు చెందిన మేధావులు, సామాజిక శాస్త్రజ్ఞులు వివిధ రంగాలకు సంబంధించిన సామాజిక శాస్త్ర అంశాలపై వ్యక్తిగత ఆసక్తితో చేస్తున్న పరిశోధన ప్రశంసించదగినది. ఆర్థిక ఇబ్బందులు ఎదుర్కొంటూ, మేధాపరంగా యెంతగానో శ్రమిస్తూ సమస్యల విశ్లేషణలో వీరు ముఖ్యమైన పాత్ర వహిస్తున్నారు.

పై విధంగా అనేక రూపాల్లో ఒకవైపు, పరిశోధనా సంస్థలు మరొకవైపు, విశ్వవిద్యాలయాలు, మేధావులు ఏదో ఒకరకంగా సామాజిక శాస్త్రపరిశోధనకు తోడ్పడుతూనే ఉన్నప్పటికినీ, వనరులు ఎంతగా కేటాయించినా, విద్యాలయాల విస్తృతి ఎంత పెరిగినా ''విజ్ఞుల'' సంఖ్య విపరీతముగా పెరిగినా, సామాజిక భౌతిక వాస్తవాలపై వున్నట్టువంటి శాస్త్రీయ విశ్లేషణ అరుదుగా కన్పించడం వల్లనైతేనేమి, అనేక ఇతర కారణాలవల్ల నైతేనేమి, భారతదేశంలో సామాజిక శాస్త్ర పరిశోధన తీరు విమర్శకు అతీతంగాలేదు.

## భారతదేశంలో సామాజికశాస్త్ర పరిశోధన - విమర్శ

భారతదేశ సామాజిక పరిశోధనలో మొదటిగా వచ్చే విమర్శ ఏమిటంటే, సామాజికశాస్త్ర పరిశోధనను కేవలం అకడమిక్ దృష్టితో చూడడమే. పరిశోధన అనేది సామాజిక ప్రగతికై కాకుండా వ్యక్తి వృత్తి పురోగతికై సాధనంగా చూడడమే. ఏవిధంగానంటే, ఈనాడు భారత విశ్వవిద్యాలయాల్లో జరిగే పిహెచ్.డి., యమ్. ఫిల్. మరియు ఇతర పరిశోధనా అర్హతలు వ్యక్తి పదోన్నతికి అర్హప్రమాణాలుగా చూడబడుతున్నాయి.[17] అట్లాగే సామాజికశాస్త్ర పరిశోధనలో మేధావులు ఎవరో కొద్దిమంది తప్ప గణించదగ్గ స్థాయిలోవారు తమ పాత్రను నిర్వహించడములేదనిపిస్తుంది.

## మే ధా వు లు

మౌలికమైన సామాజిక సమస్యలకు సాధ్యమైనంతదూరంగా ఉండాలని ప్రయత్నించే ధోరణి కలిగిన ''మేధాసంపత్తి'' (?) ఉన్న సమాజంలో స్పష్టమైన, సృజనాత్మకమైన శాస్త్రీయ విజ్ఞాన పెరుగుదల కష్టసాధ్యము. భారతదేశములోని సామాజికశాస్త్ర మేధావులలో చాలావరకు పరిమితమైన పరిధిలో, ముందే నిర్ణయించుకొన్న చట్రంలో లోబడి పని చేస్తున్నారనిపిస్తుంది. విమర్శనాత్మకమైన విశ్లేషణను పూర్తిగా మర్చిపోయి పూర్తిగా ప్రతిదానికి సమర్థించే తత్వమో లేక ఆదేపనిగా వ్యతిరేకించడమో జరుగుతువున్నది. ఒక అంశములో ఉన్న లోతుపాతులను అవగాహన చేసుకొని మంచి ఉన్నట్లయితే సమర్థించవలనే కానీ, అసంబద్ధతలు, లోపాలు ఉన్నచోట శాస్త్రీయంగా విమర్శించే ధోరణి సామాజికశాస్త్ర పరిశోధనలో రావలసినంతగా రాలేదు. కారణం ఏదైనా ఇది పరిశోధనకు, దాని పురోగతికి సహకరించని అంశము. వత్తిడిలేని, నిర్బంధములేని నిస్సంకోచ వాతావరణంలో శాస్త్రీయ పరిజ్ఞానం అభివృద్ధి కావడానికి అవకాశముంది. ఒక అంశాన్ని విశ్లేషించి, విమర్శించే బాధ్యతను, అవకాశాన్ని కల్గిఉన్న సామాజిక శాస్త్రవేత్తలు-సామాజిక విమర్శకులుగా, నూతన సమాజ వైతాళికులు కాక, కేవలం ''పాసివ్ ఆబ్జెక్ట్స్'' గానే వారు మిగిలిపోతే శాస్త్రపరిశోధన నత్తనడకగా మారుతుంది. మరొక గమనించదగ్గ విషయం ఒక పరిశోధనద్వారా తేలిందేమిటంటే, సామాజిక శాస్త్రాన్ని బోధించే అధ్యాపకులు వారికి సంబంధించిన ఆ యా

సంబంధిత శాస్త్రాలను ప్రాధాన్యం వహించినవిగా వారు భావించడం లేదని, "ప్రాధాన్య వరుసక్రమంలో" చాలామంది అధ్యాపకులు సామాజిక శాస్త్రాలకు మరియు తమ సంబంధిత శాస్త్రాలకు ప్రథమస్థానం ఇవ్వలేదని తెలుస్తున్నది.[18] అంటే తాము బోధించే శాస్త్రాలు అంతగా ప్రాధాన్యం వహించినవి కావని వారు భావిస్తున్నారన్నమాట. "విషయ ప్రాధాన్యతలేని శాస్త్రాలుగా వాటిని బోధించే అధ్యాపకులే భావిస్తున్నప్పుడు ఆ శాస్త్రాలలో పరిశోధనకు అవకాశాన్ని ప్రోత్సహించడము అనే విషయాన్ని ఊహించడం కష్టము.

వర్ధమాన దేశాల్లో మేధావులు, పరిశోధకులు — ప్రభుత్వం మరియు ప్రభుత్వ సంబంధిత సంస్థల సహకారం లేకుండా పరిశోధన కొనసాగించుట కష్టము. అందువలన వారు ఇతరులపై "ఆధార పడవలసిన స్థితి" ఏర్పడుతుంది. ఈ స్థితిని అదనుగా తీసుకొని ప్రభుత్వం వారి శాస్త్రీయ ఆలోచనా పరంపరకు—విశ్లేషణా రీతులను నియంత్రించే అవకాశం కూడా లేకపోలేదు. ఇంకా సామాజికశాస్త్ర పరిశోధనపై ఆంక్షలు విధిస్తున్నట్టుగా ఆధారాలు ఉన్నాయి.

## సామాజికశాస్త్ర పరిశోధనపై ప్రభుత్వ ఆంక్షలు

దేశంలోని వివిధ పరిశోధనా సంస్థలు, విద్యాలయాలు ఏదేని అంశముపై కూలంకషముగా అధ్యయనం చేసి చివరగా కొన్ని అనుభవాలను, పాఠాలనుసూచిస్తూ, పరిష్కారమార్గాలు వాస్తవాలను చెప్పేవిగా ఉన్నప్పుడు, అవి కేంద్ర లేదా రాష్ట్ర ప్రభుత్వ "ఆసక్తులకు", "ప్రముఖవ్యక్తుల అభీష్టాలకు" వ్యతిరేకంగా ఉన్నట్లయితే, ఆయా పరిశోధనా నివేదికలను గానీ, పరిశోధన సారాంశాన్ని గానీ, ప్రచురితం కాకుండా నిరోధించిన సంఘటనలు కోకొల్లలు.[19] దీనివల్ల తెల్పేదేమిటంటే నిష్పాక్షికమైన లేదా సామాజిక వాస్తవాలను ఉన్నదున్నట్లుగా వివరించినపుడు వాటివల్లవచ్చే సమస్యా ఉధృతికి తట్టుకోలేక వాటిపై ప్రభుత్వం ఆంక్షలు విధిస్తున్నట్లుగా కనపడుతున్నది. ఒక అంశముపై స్పష్టమైన అవగాహనకు కావాల్సిన సమాచార సేకరణగానీ, విశ్లేషణా విమర్శ ఉండినపుడు వాటిని గౌరవించడం ప్రజాస్వామిక ప్రభుత్వ మౌలిక బాధ్యత. లేనట్లయితే పరిశోధన కేవలం "పరిశోధన" కొరకు గానే మిగిలిపోతుంది. సామాజికశాస్త్ర పరిశోధనపై ఉన్నటువంటి మరొక విమర్శ ఏమిటంటే, చేసినటువంటి లేదా అందుబాటులో ఉన్నటువంటి పరిశోధనను ఉపయోగించుకోలేకపోవడం.

## పరిశోధనా వినియోగిత

పరిశోధన ఎంత క్రియాశీలకంగా ఉన్నప్పటికినీ, విధాన నిర్ణయంపై ఆ పరిశోధన సారాంశ ప్రభావం అతి తక్కువగా కనపడుతున్నది. పరిశోధకుడిమధ్య—ప్రభుత్వ విధానకర్త మధ్య తీవ్రమైన "సమాచార అంతరం" (కమ్యూనికేషన్ గ్యాప్) ఉంది. లక్షలాది రూపాయల వ్యయం ఒకవైపు పరిశోధనపై వెచ్చించబడుతూఉంటే, ప్రభుత్వ విధానాలపై అది ఏమాత్రం ప్రభావం చూపెట్టలేకపోవడం వల్ల సిద్ధుల సార్థకతగానీ, పరిశోధన శ్రమకానీ కేవలం "నిష్ఫల శ్రమగానే" మిగిలిపోతుంది. పైగా ఎన్నెన్నో కమిటీల రిపోర్టులు కనీసం మళ్లీ ఈనాడు వెదుకుదామన్నా దొరకనంత చీకట్లోకి అవి నెట్టివేయబడుతున్నాయి. అంటే వాటి ప్రభావం ఏంలేదని తెల్పడమే. ఉదా :— పాలనా సంస్కరణల సంఘం, నివేదనలను వివిధ రంగాలపై సమర్పించినది. అవి ఎంత ప్రభావాన్ని చూపెట్టినాయి? అన్న అంశము కేవలం చిక్కు సమస్యగానే మిగిలిపోతుంది. ఐ. సి. యస్. యస్. ఆర్. ప్రథమ సమీక్ష కమిటీ ఇలా వివరించినది. "తమ పరిశోధన ఆయా సంబంధిత అంశాలపై గానీ, సంస్థలపై గానీ ఏలాంటి ప్రభావం చూపెట్టలేకపోవడంతో సామాజిక శాస్త్రవేత్తలు నిరుత్సాహానికి గురిఅవుతున్నారు.[20] తత్ఫలితంగా విధాన నిర్ణయంలో గానీ, విధాన ఆచరణలో గానీ తమ కార్యసాధకత్వం లేనందువల్ల సామాజిక శాస్త్రాల పరిశోధనకు తగిన న్యాయం జరగడంలేదు.

## సామాజికశాస్త్ర పరిశోధనలో ఉద్యోగి స్వామ్య సహకారం

భారతదేశములో సామాజికశాస్త్ర పరిశోధనలో ఉద్యోగి స్వామ్య సహకారంపై రచయిత మైరన్ వీనర్ ఈవిధంగా వ్యాఖ్యానించాడు.[21]

"ఉద్యోగి స్వామ్యంలో ఎవరో కొద్దిమంది విశాల దృక్పథం కల్గినవారు తప్ప ఉద్యోగిస్వామ్యం పరిశోధనకు ప్రోత్సాహాన్నిచ్చేదిగా లేదు. ఎప్పుడయితే ఉద్యోగిస్వామ్యం వినూత్నతకు (ఇన్నొవేషన్) సంసిద్ధంగా లేదో, అదే ఉద్యోగి స్వామ్యం వినూత్నతకై అన్వేషించే పరిశోధనకు అనుకూలంగా ఉంటుందని అనుకోవడం కేవలం ఊహే."

అని అంటాడు. ఎందుకంటే సామాజిక శాస్త్రవేత్తలపై, పరిశోధకులపై వీరు కేవలం "ఎకడమిక్"గా మాట్లాడే వారన్నభావం ఒకవైపూ, తమ పథకాల ఆచరణపై, ప్రణాళికల విధానంపై వీరు విమర్శించుతారన్న దృక్పథం మరొకవైపూ రెండు రకాలుగా భావాలు ఉద్యోగి స్వామ్యంలోఉన్నాయి. తత్ఫలితంగా పరిశోధనకు తగినంత ప్రోత్సాహం లభించకపోవచ్చునన్న సందేహం కలుగుతుంది. అంతేగాక పరిశోధనా సంస్థలు కేవలం ఒక ఢిల్లీ రాజధానిలోనో, మద్రాసు మహాపట్టణంలోనో అతిగా కేంద్రీకరించడంవల్ల పరిశోధన అవకాశాలు కొద్దిమందికే పరిమితమవుతున్నాయి. వాస్తవానికి అది జరుగుతున్నది కూడా. అట్లాగే ప్రభుత్వ నిధులుకూడా కొన్ని పరిశోధనా సంస్థలే అతిగా పొందడం జరుగుతున్నది. ఈ సందర్భములో ప్రొ. జి. రామ్ రెడ్డి వ్యాఖ్యానిస్తూ ఇలా అన్నాడు :

దేర్ ఆర్ ఎ నంబర్ ఆఫ్ గవర్న్‌మెంట్ ఏజన్సీస్ విచ్ ప్రొవయిడ్ ఫండ్స్ ఫర్ రిసెర్చి, బట్ దే టెండ్ టు బాక్ అప్ ఓన్లీ ది "నోన్ హార్సెస్".[22]

ముఖ్యంగా ఈనాడు సామాజికశాస్త్ర పరిశోధనలోఉన్న విమర్శ, పరిశోధనలో ఉపయోగిస్తున్న "పాశ్చాత్య నమూనాల దిగుమతి". పాశ్చాత్య నమూనాలను దిగుమతి చేసుకోవడంవల్ల స్వనమూనాలు

అభివృద్ధి కాకపోవడమేకాక, ఎల్లప్పుడూ వాటిపైననే "ఆధారపడే స్థితి" ఏర్పడే ప్రమాదమున్నది. ఒకదేశంలో ముఖ్యంగా సామాజిక, ఆర్థిక, సాంస్కృతిక పూర్వపర రంగాలలో వైరుధ్యం కలిగిఉన్న దేశాలలో రూపొందించిన పద్ధతులు వేరొక దేశానికి అంతగా ఉపక రించకపోవచ్చు. (అట్లాగని ప్రయోజనకారియైన వాటిని తిరస్క రించడం కాదు.)ఆయా సమకాలీన పరిస్థితులలో ఆయా సామాజిక స్వభావానికి అనుకూలంగా స్వతంత్ర పరిశోధనా పద్ధతులను రూపొం దించడం అవసరం. ఈ అంశము భారత సామాజికశాస్త్ర పరిశోధ నలో నిర్లక్ష్యం చేయబడినట్లుగానే తోస్తుంది. పరిశోధనాంశాన్ని వివ రించేటప్పుడు పరిశోధనాంశానికి- సామాజిక భౌతిక వాస్తవికతలకు, సమస్యలకు ఉన్న పరస్పర చర్యను అంతర్ సంబంధాన్ని చూడకుండా సమస్యను కేవలం ఒంటరిగా, పాక్షికంగా చూడడంతో పరిశోధన ప్రక్కదారులుపట్టి నిజాలు మరుగున పడిపోయి పరిశోధన తన అస్తి త్వాన్నే కోల్పోయే ప్రమాదముంది. కాబట్టి సామాజికశాస్త్ర పరిశోధ నలో ఈ అంశాన్ని గుర్తుంచుకోవలసి ఉంది

## ము గిం పు

పై విధముగా సామాజికశాస్త్ర పరిణామానికి గానీ, పరిశోధన నత్తనడకకుగానీ కారణాలు మొదట్లో ఏమయినా, ఆధునిక యుగా రంభమునుండి ప్రపంచవ్యాప్తంగా వచ్చిన పరిణామాల ప్రభావం దృష్ట్యా సమాజంలో అనేక మార్పులు సంభవించినాయి. పెట్టుబడి దారీ దేశాలవలె పారిశ్రామిక విప్లవంకానీ, సోషలిస్ట్ దేశాలలోవలె విప్ల వాలు కానీ, భారతదేశములో మౌలికంగా సామాజిక విప్లవంరాలేదు. ఆ ప్రభావం సహజంగానే పరిశోధనపై కూడా ఉంటుంది. వర్ధ మాన దేశాలలో ముఖ్యంగా భారతదేశము వలసవాద పాలనుండి విముక్తి అయిన తరువాత, అన్నింటితోపాటు సామాజికశాస్త్ర స్వరూ పాల ఉనికి, లక్ష్యాలు, వాటి పరిశోధనా గమ్యం మారుతూ వచ్చినప్ప టికినీ, పరిశోధనకు– సమాజానికి ఉండవల్సిన అంతర్ సంబంధ విశ్లేషణ, ప్రతిఫలనస్థితి ఆయా సమస్యలపై ఉండవలసినంతగాలేదు. సామాజికశాస్త్ర పరిశోధనలో, సమస్యలు ఎంత జటిలమైనవో, వాటికి మూలమెక్కడో నిర్భయంగా సమాజ శాస్త్రజ్ఞుడు చెప్ప గల్గాలి. పరిణామాలు ఎలాఉన్నా, ఫలితాలు ఏ రకంగాఉన్నా — సమ స్యల వెనుకఉన్న సమాజ స్థితిగతుల్ని, వైరుధ్యాల్ని, ఆర్థిక నిర్మా ణాన్ని, వర్గవ్యత్యాసాలను, ప్రభుత్వ కార్యకలాపాల కార్య సాధకత్వాన్ని నిస్సందేహంగా స్వేచ్ఛాపూరిత వాతావరణంలో విశ్లేషించిననాడే శాస్త్రీయ పరిశోధన సాధ్యమవుతుంది. శాస్త్రాలను సిద్ధాంతీకరించే బలం పుంజుకొంటుంది. అత్యధిక సామాజిక అనుభవంనుంచి, ప్రజల ఆసక్తులనుంచి విజ్ఞానాన్ని, శాస్త్రాన్ని రూపొందించుకోలేకపోతే, పరి శోధన విజ్ఞాన అంతిమ లక్ష్యమైన ప్రజల అనుభవానికి దగ్గరగా వెళ్ళడం సాధ్యంకాదు. "ప్రజలనుంచి-ప్రజల సామీప్యానికి" అన్న సూత్రాన్ని సామాజిక శాస్త్రాల పరిశోధన గుర్తించలేకపోతే శాస్త్రీయ పరిశోధన పురోగతికి సామాజికశాస్త్ర పరిశోధన దోహదకారి కాజాలదు.

అందువల్ల, సిద్ధాంతీకరణ-ఆచరణ—విమర్శ ఈ మూడు సామాజికశాస్త్ర పరిశోధనకు పునాదిగా ఉన్నప్పుడే శాస్త్రీయ పరిశోధన సాధ్యమవుతుంది. అప్పుడే సమస్యకు సరిఅయిన జవాబు చెప్పే స్థితిలో సమాజ శాస్త్రాలు ఉంటాయి.

[రచయితలు కాకతీయ విశ్వవిద్యాలయంలో పరిశోధనచేస్తున్న విద్యార్థులు].

## సంప్రదింపు రచనలు


1 సైన్స్ ఇన్ హిస్టరీ వాల్యూం. 4. సోషల్ సైన్సెస్—కన్ క్లూషన్. — జె. డి. బెర్నాల్.

2 స్టడీస్ ఇన్ మార్క్సిజమ్ అండ్ పొలిటికల్ సైన్స్ — ప్రొ. కె. శేషాద్రి.

3 వాట్ ఈజ్ హిస్టరీ — ఇ. హెచ్. కార్.

4 ఎకనామిక్ అండ్ పొలిటికల్ వీక్లీ, వాల్యూం 34. నం. 37. సెప్టెం బర్ 15, 1979. — మైరన్ వీనర్.

5 ఎకనామిక్ అండ్ పొలిటికల్ వీక్లీ, వాల్యూం 34. నం. 38. సెప్టెం బర్ 22, 1979. — మైరన్ వీనర్.

6 ఎకనామిక్ అండ్ పొలిటికల్ వీక్లీ, వాల్యూం 34. నం. 34. ఆగస్టు 25, 1979. — మనోరంజన్ మహంతి.

7 జర్నల్ ఆఫ్ హయ్యర్ ఎడ్యుకేషన్, వాల్యూం 4. నం. 1. మాన్‌సూన్. 1978. — డా. జి. హరగోపాల్ మరియు కె. జగన్నాధరావు

8 మేనేజ్‌మెంట్ ఆఫ్ రిసెర్చ్ ఇన్ యూనివర్సిటీస్. (ప్రచురితం కాని వ్యాసం) — ప్రొ. జి. రామ్‌రెడ్డి

9 రిసెర్చ్ ఏరియాస్ ఇన్ రూరల్ డెవలప్‌మెంట్ (ప్రచురితంకాని వ్యాసం) — డా. జి. హరగోపాల్.

10 సామాజికశాస్త్ర పరిశోధనలో నిష్ప క్షికత. (ప్రచురితంకాని వ్యాసం) — డా.కె.మురళీమనోహర్ మరియు కె. సీతారామరావు.

11 రిసెర్చ్ మెతడాలజీ అండ్ టెక్నిక్స్ — విల్‌కిల్‌సన్ అండ్ భండార్కర్

12 సృజన, సెప్టెంబర్ 1979. — సాహితీ మిత్రులు

13 ది ఎథిక్స్ ఆఫ్ ఎంక్వయిరీ ఇన్ సోషల్ సయిన్స్. — జె. ఇ. బార్‌న్స్.

14 ఐడియాలజీ ఇన్ సోషల్ సైన్స్. — రాబిన్ బ్లాక్‌బర్న్.

15 రిసెర్చ్, ఐడియాస్, అండ్ అకడమిక్ క్వాలిఫికేషన్స్, "ది హిందూ" దిన పత్రిక, జూన్ 10, 1980.

యల్. నీలకంఠశర్మ.

# అ ధో జ్ఞా పి క లు


1 "సామాజిక శాస్త్ర పరిశోధనలో — నిష్పాక్షికత" (ప్రచురితం కాని వ్యాసం.) డా. కె. మురళీ మనోహర్, కె. సీతరామ రావు—నుండి గ్రహించబడినది.

2 సృజన, సెప్టెంబర్ 1979, పుట 45.

3 జె. డి. బెర్నాల్, "సైన్స్ ఇన్ హిస్టరీ" సోషల్ సైన్స్ — కన్‌క్లూషన్, వాల్యూం 4. పుట 1020.

4 ఎన్‌సైక్లోపేడియా ఆఫ్ సోషల్ సైన్సెస్. నం. 14.

5 డా. జి. హరగోపాల్, "రిసెర్చ్ ఏరియాస్ ఇన్ రూరల్ డెవలప్‌మెంట్", ఏ పేపర్ ప్రసెంటెడ్ టు ది సింపోసియమ్ ఆన్ రూరల్ డెవలప్‌మెంట్ ఆర్గనైజ్‌డ్ బై ది లోకల్ బ్రాంచ్ ఆఫ్ ఐ.ఐ.పి.ఏ. వరంగల్. 13–5–78.

6 ప్రొ. కె. శేషాద్రి, "స్టడీస్ యిన్ మార్క్సిజమ్ అండ్ పొలిటికల్ సైన్స్", పుట 46–47. పీపుల్స్ పబ్లిషింగ్ హౌస్, న్యూఢిల్లీ.

7 వివరాలకు చూడుడు — జె. డి. బెర్నాల్, "సైన్స్ యిన్ హిస్టరీ" సోషల్ సైన్స్, కన్‌క్లూషన్, వాల్యూం 4. పుట 1030–1192.

8 వివిధ కాలాల్లో సామాజిక శాస్త్రాలను ప్రభావితం చేసిన సామాజిక ఆలోచన క్రమ వివరాలను క్లుప్తంగా జె. డి. బెర్నాల్ "సైన్స్ ఇన్ హిస్టరీ", సోషల్ సైన్సెస్ — కన్‌క్లూషన్, వాల్యూం 4. నుండి సంగ్రహించడం జరిగింది.

9 జె. డి. బెర్నాల్, సైన్స్ ఇన్ హిస్టరీ, సోషల్ సైన్స్ — కన్‌క్లూషన్, వాల్యూం 4. పుట 1035.

10 కె. శేషాద్రి, "స్టడీస్ ఇన్ మార్క్సిజమ్ అండ్ పొలిటికల్ సైన్స్", పుట 36. పీపుల్స్ పబ్లిషింగ్ హౌస్, న్యూ ఢిల్లీ.

11 వివరాలకు చూడుడు—జె. డి. బెర్నాల్, 'సైన్స్ ఇన్ హిస్టరీ.' సోషల్ సైన్సెస్ — కన్‌క్లూషన్. వాల్యూం4. పుట 1134

12 అదే పుట 1148.

13 అదే పుట 1180.

14 అదే పుట 1198.

15 మనోరంజన్ మహంతి, "సోషల్ సైన్సెస్ ఆన్ ఏ న్యూ ఫ్లాటింగ్", ఎకనామిక్ అండ్ పొలిటికల్ వీక్లీ, వాల్యూం 14, నం. 34, ఆగస్టు 25, 1978. పుట 1458.

15 ఏ వివరాలకు చూడుడు, మైరన్ వీనర్, "సోషల్ సైన్స్ రిసెర్చ్ అండ్ పబ్లిక్ పాలసీ" ఎకనామిక్ అండ్ పొలిటికల్ వీక్లీ. వాల్యూం 14. నం. 37. సెప్టెం. 15, 1979. పుట 1581–82.

16 అదే పుట 158.

17 ప్రొ. జి. రాంరెడ్డి, "మేనేజ్‌మెంట్ ఆఫ్ సోషల్ సైన్స్ రిసెర్చ్ ఇన్ యూనివర్శిటీస్" పుట 4. (ప్రచురితం కాని వ్యాసం).

18 డా. జి. హరగోపాల్ మరియు కె. జగన్నాథరావు. "ప్రాబ్లమ్స్ అండ్ పర్‌సెప్షన్స్ ఆఫ్ సోషల్ సైన్స్ టీచర్స్ యిన్ హైయ్యర్ ఎడ్యుకేషన్" జర్నల్ ఆఫ్ హైయ్యర్ ఎడ్యుకేషన్, వాల్యూం 4. నం. 1, మాన్‌సూన్ 1978. పుట 72.

19 వివరాలకు చూడుడు, మైరన్ వీనర్, "సోషల్ సైన్స్ రిసెర్చ్ అండ్ పబ్లిక్ పాలసీ" ఎకనామిక్ అండ్ పొలిటికల్ వీక్లీ, వాల్యూం 14. నం. 37. సెప్టెంబర్ 15, 1979. పుట 1586.

20 ప్రొ. జి. రాంరెడ్డి, "మేనేజ్‌మెంట్ ఆఫ్ రిసెర్చ్ యిన్ యూనివర్శిటీస్", పుట 11. (ప్రచురితం కాని వ్యాసం)

21 మైరన్ వీనర్, "సోషల్ సైన్స్ రిసెర్చ్ అండ్ పబ్లిక్ పాలసీ" ఎకనామిక్ అండ్ పొలిటికల్ వీక్లీ, వాల్యూం 14. సెప్టెంబర్ 22, 1979. పుట 1622.

22 ప్రొ. జి. రామ్‌రెడ్డి, "మేనేజ్‌మెంట్ ఆఫ్ రిసెర్చ్ యిన్ యూనివర్శిటీస్", పుట 8. (ప్రచురితం కాని వ్యాసం)


---

గమనిక: తర తరాలుగా ప్రపంచ వ్యాప్తంగా సామాజిక శాస్త్రాలను ప్రభావితం చేసిన, సామాజిక ఆలోచనలో ప్రముఖ పాత్రవహించిన విభిన్న అంశాలను, వాటిని ప్రతిపాదించిన రచయిత లందరినీ పరిణామ క్రమంగా, వరుస క్రమంగా వివరించడమ్లో ఈ వ్యాసంలో పూర్తి న్యాయం చేకూర్చలేకపోవచ్చు. ఎందుకంటే అలా వివరించినట్లయితే, వ్యాసం పెద్దదిగా మారి వ్యాస లక్ష్యం అసం పూర్తిగా మిగలవచ్చు. అందువల్ల ఈ అంశమును పాఠకులు గమనించవలసిందిగా రచయితలు అభ్యర్థిస్తున్నారు.



# ఆనందజలధి

మనస్సు మంథానమై ఆనందాన్ని చిలుకుతున్నది
యెదనంతా కాంతితో ఒత్తుగా అలుకుతున్నది,
నీ ముఖసంద్ర మెన్ని రత్నాలను
పుక్కిట పట్టుకున్నదో
కపోలాలు కాంతివర్షం కురుస్తున్నాయి,
ఈ దినమెంత పవిత్రమైనది
దీనిని కాలకుడ్యంపై రంగుల చిత్రంగా దిద్దుతా;
భాషకందక భావం పరుగెత్తుతూ
ఆధునిక చిత్రవిశేషమై నా ముందర నిలిచింది,
ఉప్పొంగే సముద్ర దృశ్యాన్ని నేనెప్పుడూ
చూడలేదు.

ఈరోజు నా మనస్సుతో పోల్చుకొని
తెలియని విషయాన్ని తెలుసుకుంటున్నా,
విరిగిపడే కెరటాల సమూహమే సముద్రమనుకున్నా,
ఒక్కొక్క కెరటంలో వేలచంద్రుల ప్రతిబింబాలు
దర్శనమిస్తున్నాయి

మీకెందుకింత ఉరవడియని సముద్రాల
నడిగితే ఏం చెబుతాయి
నీ హృదయంలో నిద్రిస్తున్న
సముద్రాలను తట్టిలేపి అడుగు
అవి మాత్రమే వ్యాఖ్యానించగలవు.

# తటిల్లత

ఏదో అవ్యక్త వేదనా శకలమ్ము
కల కలము రేపె హృదిలోన
నేత్ర లేఖిని ఆలపించె
నేదో విషాద రాగరసము,
మూగభావనతో పలుకరించెను
ఎచటినుండియో మృదు లాంగులీస్పర్శ,

రాని నావకై చూపు పాంథుడను కానునేను
అశ్రు బిందువు మెరుపులే
సందేశ మయ్యేనేమొ
రాగ ద్వంద్వమ్ము విహరించె నాకసమున.

పెన్నా శివరామకృష్ణ



# ఉజ్జ్వల భవిష్యత్తు వైపుగా ఆంధ్రప్రదేశ్



శ్రీమతి ఇందిరాగాంధి (ప్రధానమంత్రి)

[redacted] క కార్యక్రమాన్ని, కీ. శే. సంజయ్‌గాంధీ అయిదు అంశాల కార్యక్రమాన్ని పట్టుదలతో అమలుచేస్తూ ఆంధ్రప్రదేశ్ రజతోత్సవాలు జరుపుకుంటోంది.

సమర్థవంతమైన శ్రీ టి. అంజయ్య నాయకత్వంలో సామాన్యుల ప్రయోజనం కోసం, రైతులు, పారిశ్రామిక కార్మికులు, బలహీనవర్గాలవారిపట్ల ప్రత్యేక శ్రద్ధతో అనేక చర్యలు తీసుకున్నారు.



శ్రీ టి. అంజయ్య (ముఖ్యమంత్రి)

- ధాన్యం, జొన్న, వేరుశెనగ పంటలకు భీమా పథకం ఏర్పాటు.
- 65 సంవత్సరాలు దాటిన వ్యవసాయ కూలీలు, అనాథలకు పింఛను పథకం.
- బలహీనవర్గాలకు ఇళ్లు నిర్మించే పథకాలు.
- ఒక ఏడాదికి మించి ప్రభుత్వ భూములలో గుడిసెలు నిర్మించుకొని వుంటున్నవారిని తొలగించరాదని నిర్ణయం.
- అవినీతిని నిర్మూలించడానికి కృషి చేయడంద్వారా మంచిపరిపాలనను ప్రజలకందివ్వడం, 'లోక్‌ఆయుక్త' ఏర్పాటు చేసేందుకు శాసనం ప్రతిపాదన, అవినీతిని అరికట్టేందుకు సంచార బృందాలు ఏర్పాటు.

ఈ రజతోత్సవాల సందర్భంగా వివిధ రంగాలలో అభివృద్ధి కార్యక్రమాలు ముమ్మరంగా అమలుజరిపేందుకు ఒక్కొక్క నెలను కేటాయించారు.

| | | |
|---|---|---|
| జనవరి | ... | వ్యవసాయ భూములు |
| ఫిబ్రవరి | ... | రుణాలు |
| మార్చి | ... | గ్రామీణ విద్యుదీకరణ |
| ఏప్రిల్ | ... | కుటుంబ సంక్షేమం |
| మే | ... | కార్మికులు, చేతిపనివారు |
| జూన్ | ... | రైతుల సంక్షేమం |
| జూలై | ... | వనమహోత్సవం |
| ఆగస్టు | ... | చేనేత కార్మికులు |
| సెప్టెంబరు | ... | స్త్రీ, శిశు సంక్షేమం |
| అక్టోబరు | ... | యువజన సంక్షేమం |

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సమాచార, పౌరసంబంధశాఖచే ప్రకటితం.

DIPR No. 44603 Advt. CI-3/80

# నే పూల మొక్కను

సాంధ్యశ్రీ

ఎక్కడ
  గడిచిన దినాల వెనుకటి నీడలో
ఎన్ని స్మృతుల బలీయతా ఏకాంతం...?
ఎవరూ వినలేని
అనుభూతి రవళుల విపంచికా స్వరహేల
నా దేహం ఈరోజు ఒక వసంత వనజ్వాల –
ఇక్కడ ఈ కొండలమధ్య కోనిఫర్ వనాల గుండెలోతుల్లో
గులాబులు గుత్తులు కట్టిన లోయ ...
నాదేహం పూలుపూస్తున్నది చెలీ,... క్షణాల ఔదార్యంతో
క్షణం విలువ
విచ్చుకుంటున్న పూలరేకుల చివర ఆర్ద్రంగా మెరుస్తుంది ...
కాదంటే కన్నీరు పూవై పూస్తుంది, నా కాలిముందు నేలమీద...
ఎవరు ... ?
నిశ్శబ్దాన్ని నిట్టూర్పుల విరుపులతో మైలపడేస్తున్నది ... ?
ఎక్కడ ... ?
పూలు విరుస్తున్న చేతుల అమానుష కృత్యాల అభినివేశాలు ?
ఎవరా ముద్ద మందారాన్ని సిగలో తురుముకుంటున్న
కుటిలాలకాత్మ ? చెట్టై పూయటం చేతకాని నీకు చేతులెలావచ్చాయి
పూచిన పూలను తుంచటానికి ? చెట్టు త్యాగాన్ని చంపటానికి... ?
అవస్థలతో అవస్థపడుతూ–రుజాగ్రస్థమయ్యే అనాకారిదేహం
కోసం —
తలపుల చివురాకుల గుత్తులు తప్ప చిగిర్చని తరుణాత్మని చంపుకుంటావా
నువ్వేం మనిషివి ... ?

~~~~
~~~~

డా. చెళ్ళపిళ్ళ సోమసుందరరావు        శ్రీ కొల్లూరు సూర్యనారాయణ

# ముదిగొండ చాళుక్యుల కాలనిర్ణయము

తెలుగు కన్నడదేశములను మూడుపూవు లారుకాయలుగా పాలించి, సాహితీ సాంస్కృతిక రంగములందు కీర్తిబావుటా లెగురవైచి, సమకాలీన పాలకవంశములందు గణుతికెక్కిన రాజవ్య చూడామణులు చాళుక్యులు. కన్నడసీమనుండి తెలుగునాటికి తరలివచ్చి వీరు ఆంధ్రావని నాలుగు చెరగుల సమయానుకూలముగా చొచ్చుకొనిపోయి రాజ్యము లేర్పరచుకొని చరిత్రను సృష్టించి తత్ప్రాంత చరిత్రలో భాగమైరి. ఇట్లేర్పడిన శాఖలలో నొక ముఖ్యమైన శాఖ ముదిగొండ చాళుక్య వంశము. వేంగీ చాళుక్యశాఖవలెగాక యీ ముదిగొండ చాళుక్య శాఖ ఎప్పుడు ఎవరితో నారంభమయ్యెనో చెప్పుట కష్టము. కాని లభ్యమగు వీరి శాసనాధారములలో ప్రాచీన మనదగు కొరవి శిలాశాసనమునందే[1] నాటికి మరికొన్ని ముందుతరములు ప్రస్తావింపబడుటనుబట్టి యీ వంశము సుమారు ఎనిమిదవ శతాబ్ది చివరికాలమున నారంభమైయుండునని చెప్పగలము. ముదుగొండవారు తొలి ఆవాసముగా కల్గిన వంశనుగుటచే నిది ముదిగొండ చాళుక్య వంశముగా పేర్కొనబడుచున్నది. ఆనాటి ముదుగొండ నేడు ఖమ్మం ప్రాంతములలో నున్న ముదిగొండగా గుర్తింపబడినది.

ఈ ముదిగొండ చాళుక్యులను గూర్చి కొద్ది కాలము క్రిందటనే బ్రాహ్మశ్రీ పుచ్చా పర్రబ్రహ్మశాస్త్రిగారు కూలంకషముగా 'భారతి'లో చర్చించి,[2] యిప్పటివరకును లభ్యమైన శాసనను లాధారముగా వీరి వంశ చరిత్రను, ఆనాటి పరిస్థితులను వెలుగులోనికి తెచ్చిరి. చారిత్రక జిజ్ఞాసువులుగా తొలుత వారి కృషికి మా కృతజ్ఞత. కాని వీరు శాసనములందు లభ్యమగు వంశములను మేళవించి, యొక వంశానుక్రమణికను నిర్మించుటలో కృతకృత్యులైరి గాని యేలనో కాల నిర్ణయము చేయక విడిచిపెట్టిరి. ఇట్లు కాలనిర్ణయము చేయక వంశానుక్రమణికను నిర్మించుట సహేతుక నిరూపణము కానందున ప్రామాణికము కాజాలదు. ఈ వంశీయుల శాసనములు చాలవరకు దత్తకాలములు పేర్కొననివగుటచే వీరి విషయమున కాలనిరూపణ జటిల కార్యమగుట వాస్తవమే. కాని అది జరుగనిదే, దానికనుగుణము కానిదే, యేవంశానుక్రమణికయు నిర్ధారితముకాదు. శ్రీ శాస్త్రిగారి నిరూపణలో వ్యక్తుల గుర్తింపు నిరాధారముగా సాగి సమకాలీన రాజకీయ సంబంధములకు, యితర శాసనములందు పేర్కొనబడిన కాలములకు పొత్తు కుదురని విధముగా నున్నది. కావుననే పునఃపరిశీలన యవసరమని భావింపబడినది. ఈ వ్యాసమునందు ముఖ్యముగా కాలనిర్ణయము చర్చింపబడుచు చారిత్రకాంశముల యవగాహనకై వలయు వివరములు తెలుపబడినవి. ముమ్ముందు యితరాధారములు బయల్వెడలినచో గణనీయమగు మార్పులు ప్రతిపాదింపబడవచ్చును. ఇప్పటికి లభ్యమైన శాసనాంశములను సమకాలీన వ్యక్తవివరములతో సమీక్షించి సరియగు ముదిగొండ చాళుక్యుల వంశ, కాలాను క్రమణికను నిర్మింపబోవుటయే యిచట మా ప్రధానోద్దేశ్యము.

## చారిత్రకాధారములు

ముందుగా ముదిగొండ చాళుక్యుల వంశ వివరములనుగూర్చి తెలుపు చారిత్రకాధారములను పరిశీలింపవలసియున్నది. వీనిని శ్రీ పర్రబ్రహ్మశాస్త్రిగారు తమ వ్యాసమునందు పేర్కొనినను, అందుకల భిన్నాభిప్రాయములను సమగ్రముగా చర్చింపక పోవుటచే వానినిచట సమీక్షించుట యవసరమని భావించి సూక్ష్మముగా పేర్కొనుచున్నాము.

ముదిగొండ చాళుక్యుల చరిత్రను తెల్పు శాసనములసంఖ్య చాల తక్కువ. కొరవి, చెన్నూరు, నారాయణగిరి, సత్తరామేశ్వరము, శ్రీకాకుళమునందలి శిలాశాసనములు, మొగలు చెఱువుల, క్రివ్వక తామ్రశాసనములు, వీరిచ్చినట్టివి. ఇవికాక చాళుక్యభీముని బెజవాడ తామ్రశాసనము, ధిరియాల మల్లని గూడూరు శాసనము, రేచెర్ల రుద్రసేనాని పాలంపేట శాసనము వీరి వివరములను తెలుసుకొనుటలో తోడ్పడగలవు. వీనిని వేర్వేరుగా పరిశీలింతము.

## కొరవి శిలాశాసనము[3]

ఇదియొక కీలకమగు రాజకీయాంశములను నిక్షిప్తమొనరించుకొనిన అస్పష్టశాసనము. వరంగల్లుజిల్లా, మానుకోట తాలూకా, కొరవి గ్రామమున రెండు వేర్వేరు శిలాఖండములపై లభ్యమైనది. నూటనాలుగు పంక్తుల పాఠముకల్గిన యీ శాసనమున చివరి 'వ్యాసగీతి' తప్ప మిగిలిన భాగమంతయు ప్రాచీన తెలుగు వచనమున వ్రాయబడినది. శాసనమున కాలము పేర్కొనబడకపోయినను, శాసనస్థ విషయములు చాళుక్య భీముని కాలమునకు సంబంధించినవగుటచే కొంత గ్రహింప వీలగుచున్నది. రణమర్దాన్వయ కుల తిలకుడైన కుసుమాయుధుడు కన్నర బల్లహున కస్త ప్రాప్తంబైన రణమర్ద కంతియము తన భుజవీర్య బలపరాక్రమములచే సాధించి దెచ్చి,

చాళుక్య భీముని కలంకరించి, పట్టాభిషిక్తు నిజేపి, ఖడ్గ సహాయుడై మంచికొండ నాడాదిగా వేంగీ దేశమును వానితో కలసి పాలించుచుండెను. ఈ కుసుమాయుధుని యనంతర మాతని పెద్ద కొడుకు, గొణగయ్య లేక అనుంగు గొణగ డను నాతడు, అనేక రిపు నృపతి మణిమకుట మకరికాక్షణ నిశిత చరణుడైనవాడు, తన తండ్రివలెనే చాళుక్య భీమునితో కలసి రాజ్యముచేయుచు యిష్ట విషయ కామభోగముల ననుభవించుచుండెను. అతడొకనాడు కొరవి నల్లమేళయ కొడుకైన పెద్దనను రావించి, "నీవు నా ప్రాణ సమానుండవైన చెలివి. నీవు చేసిన యుపకారమునకు ప్రత్యుపకారము చేయవలసియున్నది. కావున నీకేమి కావలయునో వేడుకొనుము" అనెను. దాని కాతడు, "నీ శ్రీలెల్ల మాకుండినల్లే, ఏమి వేడుకొందుము! అయినను పరోపకారంబు కావలెను. కొరవి యున్నది ముదిగొండ నల్కుల కులనంతి......" అని పల్కెను. ఇచ్చట శాసన పంక్తులు శిథిలమై మిగిలిన వివరములు తెలియరాలేదు. తర్వాత భాగమున సంతానగెళ్ళ శ్రీనిరవద్యుడు అనేక సమర సంఘట్టన భుజాసీ భాసురుడై, తమ యన్న రాజ్యశ్రీకెల్ల దానె యర్హుడై చేకొని చాళుక్యభీమునిచే అనేక వస్తువాహనోత్సవంబులు పడయుచున్నట్లు చెప్పబడినది. ఈతడే తను యన్న గొణగయ్య చేసిన ధర్మములను కాచి రక్షింపవలెనని కొరవికిచ్చిన స్థితి పల్లి శిలాస్తంభమెత్తించెను. భీమేశ్వరున కొక ఆలయము నిర్మించి తటాకమునను త్రవ్వించెను. మిగిలిన శాసన భాగమున వివిధములగు దండనలు, పన్నులు, హక్కులనుగూర్చి ప్రకటింపబడెను. ఇదియె కొరవి శిలాశాసనమున లభ్యమగు విషయము. దీనినిబట్టి వీరి వంశ మీవిధముగా నేర్పరుప దగియున్నది.




## మొగలు చెఱువుల తామ్రశాసనము[4]

ఇది ముదిగొండ చాళుక్యుడైన యొక కుసుమాయుధుని శాసనము. కుత్సిత గోత్రజుడైన దోనెయశర్మకు సర్వకర పరిహారముగా నుత్తరాయణ సంక్రాంతి నిమిత్తమున మంచికొండ విషయములోని మొగలుచెఱువుల గ్రామమును దానమిచ్చుట యిందలి విషయము. ఇందును దత్తకాలము చెప్పబడలేదు. డెబ్బది అయిదు పంక్తులుగల యీ శాసనము సంస్కృత భాషలో కలదు. దీనిని ప్రకటించిన ప్రొఫెసరు సి. ఛెండాలు యిందలి లిపినిబట్టి దీనిని సుమారులో పదునొకండవ శతాబ్దికి చెందు దానినిగా భావించినాడు.[5] ఇందలి దాన విషయముకన్నను, ప్రస్తుత పరిశీలన కావశ్యకమైన వీరి వంశవివరమీ శాసనమందిట్లీయబడినది —




## చెన్నూరు శిలాశాసనము[6]

తెలంగాణమునందలి నిజామాబాద్ జిల్లాలోని చెన్నూరు గ్రామమున, అగస్త్యేశ్వరాలయమున నీ శాసనముకలదు. ఇది శకసం॥ 863 ప్రాంతమున, అనగా క్రీ॥ శ॥ 941వ సం॥న చాళుక్య గొణగరసుని కుమారుడైన బద్దెగుడు పాదనవాడులో (బోధననాడు) నొక యగ్రహారమును దానమొసగినట్లు తెల్పునది. ఈ దాన సమయమునకు బద్దెగుడు వేములవాడ చాళుక్యాధిపతియైన అరికేసరి యాధిపత్యమున యీ ప్రాంతములనేలుచున్నట్లు తెలియుచున్నది. ఈ బద్దెగనామము అరికేసరి పూర్వీకుడైన సోలదగండ బద్దెగునినుండి గ్రహింపబడినట్లు తలపవచ్చును. క్రీ॥ శ॥ 850–895ల మధ్యపాలించిన యీ సోలద గండ బద్దెగుడు ప్రథమ చాళుక్యభీముని అంబు సమరమున నిలువరించిన వీరుడగుటచే తత్సమయమున వీరి సామంతుడుగాయున్న గొణగడు తన కుమారున కాతని పేరిడియుండును. తన తండ్రి కుసుమాయుధుని యనంతరము చాళుక్యభీముని సహచరునిగా కొంత కాలమీతడు గడపినట్లు పై కొరవి శిలాశాసనము పేర్కొనుచున్నది. కాని అప్పటి రాజకీయ రంగమున నేర్పడిన యొక క్లిష్టపరిస్థితిలో యీతడు చాళుక్యభీముని అనుగ్రహమునకు దూరమై వేములవాడ చాళుక్యులయండ చేరినట్లు భావించుట కవకాశ మేర్పడుచున్నది. ఈ శాసనమునుబట్టి గొణగని రాజకీయ జీవనమున నేర్పడిన అనూహ్య పరిణామమును, యీతని కుమారుడైన బద్దెగుని పాలనమును తెలియుచున్నవి.

## నారాయణగిరి శిలాశాసనము[7]

వరంగల్లు తాలూకాలోని నారాయణగిరి గ్రామమున యీ కన్నడ శాసనము కలదు. శకాబ్దము 927 అనగా క్రీ॥ శ॥ 1004 సం॥న యివ్వబడిన యిది యొక చాళుక్య వంశీయుడైన గొణగరసుని పేర్కొనుచున్నది. "మహాసామంతాధిపతి సత్యాశ్రయ

కులాన్వయ శ్రీమత్ గుణగరన..." అని చెప్పబడినది. దీనినిబట్టి క్రీ॥ శ॥ 1004 సం॥ ప్రాంతమున చాళుక్య రాజుగా నొక గొణగ డుండినట్లు తెలియుచున్నది.

## క్రివ్వక తామ్రశాసనము[9]

భద్రాచలమున లభ్యమైన యీ శాసనము గతములో 'కుసుమాదిత్యుని కుకనూరు తామ్రపట్టికలు'గా ప్రకటింపబడినను,[9] మరి కొన్ని క్రొత్త విషయములు లభ్యమగుటచే శ్రీ పరబ్రహ్మశాస్త్రిగారు మరల కొద్ది నెలల క్రిందటనే 'చాళుక్య కుసుమాదిత్యుని క్రివ్వక తామ్రశాసనము'ను పేరిట 'భారతి'లో ప్రకటించిరి. శాసనకాలము పేర్కొనబడక పోయినను, లిపి భాషాదికములనుబట్టి క్రీ॥ శ॥ 12వ శతాబ్దికి చెందిన దానినిగా గుర్తించిరి. చాళుక్య కుసుమాదిత్యుడు దానకర్త. పాల్వంచ తాలూకాలోని 'క్రివ్వక' గ్రామము దానవస్తువు. శ్రీకరణాధిపతియగు ఇందపరాజును, అతని తమ్ముడైన రేమరాజును దాన గ్రహీతలు. కుసుమాదిత్యుని ప్రథమ రాజ్యకాలమున భూమి ప్రఘట్టంబు పుట్టగా, బొట్టున వాని ప్రధానులైన పై దానగ్రహీతలు సమస్త వస్తు వాహనంబులలో నీ కుసుమాదిత్యుని పరసున్డా లాభిముఖంబుగా తోడ్కొనిపోయి అడవులందు కందమూలములతో పన్నెండేండ్లుగడిపి, చివరకు శౌర్యపరాక్రమములతో తిరిగి విజదేశమైన విసురునాడు ప్రవేశింపజేసి రాజ్యమేలించిరి. తమకు కార్య ఖడ్గ సహాయులై రాజ్యప్రాప్తికి తోడ్పడిన యమాత్యులైనందున, వారికి కృతజ్ఞతా పూర్వకముగా కుసుమాదిత్యుడీ దానము సమర్పించెను. వీరి వంశక్రమమీ శాసనమున యిట్లు పేర్కొనబడినది.




—ఇందు తొలిరాజు 'కొరవిపురవల్లభు'నిగా చెప్పబడుటచేతను, చాళుక్యాన్వయులగుటచేతను యిందు తెల్పబడిన ఎనమండుగురు రాజులను ముదిగొండ చాళుక్య వంశజులే యనుట నిస్సంశయము.

## నత్తరామేశ్వర శిలాశాసనము[10]

నత్త రామేశ్వర శిలాశాసనము ముదిగొండ చాళుక్యుల అవసానదశను గూర్చి తెలుసుకొనుట కుపయోగపడుచున్నది. శక సం॥ 1140 అనగా క్రీ॥ శ॥ 1218లో బొట్టు నాగతిరాజొసంగిన దాన వివరములిందు తెల్పబడినవి. ఈ శాసనమునుబట్టి యితడు చివరి దశలో కొలని మండలమునకుజేరి యచటి ప్రభువున కనుయాయుడై మెలగినట్లు తెలియుచున్నది.

## శ్రీకాకుళ శిలాశాసనము[11]

ఇది కృష్ణాజిల్లా శ్రీకాకుళమునందలి గోపాలదేవుని యాలయమున బొట్టు శ్రీరామభద్రునిచే నొసగబడిన దానశాసనము. మావవ్యస గోత్రజుడైన యీతడు వినీత జనాశ్రయుడు, మార్జానలకేసరి (మార్బలకేసరి?) కొరవిపుర వరాధీశుడు అని కీర్తింపబడెను. శాసన కాలము పేర్కొనబడకపోయినను యిదియే ముదిగొండ చాళుక్యులను గూర్చి తెల్పు తుది శాసనము కానోవును. దీనినిబట్టి కొరవి పురాధీశులు తర్వాతి కాలమునకు తీరాంధ్రమునకు వలసవచ్చి స్థిరపడినట్లు చెప్పుటకు వీలుకలుగుచున్నది.

ఈ శాసనములందు మాత్రమేగాక, యీ వంశీయులకు సమకాలీనులైన వేములవాడ చాళుక్యులలో ప్రముఖుడైన రెండవ అరికేసరి యాస్థానకవి పంపడు రచించిన 'విక్రమార్జున విజయము'నందు కూడ వీరి వివరము కొద్దిగా లభ్యమగుచున్నది.[12] ఒక సందర్భమున రాష్ట్రకూట గోవిందుని యాగ్రహమునకు గురియైన విజయాదిత్యుడు అరికేసరిని శరణు జొచ్చగా యాతనికి శరణమిచ్చిన విషయమందు ప్రస్తావింపబడినది. ఈ విషయము వాస్తవమనుటలో సందియములేదు. దీనియందేగాక అరికేసరి వేములవాడ శిలాశాసనమున కూడ "శరణము పగతో రక్షితోయేన బిజ్జః" అనియుండి యీ అంశమును ధృవపఱచుచున్నది.[13] ఈవిధముగా వేంగీ, వేములవాడ చాళుక్య వంశములతోడను, రాష్ట్రకూట, కాకతీయ, కొలను పాలకులతోడను యీ ముదిగొండ చాళుక్యుల చరిత్ర ముడివడియున్నది. ప్రస్తుతమునకీ ఆధారములతోడనే వీరి వంశ, కాలాను క్రమణికలను నిర్మింపవలసియువ్నది.

కడపటి దశకు చెందిన శ్రీకాకుళ శాసనపు బొట్టు శ్రీరామభద్రరాజును విడిచిపెట్టినచో, మొగలు చెఱువుల, క్రివ్వక తామ్ర శాసనములందు పేర్కొనబడినట్లు యీ వంశస్థులు మొత్తము పదునాల్గు తరములవారు కన్పించుచున్నారు. వీరిలో పరబ్రహ్మశాస్త్రి గారూహించినట్లు నిజ్జయరాజు, అతని కుమారుడు కుసుమాయుధుడు రెండింటిలో నొక్కరే యనుకొన్నచో పన్నెండు తరములవారు మిగిలెదరు. శాస్త్రిగారు యీ పన్నెండు తరములలో కొక్కిలి, కరియ

గొనగులను కలిపి పదునాలుగురు పాలకులున్నట్లు భావించి వీరి వంశమునిట్లు తెల్పినారు.[14]




—ఈ వంశానుక్రమణికయందు పొరపాటున కొందరు పాలకుల విషయము ప్రస్తావింపబడలేదు. చెన్నూరు శాసనమునందు చెప్పబడిన గొణగుని కుమారుడైన బద్దెగుని స్థానముగాని, విరియాల మల్లని గూడూరు శాసనమున[15] పేర్కొనబడిన బొట్టుబేతని స్థానముకాని యిందు కానరావు. ఇవియేకాక దీనియందు అంగీకరించుట కలవికాని యంశములు కొన్ని కలవు. అవి వీరి వీరి కాలములకు, సమకాలీన రాజకీయ చరిత్రలకు సంబంధించినట్టివి. కాల నిర్ణయము సక్రమముగా తేలినచో యిందలి పొరపాటు తెలియగలదు.

వీరి వంశకాలాదులు చర్చించుటకుముందు కొరవి శిలా శాసనవిషయము కొంత ప్రస్తావింపవలసియున్నది. ఇందు పేర్కొనబడిన కుసుమాయుధ, గొణగ, నిరవద్యులు ఏ స్థానముల వాక్రమించెదరో తేలినగాని వీరి వంశ నిరూపణ సాధ్యపడదు. ఇదిగాక యిందు ప్రస్తావింపబడిన చాళుక్య భీములెందరనునది ముఖ్యమైన ప్రశ్న. కుసుమాయుధుడు కన్నరబల్లహుని కస్తప్రాప్తంబైన కంఠికను రణమున గొనితెచ్చి యలంకరించిన చాళుక్యభీముడు నిస్సందేహముగా గుణగ విజయాదిత్యుని యనంతరము సింహాసన మధిష్ఠించి, క్రీ॥శ॥ 892–922 సం॥ల మధ్య రాజ్యమేలిన ప్రథమ చాళుక్యభీముడే.[16] కుసుమాయుధుని పెద్దకొడుకైన బిజయిత గొణగుని రాజ్యకాలమందు వేంగీ సామ్రాజ్యాధిపతిగానుండినదియు నీ చాళుక్యభీముడే. తరువాత కారణాంతరములచే గొణగుడు పదభ్రష్టుడై పోగా నిరవద్యుని యా ప్రాంతమున కధిపతిగా నియమించి యనేక వస్తువాహనోత్సవము లొసగినదియు నీ ప్రథమ చాళుక్యభీముడే. శ్రీ శాస్త్రిగారు యీ శాసనమునందలి చాళుక్యభీముల నిరువురిగా తలచి, కుసుమాయుధ గొణగ బిజయితల కాలమున నున్నది ప్రథమ చాళుక్యభీముడనియు, నిరవద్యుని కాలమున నున్నది ద్వితీయ చాళుక్యభీముడనియు భావించిరి. వారట్లు భావించుటకు కారణము కాలనిర్ణయము కుదురకపోవుటయే. పై బిజయిత గొణగునికాలము సుమారులో క్రీ॥ శ॥ 915–940 మధ్య నుండవచ్చునని శ్రీ నేలటూరి వేంకటరమణయ్యగారు చెప్పటయే[17] యిందు రెండవ చాళుక్యభీముడు ప్రస్తావింపబడెనను యుపోహకు కారణము కావచ్చును. కాని వాస్తవమున కిందు ప్రస్తావింపబడినది ప్రథమ చాళుక్యభీముడొక్కడే. అందుచేతనే శౌచకందర్ప, వేంగీశ్వర, విష్ణువర్ధన బిరుదములు మాత్రమే పేర్కొనబడినవి గాని రెండవ చాళుక్యభీముని గండమహేంద్ర, రాజమార్తాండ, బిరుదము లెక్కడను చెప్పబడలేదు. చాళుక్యులకు 'సల్కు'లని ప్రయోగించుట యీ శాసనమున మరియొకచో గూడ కానరాదు. అదియును కాక నిరవద్యుడు దీనిని రెండవ చాళుక్యభీముని కాలమున నిచ్చినట్లైన, పూర్వీకుడైన ప్రథమచాళుక్య భీమునకు బిరుదములు చేర్చి, ఆనాటి ప్రభువైన ద్వితీయ చాళుక్యభీమున కెట్టి ప్రశంసయు చేయక మానడు. తప్పక బిరుదావళినంతను పేర్కొనియుండును. కనుక కొరవి శిలాశాసనమందు పేర్కొనబడిన చాళుక్యభీము డొక్కడే అనియు, అతడే ప్రథమ చాళుక్య భీముడనుటయు నిస్సందేహము, నిశ్చయము.[18] —ఈతని రాజ్యకాలమందే ముదిగొండ చాళుక్య వంశములోని దానకర్తలగు తొలిరాజులు ప్రథమముగా కన్పించుచున్నారు.

ఈ తొలి రాజుల కాల నిర్ణయమునకు స్పష్టమగు, నిరాక్షేపణీయమగు నాధారములులేవు. ఇటువంటి పరిస్థితిలో వెనుక తరముల నుండి, వారి కాలము తెలిసిన యెడల అచటి నుండి, ముందునకు లెక్కించుకొని రావలెను. ఇట్లయిన తప్ప కాల నిర్ణయమున కొక పద్ధతి యేర్పడదు.

క్రివ్వక తామ్ర శాసనము వీరి వంశ చరిత్రను తెల్పు తామ్రశాసనములలో చివరిది. ఇందు కాలము పేర్కొనబడకపోయినను లిపిని బట్టి సుమారు క్రీ॥ శ॥ 12వ శతాబ్ద్యాంతమునకు చెందినదిగా గుర్తింపబడినది. ఇందు చివరగా పేర్కొనబడిన బొట్టు కుసుమాదిత్య, బొట్టు నాగతి రాజులు సోదరులు. క్రివ్వక శాసనకర్త యీ కుసుమాదిత్యుడే. నాగతిరాజు వివరములిందు హెచ్చుగా తెల్పబడలేదు.

కాని రేచెర్ల రుద్రుని పాలంపేట శాసనమం దీతని విషయము ప్రస్తావింపబడినది.[19] గణపతిదేవ చక్రవర్తి రాచరికమునకు రాకపూర్వము, అనగా సుమారు క్రీ॥ శ॥ 1198 సం॥ ప్రాంతములో నాగతి భూపాలుడు రేచెర్ల రుద్రునకు భయపడి పారిపోయినట్లందు

తెల్పబడినది. ఈ పాలంపేట శాసనము క్రీ॥శ॥ 1213 సం॥నాటిది. కాని అందు ప్రస్తావింపబడిన నాగతిరాజు పరాజయము క్రీ॥శ॥ 1198 నాటిది. ఈ శాసనము కాక క్రీ॥శ॥ 1218 సం॥ నందలి నత్త రామేశ్వర శాసనము సంధి నాగలి యొక్క దాన విషయము పేర్కొనబడినది. ఈ రెండు శాసనములును ముదిగొండ చాళుక్యుల కాల నిర్ణయము చేయుటకు మూలాధారములు. పైన పేర్కొనినట్లు వీరి యితర శాసనము లేవియు కాలమును పేర్కొనని వగుటచే చివరి కాలమునకు చెందిన యీ అంశముల నాధారము చేసికొనియే వీరి కాల నిర్ణయము చేయవలసియున్నది. దీనికితోడు యితరత్రా ద్యోతకమగు ఆధారములను పరిగణనకు తీసుకొనవలెను. మొదటి కుసుమాదిత్య, గొణగ బిజయిత, నిరవద్యులకు సమకాలికునిగా ప్రథమచాళుక్య భీముని కొరవి శాసనము పేర్కొనుచున్నది. అరికేసరి వేములవాడ శాసనమందును, పంపని "విక్రమార్జున విజయము" నందును అరికేసరికి సమకాలికునిగా నొక విజయాదిత్యుడు చెప్పబడినాడు. ఒకపరి చరిత్రకారు లితనిని ముదిగొండ చాళుక్య వంశీయుడు కాదని భ్రమించినను,[20] వాస్తవము గుర్తించి యిప్పుడు యీ వంశమునకు చెందినవాడే యగునని ధృవపరచినారు. ఈ విషయముల నన్వయించుకొనుచు, దీనికితోడు గూడూరు శాసనమునందు ప్రస్తావింపబడిన బొట్టు బేతరాజు స్థానమును యీ వంశమందు గుర్తింపవలెను. ఈ గూడూరు శాసనము క్రీ॥శ॥ 1124 నాటిది. కాని ఇందు పేర్కొనబడిన బొట్టు బేతరాజు వృత్తాంతము నాటికి మూడు తరముల వెనుకటిది; యీ శాసనకర్త సమకాలికుడైన రెండవ కాకతి ప్రోలరాజు ముత్తాత చిన్ననాటిది. కనుక యిందలి బొట్టు బేతరాజు క్రీ॥శ॥ 1000 ప్రాంతమున కొరవి రాజ్యము నేలుచున్నట్లు సమర్థించవలెను.[21] ఈ అంశముల నన్నింటిని పరిశీలించి ముదిగొండ చాళుక్యుల వంశ, కాలానుక్రమణికను నిర్మించవలెను.

పాలంపేట, నత్త రామేశ్వర శాసనములు పేర్కొనుటనుబట్టి నాగతిరాజు క్రీ॥శ॥ 1198 లేక క్రీ॥శ॥ 1200 సం॥ ప్రాంతమునందు పాలించు చున్నట్లు చెప్పుటకెట్టి యభ్యంతరము నుండదు. నీని నాధారముగా కాలమును వెనుకకు లెక్క చూచుకొనుచు ప్రతి తరమునకు, ఆ తరము నందలి వివిధ పాలకులకు కాల నిర్ణయము చేయవలసియున్నది. క్రీ॥శ॥ 1004 లోని నారాయణగిరి శాసనమునందు పేర్కొనబడిన గుణగయ్య నుండి లెక్క చూచుకొనినచో సుమారు రెండు వందల సంవత్సరములకు నాగతిరాజు పాలనవచ్చును. ఈ గొణగయ్యయే క్రివ్వక శాసనమున చెప్పబడిన కరియ గొనగడని భావించుట కభ్యంతరము లేనియెడల, యీ రెండు వందల సంవత్సరముల కాలములోను ఎనమండుగురు రాజుల పాలనచెప్పవలెను. అట్లు చెప్పినచో క్రివ్వక శాసనము నందలి ఎనమండుగురు పాలకుల పాలన కాల మిట్లుండును —

| | | క్రీ॥ శ॥ |
|---|---|---|
| గొణగుడు (లేక కరియ గొనగుడు) | — | 1000–1025 |
| నిజ్జయ రాజు | — | 1025–1050 |
| నాల్గవ కుసుమాయుధుడు | - | 1050–1075 |
| బేతరాజు | - | 1075–1100 |
| ఐదవ కుసుమాయుధుడు | - | 1100–1125 |
| బొట్టు బేతరాజు | - | 1125–1150 |
| ఆరవ కుసుమాయుధుడు | - | 1150–1175 |
| నాగతి రాజు | - | 1175–1200 (లేక 1218) |

— వీరి పాలనకాలము లిట్లు చెప్పుట వలన మూడు విషయములు పరిపడుచున్నవి. పాలంపేట, నత్త రామేశ్వర శాసనము లందు పేర్కొనబడినట్లు నాగతిరాజు క్రీ॥శ॥ 1200 సం॥ ప్రాంతమున పరిపాలించుచున్నాడు. నారాయణగిరి శాసనమున ప్రస్తావింపబడినట్లు గొణగడు క్రీ॥శ॥ 1004 నాటికి పాలకుడుగా కన్పడుచున్నాడు. మొగలు చెఱువుల శాసనపు లిపి పదునొకండవ శతాబ్ది నాటిదిగా ప్రొ॥ బెండాలు భావించినట్లే తత్కర్తయైన నాల్గవ కుసుమాయుధుడు క్రీ॥శ॥ 1050–1075 సం॥ మధ్య సరిపడినాడు. కనుక యిది నిర్దుష్టమును, ఆమోదయోగ్యమునైన కాలనిర్ణయము. దీనిని బట్టి క్రివ్వక శాసనస్థుడైన కరియ గొణగుడును, నారాయణ గిరి శాసనము లందలి గొణగుడును నొక్కరే యనుట కవకాశ మేర్పడుచున్నది.

శ్రీ పరబ్రహ్మశాస్త్రిగారు క్రివ్వక శాసనములోని కరియ గొణగుడు, కొరవి శాసనము నందలి గొణగయ్యగా భావించి క్రీ॥శ॥ 934 నాటి వాడైన యీతనితో క్రీ॥శ॥ 1004నాటి వాడైన నారాయణగిరి శాసనపు గొణగుని ముడిపెట్టుట యనుచితమని భావించి, చాళుక్యుడే అయినను, యీ ప్రాంతమునందే కానవచ్చినను, నామ సాదృశ్యమున్నను, యీ నారాయణగిరి గొణగుని వేరు వంశస్థునిగా అభిప్రాయపడిరి. కాని కొరవి శాసనము నందలి గొణగయ్యను క్రివ్వక శాసనము నందలి కరియ గొణగనిగా భావించుట కెట్టి ఆధారమును లేదు. కొరవి శాసన మందలి గొణగడే క్రివ్వక శాసన మందలి గొణగుడని భావించినచో రెండింటి యందును వీరి సోదరులుగా చెప్పబడిన నిరవద్య, నిజ్జయ రాజులను ఒక్కరుగనే గుర్తింపవలసి వచ్చుచున్నది. ఇట్లు గుర్తించియే శ్రీ శాస్త్రిగారు మూడవ కుసుమాయుధుడే వేంగీశ్వరుడైన చాళుక్య గుణగ విజయాదిత్యుని సామంతుడైయుండి తర్వాత ప్రథమ చాళుక్య భీముని అనుచరుడై కొరవి శాసనమున వర్ణితుడైనట్లభిప్రాయ పడినారు. కాని అది పొరపాటు. ఏ కుసుమాయుధుడు ప్రథమ చాళుక్య భీమునకు సమకాలికుడో కాల నిర్ణయము బట్టియే తేలగలదు. ప్రథమ చాళుక్య భీముని తోడి కుసుమాయుధుని సమకాలీనత కొరవి శాసనమునందే బుజువైనది. బెజవాడ తామ్ర పట్టిక ననుసరించి[22] యీ చాళుక్య భీముని సింహాసనాధీశుని చేయు కృషిలో యీ కుసుమాయుధుని హస్తము కలదు. కనుకనే "శ్రీ కుసుమాయుధేన గుణి నా విద్వజ్జనా నన్దనః" అని వర్ణింపబడినాడు. రాష్ట్రకూట కృష్ణున కస్త్రప్రాప్యంబైన ప్రాంతములను

తిరిగి స్వాధీనపరచుకొనిన భుజ వీర్య పరాక్రము డీతడే. కొరవి శిలా శాసనమును బట్టి చాళుక్య భీముని పట్టాభిషేకమైన అతికొద్ది కాల మునకే యీతడు మరణించినట్లు తోచును. క్రీ॥ శ॥ 895 సం॥ ప్రాంతములలో నీతడు మరణించి యుండును. ఈతని తర్వాత రాజ్య మునకు వచ్చినది యీతని జ్యేష్ఠపుత్రుడైన గొణగుడు. ఈతనినే కరియ గొణగడని శాస్త్రిగారు పేర్కొనిరి. అది సమంజసమని నమ్మి నచో యీ గొణగుని నుండి నాగతిరాజు వరకునున్న ఆరు తరములలో ఎనమండుగురు పాలకులు మాత్రమే కానవచ్చుచున్నారు. గొణగుడు, తండ్రి యనంతరము క్రీ॥శ॥ 895లో సింహాసన మధిష్ఠించుటయు, నాగతిరాజు క్రీ॥శ॥ 1200 ప్రాంతముల నుండుటయు నిస్సంశయము లయిన విషయములు. వీరి మధ్యకల అంతరము (క్రీ॥ శ॥ 1200–895) = 305 సంవత్సరములు. తరములు చూచిన ఉన్నవి ఆరు మాత్రమే. రాజకీయ అస్థిరత కాలవాలమైన యీ కాలమున ఆరు తరముల రాజులును, యీ మూడు వందల అయిదు సం॥లు పాలించి నట్లు చెప్పుకొనవలసి వచ్చును! ఇది అసాధారణ విషయము. కాల నిర్ణయమున నిట్టువంటి పరిష్కార మనంగీకార యోగ్యము. మూడవ కుసుమాయుధుడే కొరవి శాసన కుసుమాయుధుడని శాస్త్రిగారు గుర్తించుటలో నేర్పడిన పరిణామమిది. మరియొక కుసుమాయుధు డెవ్వరును ముందు తరములందు కానరానిచో నిట్టువంటి నిర్ణయముల యోగ్యతాయోగ్యతలను పరీక్షింపవచ్చును. ఈతనికన్న ముందు మరి ఇరువురు కుసుమాయుధులు యీవంశమున నుండుటచే విధిగా మూడవ కుసుమాయుధుడే కొరవి శాసన కుసుమాయుధుడని గుర్తింపవలసిన ఆవశ్యకత లేదు. ఇట్లు గుర్తించుట సరియగునిర్ణయము కాజాలదు. కనుక క్రివ్వక శాసనము నందలి గొణగడు కొరవి శాసనము నందలి గొణగయ్య కాడు, కాజాలడు. వీరిరువురి నడుమ విపరీతమగు కాల వ్యత్యాసము కలదు. క్రివ్వక శాసన మందలి గొణగుడు క్రీ॥ శ॥ 1000–1025 సం॥ మధ్య పాలించగా, కొరవి శాసన మందలి గొణగుడు క్రీ॥ శ॥ 895 సం॥ నుండి పరిపాలించెను. కనుక పైన చెప్పినట్లు క్రివ్వక శాసనము నందలి కరియ గొణగుడు, నారాయణగిరి శాసనమునందలి గొణగుడని గుర్తించుటయే సత్యమని రూఢియైనది. కావున పైన క్రివ్వక శాసనస్థ పాలకుల కెనమండుగుర కిచ్చిన కాల నిర్ణయ సూచి నిరాక్షేపణీయమైనది.

ఇక వీరికి ముందువారైన ముగలు చెఱువుల, కొరవి శాసనము లందు చెప్పబడిన రాజుల కాలములు గుర్తింపవలసియున్నది. ముగలు చెఱువుల శాసన కాలము నాటికి యీ రాజులు ముదుగొండ రాజులు గనే చెప్పబడు చుండిరిగాని కొరవి వల్లభులుగా కారని, క్రివ్వక శాస నము నాటికి ముదుగొండ విడిచి కొరవి యందు కొంతకాలము స్థిర పడియుందురని శ్రీశాస్త్రిగారు అభిప్రాయము వెలిబుచ్చియున్నారు.[23] కాని కొరవి యన్నది ముదిగొండ సల్కులు తాత్కాలికముగా తలదాచు కొన్న స్థావరము కాదు. తొలినుండి అదియే వారి రాజధాని. కుసు మాయుధుని కాలము నాటికి ముందు నుండియు వీరికి కొరవితో సంబంధమున్నది. ''కొరవి యన్నది ముదిగొండ సల్కుల కులసంత'' యని శిథిల శాసన వాక్యము.

కొరవి శాసనము నందలి రాజులు ముగ్గురు. వీరు కుసుమా యుధ, విజయిత గొణగ, నిరవద్యులు. వీరు ముగ్గురును ఒక్కొక్క దశలో ప్రథమ చాళుక్య భీమునకు సమకాలికులు. ఇందలి కుసుమాయు ధుడు మొదటి కుసుమాయుధుడే కాదగునని శ్రీ నేలటూరి వేంకట రమణయ్యగారి అభిప్రాయము. ఈతని ప్రోద్బలముననే ప్రథమచాళుక్య భీముడు కూకిపఱు అగ్రహారము నొక బ్రాహ్మణునికి దానమిచ్చినట్లు బెజవాడ తామ్ర శాసనము తెల్పుచున్నది. ఈ కుసుమాయుధుడు తన ప్రభువైన గుణగ విజయాదిత్యుని నామమును, బిరుదమును తన పుత్రుల కిరువురికి నిడినట్లు బిజ్జ విజయిత, విజయాదిత్య లేక గొణ గయ్య అను మొదటి కుమారుని నామమును, నిరవద్యుడను రెండవ పుత్రుని నామమును ధృవపఱచుచున్నవి. చాళుక్య భీముడు రాజ్యాభి షిక్తుడైన కొద్ది కాలముననే అనగా సుమారు క్రీ॥శ॥ 895 ప్రాంత మున కుసుమాయుధుడు మరణించినట్లును, తర్వాత నా స్థానమును గొణగ విజయితు డధిష్ఠించినట్లును కొరవి శాసనమునుబట్టి తెలుసు కొనగలము. కొన్ని సంవత్సరముల యనంతరము నీతనిని పదచ్యుతు నొనరించి నిరవద్యుడు రాజ్యాభిషిక్తుడై యుండును. శాసనములోని ''అనేక సమర సంఘట్టన భుజాసి భాసురుండై తమయన్న రాజ్యశ్రీ కెల్లం దాన యర్హుండై'' అనుటనుబట్టి నిరవద్యుడు తన యన్నను కూలద్రోసియే బలిమిని రాజ్యమాక్రమించినట్లు తెలియుచున్నది. అగ్రజుని పదచ్యుతు నొనరించి యాక్రమించుకొనిన పదని కనుకనే సుంకములు రాబట్టు హక్కుల విషయ నిర్ధారణ జరుపుట, కొరవి కిచ్చిన స్థితి నిల్పుట, శాసనమందు కానవచ్చుచున్నవి. ఈ కాలము నాటికి విజయిత గొణగుడు పదచ్యుతు డయ్యెనే తప్ప మరణింపలేదు. మరణించి యుండుననియే కొందరు పరిశోధకులు భావించినారు.[24] కాని అట్లు చెప్పుటకన్న పాలకుడు కాడని చెప్పుట సమర్థనీయము. ఈ వృద్ధాప్యమున గొణగుడు వేంగీ రాజ్యపు వారసత్వపు గొడవలలో చిక్కి, దాయాదులు యాగ్రహమునకు గురియై, అంతర్యుద్ధమున నిరవద్యుని ప్రభావమున కెదురు నిలువలేక, మరియొక దిక్కుతోచక తెలంగాణమున పారుగువాడైన వేములవాడ చాళుక్య వంశపు రెండవ యరికేసరి యండ చేరియుండును. ఈ విషయము వేములవాడ శాసన మందును, పంపని గ్రంథమందును పేర్కొనబడినది.

ఈ శరణమీయబడిన బెజయితు డెవ్వరను విషయమున గత ములో కొంత చర్చ సాగినది. ఈతడని కొందరును, యీతని మనుమ డును, రెండవ కుసుమాయుధుని పుత్రుడునైన విజయాదిత్యుడని కొందరును[25] అభిప్రాయపడిరి. ఈతని మనుమడని భావించుటకు కారణము తత్కాలమున కీతడు మరణించియుండునని తలచుటయే. కాని యీతడు మరణించెననుటకన్న పదభ్రష్టుడై ప్రవాస మేగినట్లు చెప్పుట సమంజసమని పైన పేర్కొనబడినది. శ్రీవేంకటరమణయ్య గారు కూడ యీతడే అరికేసరి నాశ్రయించెనని అంగీకరించిరి.[26] మరియొక విశేషమేమన యీతని కుమారుడైన బద్దెగుడే క్రీ॥ శ॥

941 సం॥ ప్రాంతమున చాళుక్య అరికేసరి ప్రాపున నున్నట్లు చెన్నూరు శాసనము పేర్కొనుచున్నది. దీనినిబట్టి నిరవద్యునిచేత తరిమివేయబడిన యనంతరము బిజయిత గొణగ, బద్దెగులు మూల రాజ్యము పోగొట్టుకొని, రెండవ అరికేసరి యాశ్రయమున సామంతులుగా చేరిరనియు, నిరవద్యుడే రెండవ కుసుమాయుధుని కాలము వరకాను కొరవి రాజ్యము నేలుచున్నట్లు చెప్పకొనవలసి యుండును. కనుక కొరవి, చెన్నూరు శాసనములందు పేర్కొనబడిన రాజులను, వారి వారి సమకాలీన చారిత్రకాంశములను దృష్టియందిడుకొని యీ యీ కాలములకు చెందినవారుగా గుర్తింపవచ్చును.

| | క్రీ॥ శ॥ |
|---|---|
| మొదటి కుసుమాయుధుడు | 870–895 |
| బిజయిత గొణగుడు | 895 935 (పాలన క్రీ॥శ॥ 910 వరకు మాత్రమే) |
| నిరవద్యుడు | 910–935 |
| బద్దెగుడు | 935–941 |

—ఇట్లు గుర్తించుటవలన కొన్ని చారిత్రకాంశములు సరివడి నను, కుసుమాయుధుని పెద్ద కుమారుడైన బిజయిత గొణగునకు మిగిలిన రాజులకు చెప్పినట్లు రాజ్యకాలము 25 సం॥లుగా చెప్పట కుదురలేదు. దీనికి కారణము పైన వివరింపబడినది. తొలినుండి రాజకీయముల నతి మెలకువతో పరిశీలించుచున్న 'సంతానెగళ్ళ' శ్రీనిరవద్యుడు అగ్రజుని పూర్తికాలము రాజ్యము చేయనీయక తరిమి వేయుటచే గొణగుని రాజ్యపాలన యర్ధాంతరముగా ముగిసినది. కొందరు చరిత్రకారులు ప్రథమ కుసుమాయుధుడు క్రీ॥శ॥ 895 సం॥ వరకు పాలించినట్లు ఒప్పకొన్నను, అరికేసరి యాశ్రితుడైన బిజ్జియిత, రెండవ విజయాదిత్యుడగునేమోయని భావించుటవలన యాతనిని అరికేసరి కాలమునకు కుదించి గొణగ, నిరవద్య రెండవ కుసుమాయుధులకు స్వల్పకాల పాలన మొసగిరి.[27] ఇది అంతయు నాటికి బిజయిత గొణగుడు మరణించి యుండునను నవోహపై నాధారపడి యున్నదగుటచే నంగీకారయోగ్యము. నాటికి గొణగుడు మరణించుననుట నిరాధారము. వేములవాడ చాళుక్యుల సంబంధమును బట్టి, ఇతడు క్రీ॥ శ॥ 935 వరకు జీవించి యున్నట్లుస్పష్టము. బద్దెగుడు మూలరాజ్యము విడిచిపోయిన వాడగుటచే, మరియొక వంశమునకు సామంతుడై గడపు అతని పాలనతో తరువాతివారికి సంబంధములేదు. అయినను చెన్నూరు శాసన మాతనిని క్రీ॥ శ॥ 941 సం॥నకు చెందినవాడుగా తెల్పుటచే వడియే పేర్కొనబడినది. కనుక తొలి కోవకు చెందిన యీ నలుగురు పాలకుల రాజ్యకాలము లును నిరభ్యంతరములని గుర్తించవలెను.

ఇంతవరకును ముదిగొండ చాళుక్య వంశీయులలో తొలివారైన కొరవి శాసనస్థ రాజులు ముప్పరు పాలనా కాలములును, చివరివారైన క్రివ్వక శాసనస్థ పాలకులు ,ఎనమండుగురి రాజ్యకాలములు గుర్తించుట జరిగినది. మొగలు చెఱువుల శాసనము ననుసరించి నిరవద్యుడందు ప్రస్తావింపబడకపోయినను, (అందలి విజయితుని సోదరుడగుటచే) అతనికిని విజ్జయరాజునకును నడుమ, అనగా పైన యింత వరకు కాలనిర్ణయము సూచితమైన రెండుపట్టికలకు నడుమ, యింకను మూడు తరములు కలవు. ఇవి రెండవ కుసుమాయుధ, విజయాదిత్య, మూడవ కుసుమాయుధుల రాజరికపు కాలములు. ఈ మూడు తరముల పాలకులకు, పై రెండు పట్టికలకు నడుమనున్న 65 సంవత్సరములను, (క్రీ॥ శ॥ 1000–935=65 సం॥) సరిపుచ్చవలెను. ఈ 65 సం॥ల కాలములో వీరు ముప్పరేగాక విరియాల మల్లని గూడూరు శాసనము ననుసరించి క్రీ॥శ॥ 995 సం॥ ప్రాంతమున ముదిగొండ చాళుక్యరాజుగా బొట్టు బేతరాజు పేర్కొనబడినాడు. ఈ 65 సం॥ల కాలములో యీ నలుగురు పాలకులను సర్దుబాటు చేయవలసి వచ్చుచున్నది. కనుక ఒక్కొక్కరి పాలనకు 25 సం॥ పద్ధతిని పరిగణించుటకు వీలు కలుగలేదు. రెండవ కుసుమాయుధుని కొక్కనికి యిరువది సం॥ లెక్కచూచుకొని మిగిలిన ముప్పరకు పది హేను సం॥ చొప్పన పంచి యిచ్చిన సరిపోవును. దీనినిబట్టి యిట్లు కుదురుచున్నది.

| | | క్రీ॥ శ॥ |
|---|---|---|
| రెండవ కుసుమాయుధుడు | — | 935– 955 |
| విజయాదిత్యుడు | — | 955– 975 |
| మూడవ కుసుమాయుధుడు | — | 970– 985 |
| బొట్టు బేతరాజు | — | 985–1000 |

ఒక్క విరియాల మల్లని గూడూరు శాసనమునదప్ప యిచ్చటి బొట్టు బేతరాజు వృత్తాంతము మనకీ వంశస్థుల యితర శాసనము లందు లభ్యమగుటలేదు. దీనికి కారణము తెలియదు. కాని క్రివ్వక శాసనమునందు తర్వాతివారుగా బేతరాజు, బొట్టుబేతరాజు మున్నగు వారు కానవచ్చుటనుబట్టి యీ బొట్టుబేతరాజు కూడ యీ వంశము వాడే అని గుర్తింపవలసి వచ్చినది. పైగా యీ బొట్టు బేతరాజు విరియాల యెఱ్ఱనిచే కొరవి దేశమునందు ప్రతిష్ఠ చేయబడినవాడట. ఈ వృత్తాంతము జరిగిన కాలమునకు కొరవి రాజ్యము ముదిగొండ చాళుక్యుల యాధిపత్యమున నున్నది. వీని యన్నింటినిబట్టే ఈబొట్టు బేతరాజు యితర శాసనములందు ప్రస్తావింపబడని ముదిగొండ చాళుక్య వంశజుడని భావింపవలసి వచ్చినది. అతడు క్రీ॥ శ॥ 985–1000 ప్రాంతములలో పాలించెననుట, విరియాలవారి కథనమునకు సరిపడగలదు.

—ఇప్పటివరకు చర్చించి నిరూపించబడిన ముదిగొండ చాళుక్యుల వంశ, కాలానుక్రమముల ని క్రింది పట్టికయందు చూడనగును.



— పట్టికయందలి కాలముల నామోదించుటకు ముందు ఇగా క్రింది అంశములు గమనింపవలసియున్నది.

(i) కరియగొనగ, నిజ్జయరాజుల తరమునకుచెందిన మల్లప, లోభచతికులు పాలకులుగా పేర్కొనబడక పోవుటచే వారికి రాజ్య కాలములు కేటాయింపబడలేదు.

(ii) నిరవద్య, బద్దెగ, కరియ గొనగులు కొన్ని శాసనము లందు పేర్కొనబడకపోవుటకు కారణము వారి యెడలకల శత్రుత్వమో, లేక వారు మూలవంశమును వీడిపోవుటచే నేర్పడిన నిరాదరమో కావచ్చును.

(iii) దానార్ణవుని కండ్యం దాన శాసనమున ముదిగొండ రాజ వంశస్థులుగా చెప్పబడిన మల్లియ, గుండియలనువారు మూలవంశము నకు చెందినవారు కారని, కాకపోవుటనుబట్టియే వేంగీశ్వరుల యను చరులై బ్రతుకుచు పొత్తపినాటికి వలసపోయిరనియు భావింపబడి యుందు చేర్చబడలేదు.

# అధోజ్ఞాపికలు

'ఎపిగ్రాఫియా ఆంధ్రికా', సంపుటి I, పుట 142.

'ఒర్లీ తెలుగు ఇన్స్క్రిప్షన్స్' (బూదరాజ రాధాకృష్ణ) సంఖ్య—87.

'తెలుగు శాసనాలు' (పి. వి. పరబ్రహ్మశాస్త్రి) పుట 52.

2 భారతి, 1979, డిసెంబరు, పుట 32.
భారతి, 1980, జనవరి, పుట 33.

3 ఎపిగ్రాఫియా ఆంధ్రికా, సంపుటి I. పుట 142.

4 ఇండియన్ ఏంటిక్వరీ, సంపుటి XXXII పుట 282.

5 ఇండియన్ ఏంటిక్వరీ, సంపుటి XXXII పుట 281.

6 ఆంధ్రప్రదేశ్ ఏన్యువల్ రిపోర్టు ఆన్ ఎపిగ్రఫీ, 1967, సంఖ్య 1.

'కాకతీయాన్ ఆఫ్ వరంగల్', (పి. వి. పి. శాస్త్రి) పుట 52, అధోజ్ఞాపిక నెం. 4.

7 ఇన్స్క్రిప్షన్స్ ఆఫ్ ఆంధ్రప్రదేశ్, వరంగల్లు జిల్లా, పుట 18.

8 భారతి, 1979, నవంబరు, పుట 32.

9 ఎపిగ్రాఫియా ఆంధ్రికా, సంపుటి I, పు. 39.

10 సౌత్ ఇండియన్ ఇన్స్క్రిప్షన్స్, సంపుటి X, సంఖ్య 262.

11 సౌత్ ఇండియన్ ఇన్స్క్రిప్షన్స్, సంపుటి IV, సంఖ్య 961.

12 పల్లవులు—చాళుక్యులు. (నేలటూరు వేంకటరమణయ్య) పుట 132, 225.

'ది చాలుక్యాస్ ఆఫ్ లేములవాడ' (యన్. వేంకటరమణయ్య) పుట 35.

13 ఏన్యువల్ రిపోర్టు ఆన్ ఎపిగ్రఫీ, 170 ఆఫ్ 1966.

ఇన్స్క్రిప్షన్స్ ఆఫ్ ఆంధ్రప్రదేశ్, కరీంనగర్ జిల్లా, సంఖ్య 2.

14 భారతి, 1979, డిసెంబరు, పుట 36.

15 ఇన్స్క్రిప్షన్స్ ఆఫ్ ఆంధ్రప్రదేశ్, వరంగల్లు జిల్లా, పుట 81.

16 పల్లవులు-చాళుక్యులు, పుట 223.

17 ది చాలుక్యాస్ ఆఫ్ లేములవాడ, పుట 36.

18 ఎపిగ్రాఫియా ఆంధ్రికా, సంపుటి I, పుట 131.

19 ఇన్స్క్రిప్షన్స్ ఆఫ్ ఆంధ్రప్రదేశ్, వరంగల్లు జిల్లా పుట 145.

20 జర్నల్ ఆఫ్ ఆంధ్రా హిస్టారికల్ రీసెర్చి సొసైటీ, సంపుటి VI, పుట 176.

పల్లవులు—చాళుక్యులు, పుట 219.

21 భారతి, 1980, జనవరి, పుట 34.
22 ఎపిగ్రాఫియా ఇండికా, సంపుటి V, పుట 129.
23 భారతి, 1979, డిసెంబరు, పుట 33.
24 ఎపిగ్రాఫియా ఆంధ్రికా, సంపుటి I, పుట 121.
భారతి, 1979, డిసెంబరు, పుట 34.
25 ఎపిగ్రాఫియా ఆంధ్రికా, సంపుటి I, పుట. 130.
'ది చాలుక్యాస్ ఆఫ్ వేములవాడ', పుట 35.
26 పల్లవులు–చాళుక్యులు, పుట 223.
'ది చాలుక్యాస్ ఆఫ్ వేములవాడ', పుట 36.
27 ఎపిగ్రాఫియా ఆంధ్రికా, సంపుటి I, పుట 131, 133,

## గాజుముక్క

ఈ పగిలిన గాజుముక్కల్ని
చూసినప్పుడల్లా నా కనిపిస్తుంది –
నేనూ ఓ గాజుముక్కనైతే ...
సూర్యుని చుట్టూవున్న అనంతకోటి కిరణాల్లో
ఏ ఒక్కదాన్నో హృదయంనిండా నింపుకొని,
ఈ చీకటి మహాసముద్రంపై
'వెలుతురు వాన' గా కురిసేవాణ్ణి !
ఆకాశంలోని ఎరుపునంతా కళ్ళల్లోనింపుకొని,
ఈ అంధ జనారణ్యంలో
ఒక్క మెరుపు మెరిసేవాణ్ణి !

## కోరిక

నాకు –
ఈ చేదు జ్ఞాపకాల ఉడుపుల్ని విడిచి
దిగంబరంగా నడిచి వెళ్ళాలని వుంది !
ఈ స్వాప్నిక అనుభూతుల నొక్కొక్కదాన్నేతుడిచి
అదృశ్యమైపోవాలనివుంది !
'నన్ను' గుర్తించని 'నేను' లా
నన్ను నేను మరచిపోవాలనివుంది !
నిర్మలమైన నీలాకాశం క్రింద
తెల్లని శాంతి శిఖరాలమధ్య
చల్లని ప్రకృతి ఒడిలో కాసేపు
పవళించి, ఈ జన్మని ఈడ్చుకొచ్చిన
అలుపుకి సేదదీర్చుకోవాలనివుంది !
అనుభవాలు నేర్పిన పాఠాలను నెమరేసుకొని
క్రొత్త అధ్యాయం మొదలుపెట్టాలనివుంది !

శ్రీ బి. మురళీధర్

# క ల గూ ర గం ప

## జాతక భాగములో....

శుభగ్రహాలుగా గణనకెక్కిన గురు శుక్రులు కేంద్రాధిపతులు అయితే చాల దోషం, అని ఉంది. గురు బుధ శుక్రులలో ఏ ఒక్కడయినా కేంద్రమందుంటే జాతక కుండలిలో ఇతర గ్రహస్థితి వల్ల వచ్చే దోషాలు పోగొట్టి శుభఫలం ఇస్తాడని శాస్త్రం చెప్పింది. ఈ రెండు ఒకదానికి ఒకటి విరుద్ధమని అనుకోవాలా? ఈ వైరుధ్యాన్ని పరిహరించే అనుశాసనం ఉందా? అని నాకు లభించిన గ్రంథాలు (జాతక భాగానికి సంబంధించేవి) పరిశీలించాను. ఎక్కడా అలాటి కీలకం కనిపించలేదు సరేకదా ఇంకా సందేహం కలిగించే మాటలే కనిపించాయి. పై రెండు మార్గాలనూ జాతక చక్రాలలో సమన్వయించి చూస్తూ ఉండగా నాకు కొన్ని భావాలు తోచాయి. వాటిని వెల్లడించి విశేషజ్ఞుల అభిప్రాయాలను అభ్యర్థిస్తూ ఈ వ్యాసం వ్రాస్తున్నాను.

శిశువు పుట్టిన లగ్నాన్ని బట్టి కేంద్ర నిర్ణయం అవుతుంది. ఉదా॥ సింహలగ్నం అయితే వృశ్చిక, కుంభ, వృషభాలు కేంద్రాలవుతాయి. శుభగ్రహాలయిన గురు శుక్రులలో ఒకడైన శుక్రుడు లగ్నాల్లో దశమ కేంద్రమైన వృషభానికి అధిపతి అయాడు. శాస్త్రాన్ని పట్టి యీ జాతకుడికి శుక్రుడు దోషకరుడు — అని చెప్పాలి. అయితే రెండవ మార్గాన్ననుసరించి కేంద్రమునందు గురు బుధ శుక్రులలో ఏ ఒక్కడైనా ఉంటే దోషాలన్నీ పోగొట్టి శుభఫలాలు ఇస్తాడని చెప్పవచ్చునా? కూడదా? ఈ రెంటికీ పరస్పర విరోధం పట్టిందా? లేదా? శాస్త్రాన్ని పట్టి పట్టింది—అయితే పరిహారం ఎలాగు? ...

జాతక చక్రాన్ని పట్టి శుక్రుడు వృషభములోనే ఉన్నాడు. దశమ కేంద్రం అది. ఉత్తరోత్తరం బలీయం అనేది కూడా వర్తింపచేస్తే శుక్రుడు యీ జాతకుడికి బహు దోషకరుడు అని చెప్పాలి...కానీ అనుభవాన్ని బట్టి ఆ శుక్రుడు జాతకుడికి ఏ గ్రహ దశ వచ్చినా దానిలో తన విదశలోకూడా మంచి ఫలమే ఇస్తున్నాడు... కారణం? స్వక్షేత్రం అయినందువల్ల. ఈ నిర్ణయం అవునంటారా! కాదంటారా? కానీ జ్యోతిశ్శాస్త్రకారులు కుజుణ్ణి మాత్రమే యోగ కారకుడుగా చెప్పి శుక్రుణ్ణి పాపిగానే తీర్మానించారు. జాతకాలు పరిశీలించి చూస్తూ ఉంటే ఆ తీర్మానం నిస్సారంగా కనిపిస్తుంది. ఇంకో విశిష్టత ఏమంటే ఈ శుక్రుడు [బుధుడు దశాధిపతి (వర్తమానం) అయి లాభస్థితుడుకాగా] తాను దశమ మందు ఉండి అంతర్దశాధిపతి అయి చక్కని కావ్య రచన, ధనాగమం చేయిస్తున్నాడు. ద్విద్వాదశస్థితి దోషం కనిపించలేదు. దీనికేమిదారి? ఇద్దరూ స్వక్షేత్రాలలో ఉండటమే—అని ఒప్పుకోక తప్పదు. అన్నిటి కన్నా గొప్పగా చెప్పవలసేది అనుభవములో చూస్తున్నది. శుక్రుడు ఏ లగ్నానికైనా ద్వాదశ మందు (శత్రుస్థానములో ఉన్నాసరే) ఉంటే ధనం ఇస్తున్నాడు. దీనికేమనాలి? కేంద్రములో ఉంటేనే తప్పా అయితే వ్యయస్థానస్థితి ఒప్పా?

శుక్రుడు చతుర్థ కేంద్ర మందు ఉండగా (స్వక్షేత్రం కాదు) లలిత కళలలో చక్కని ప్రవేశం కలిగించడం చాలా జాతకాల్లో చూస్తున్నాను. అది స్వక్షేత్రమే అయిన జాతకాలలో సంగీతజ్ఞులు చాలా మంది కనిపించారు. ఇక్కడ కేంద్రాధిపత్యం దోషం ఏమైనట్టు? అలాగే సప్తమ కేంద్రాధిపత్యం వచ్చిన శుక్రుడు పరిశుద్ధమైన కన్య వధువుగా విశేష ధనముతో జాతకునకు సమకూర్చడం చాలా జాతకాలలో కనిపించింది.

ఇక, గురుని స్థితిగతులు గురించి రెండు మాటలు, నిన్న మొన్న కాశీ ఖండం తెనుగుచేస్తూ ఒకచోట కేంద్రమందు గురువుండగా మూల ప్రథమ పాదమందు శిశువు జన్మించినందువల్ల పితృమారక దోషం పట్టి శైశవమందే ఆ శిశువు తండ్రి మరణించాడనే కథ వచ్చింది. గురు బుధ శుక్రులలో ఏ ఒక్కడైనా కేంద్ర మందుంటే దోషాలను నిశ్శేషంగా పోగొట్టి మేలు చేస్తాడనే సామాన్య శాస్త్రం ఇక్కడ ఫలించలేదన్న మాట. మూల ప్రథమపాద మందు శిశు జననం పితృమారకం అనే విశేష శాస్త్రమే అక్షరాలా జరిగిందని అనుకోవలసి వచ్చింది. కొన్నిచోట్ల వివరించి వ్రాసే మన కవి సార్వభౌముడు తన కాశీఖండ రచనలో శ్లోకానికి ప్రతి కృతిగా పద్యం వ్రాసి దాటిపోయాడు. ఎందుకీ అక్కరమాలిన తగవు అని అనుకుని ఉంటాడు. నేనిలా అర్థం చేసుకున్నాను. మూల జన్మనక్షత్రం కనుక రాశి ధనుస్సు. తద్రాశినాథుడైన గురువు కేంద్ర మందుండగ అంటే దశమ కేంద్రమనే భావించాలి. ధనూ రాశ్యాధిపతి అయిన గురువు పక్షములో కన్యలో ఉంటాడు. గురునకు అది శత్రు గృహం. (శ్లోకాన్ని బట్టి జన్మ లగ్నం తెలియలేదు.) ఆ విధంగా దశమ కేంద్ర శత్రు క్షేత్ర గమ్యుడైన గురువు కేంద్రమందున్నా పితృమారకదోషం పోగొట్టలేకపోయాడు. అని నిర్ణయించుకున్నాను. జన్మ నక్షత్రాన్ని బట్టి గురుని కేంద్ర స్థితికి వచ్చిన దోషం చెప్తున్నావు. అది లగ్న సంబంధి కాదు కదా! అని ఎవరైనా అడగవచ్చు. అడగండి. దానికి సమాధానం ఇది: ఎన్ని జాతకాలో చూశాను. గోచార రీత్యా గురుడు దశమ కేంద్రములో ఉండి అనేక విధాలా జాతకుణ్ణిపట్టి బాధిస్తాడు. ముఖ్యంగా ధన హాని, మనస్తాపం కలిగిస్తాడు. ఒక రహస్యం మరచి పోవద్దు. లగ్నానికి ఎంత బలమో చంద్ర లగ్నానికీ అంత బలముా ఉంటుంది. కొన్ని జాతకాలు చంద్రుని స్థితినిబట్టి చెప్పే ఫలాలకు సరిపోతున్నాయి. ఆదిభట్ల నారాయణదాసుగారు నాకు జాతకభాగానికి సంబంధించిన విషయాలు చెప్తూన్న కాలములో ఒక జాతకుడికి (సింహ లగ్న జాతకునికి) పుత్ర కారకుడైన గురుడు పంచమమందు స్వక్షేత్రములో ఉండడంవల్ల 'కారకో భావ నాశాయ' అన్న సూత్రాన్నిబట్టి కొడుకులు పుట్టరని ఎవరో చెప్పారని ఆ జాతకుడు రాగా 'ఏమంటావురా తాతా!' అని చిరునవ్వు నవ్వి ఆ జాతక చక్రం వా చేతికి ఇచ్చారు. నేను గురుడు పుత్రస్థానమందు ఉన్నాడు, తానే కదా పుత్ర కారకుడు అనిచెప్పగా, ఔను. ఆ మాత్రం నాకు తెలుసురా! చంద్రుణ్ణి బట్టి చూడరా! అన్నారాయన. 'చంద్రుడు కర్కాటక రాశిలో ఉన్నాడు.

చంద్రునకు పంచమమందు రవి కుజులున్నారు. ఆ విధంగా చూస్తే ఇద్దరు కొడుకులు కలగాలి' - అని చెప్పవచ్చు అని అన్నాను. 'చెప్పవచ్చేమిటిరా! చెప్పవలసిందే' — ఒరే తాతా! ఒకొక్కప్పుడు చంద్రుణ్ణి బట్టి చెప్తూ ఉండు. శాఖ్మని తగుల్తుంది. చంద్రుడికీ అంత బలమూ ఉంది. సూర్యుణ్ణిబట్టి కూడా చెప్పవలసి ఉంటుంది ఒకొక్క సమయములో అని చెప్పారు. కాలాంతరాన ఆ జాతకుడికి క్రమంగా ఇద్దరు కొడుకులు పుట్టినట్టు ఆ జాతకుడే వచ్చి చెప్పాడు. (అప్పటికి నేను ఆదేశములోనే ఉన్నాను.) ఫలితార్థం ఏమిటంటే గురుడు దశమ కేంద్రమందు ఉన్నా మంచి ఫలం ఇవ్వడనేది.

ఇక, బుధుడు మాట ఏమిటి? అదేమి ప్రారబ్దమో! పాప గ్రహముతో కలసి ఉన్నవాడైతే బుధుడు పాపి అవుతాడని ఒక యోగ్యతా పత్రం యిచ్చింది శాస్త్రం. న్యాయంగా బుధుడు సౌమ్య గ్రహం.

'సౌమ్యం సౌమ్య గుణోపేతం
తం బుధం ప్రణమామ్యహం'

అని వ్యాసుల వారి స్తుతినందుకున్న అదృష్టశాలి బుధుడు. మెత్తని వాణ్ణి చూస్తే మొత్తబుద్ధి వేస్తుంది అన్నట్టు క్రూర గ్రహాలు బుధుణ్ణి కలిసి పాపపు పనులు చేయిస్తాయన్నమాట. ఎంతదారుణం! కానీ ఇది కూడా బుజావు అయినట్టు కనిపించలేదు. షష్ఠ సప్తమాధిపతి అయిన శనితో కలిసి ధన లాభాధిపత్యాలు పట్టిన పాపస్థానమైన లాభమందుండి ఆకస్మిక ధనలాభం, ఉత్తమ గ్రంథ రచన (రచయితలయితే) కుటుంబ సుఖం, జాతకుని పుత్రులకు మేలుచేస్తున్న జాతకాలు చాలా చూశాను, చూస్తున్నాను. మరి, శనితో కలిసినందువల్ల బుధునకు పట్టిన పాపిత్వం ఏమిటి? ఏమో ఆ శాస్త్రకారుణ్ణి అడగాలి. ఆయనైనా చెప్పేది ఒక్కటే. బుధ శనులు శత్రువులు కారు, పైగా బుధునకు అది స్వక్షేత్రం. కేంద్రాధిపత్యం వచ్చిన పాపగ్రహం శుభ ఫలమే ఇస్తాడు కనుక శని కూడా మంచినే చేయిస్తాడు— బుధునిచే చేయిస్తాడు అని. ఏ శాస్త్రం ఎలాఉన్నా నాకు తోచినది ఒక్కటి మనవి చేస్తాను చిత్తగించండి ... ... ... 'ఏకోపి కేంద్ర భవనే'... కేంద్ర భవనం అంటే లగ్నానికి కూడా కేంద్రం అనే సంజ్ఞ వర్తిస్తుంది కనుక లగ్నమందు గురు బుధ శుక్రులతో ఏ ఒక్కరున్నా జాతక మండలి యందు పట్టిన దోషాలు శమింప చేస్తారని అర్థం చేసుకోవాలని ...

ఇంకొక్కటి చెప్పి యీ వ్యాసం ముగిస్తాను.

కేంద్రాధిపత్య దోషం గురు శుక్రులకు బలీయం అన్నారు. అష్టమాధిపత్యం మరీ దుష్టమే అంటారా? కాదంటారా? అష్టమాధిపత్యం బట్టి (సింహ లగ్నమై)గురువు అష్టమమందున్నాడు. ఆ మహాదశలో జాతకుడికి సుపుత్ర సంతతి నిచ్చాడు. మహారాజ సంస్థానములో ఆస్థాన పదవి కలిగించాడు. కీర్తి సంఘటించాడు ఒక జాతకుడికి. దీనికి నేననుకున్నాను 'సింహలగ్న జాతకుడికి అష్టమమందున్న గురుడు శుభ ఫలప్రదుడు' అని ఎవరికైనా చెప్పవచ్చు అని — ఏమంటారు ?

ఇంతవరకు కొన్ని వందల జాతకాలు చూశాను. వాటిని బట్టి 'కేంద్ర భవనం' అంటే లగ్నమనీ, కేంద్రాధిపత్యం అంటే దశమ కేంద్రాధిపత్యమనీ—సమన్వయించుకుంటే సామాన్య శాస్త్రానికి కూడా విరోధం లేదని నిర్ణయించుకుంటాను. ఇంకొకమారు మరికొన్ని విశేషాలు ... ఇప్పటికి ఇది విఘ్నేశ్వర పూజ!

**శ్రీ యామిజాల పద్మనాభస్వామి**

# విశ్వనాథ సీతారాముల పెండ్లిని తెలుగువారింటి పెండ్లివలె వర్ణించినాడా?

జూలై 'భారతి'లో డా. మురళీధర్, బొంబాయిగారు "మరలా గురజాడ" అనే వ్యాసంలో, గురజాడ ప్రజాకవి అయినట్లు, విశ్వనాథ కాజాలడు అనే నా వాక్యాన్ని ఖండించేందుకు, విశ్వనాథ ప్రజాకవే అని నిరూపించేందుకు ఈ క్రింది ఉపపత్తులను చూపించినారు.

"ప్రజలంటే మనకు తెలుగువారే కదా. మరి ఈ తెలుగువారి సంస్కృతిని, జీవితాన్ని, అలవాట్లను, ఆచారవ్యవహారాలను కుణ్ణంగా పరిశీలించి వాటి గొప్పతనాన్ని ప్రకటించి, తన నవలల ద్వారా, పద్యాల ద్వారా, వాటికి శాశ్వత స్థానాన్ని ఇప్పించిన విశ్వనాథ ప్రజాకవి కాడా? తుదకు జ్ఞానపీఠ బహుమతి పొందిన వారి రామాయణ కల్పవృక్షంలో కూడా సీతారాముల కల్యాణాన్ని తెలుగువారింటి పెండ్లివలె ముచ్చటగా వర్ణించాడే, ఇది ప్రజా కవిత్వం కాదా?"

రామాయణ కల్పవృక్షంలోని తెలుగుదనం గురించి యిప్పుడు చర్చిస్తాను. దీనికంటె ముందు ఐస్‌లాండులో పాముల గురించి తెలుసుకొందాం. ఐస్‌లాండులో పాములు లేవు!

డా. మురళీధర్‌గారి వాక్యాలలోని అబద్ధత గురించి తెలుసుకొందాం.

* పాలకుల పెండ్లి వర్ణిస్తే పాలితుల పెండ్లి వర్ణించినట్లా?
— కాదు.
* షావుకార్ల సంబరాన్నివర్ణిస్తే బీదవారి స్థితిని వర్ణించినట్లా?
— కాదు.
* దేవుళ్ల పెండ్లి వర్ణిస్తే, మనుషుల పెండ్లి వర్ణించినట్లా?
— కాదు.
* సనాతన ధర్మం అవలంబించే వారి వివాహాచారాలను వర్ణిస్తే, ఇతర మతాలవారి పెండ్లి, సివిల్ మేరేజులు, "ఆత్మగౌరవ" వివాహాలు వర్ణించినట్లా? ఇవి చేసుకొనే తెలుగు ప్రజలులేరా?
— ఉన్నారు.
* యు. పి. ప్రాంతం వాళ్లు (మగపెండ్లి వారి పార్టీ) బీహారు (పెండ్లి కూతురు వారి పార్టీ)లో పెండ్లి చేసుకొంటే,

పెండ్లిని తెలుగువారింటి పెండ్లివలె వర్ణించడం వర్ణనౌచిత్యం అవుతుందా ? — కాదు.

కావున,

సీతారాముల పెండ్లి తెలుగువారింటి పెండ్లివలె గనుక కవి వర్ణించి వుంటే, అది కావ్య శిల్ప లోపం, కవి ప్రతిభా వ్యుత్పత్తుల కొఱత క్రిందనే లెక్క కట్టవలెను.

ఇంతకూ పోనీ, విశ్వనాథవారు సీతారాముల పెండ్లిని తెలుగు వారి పెండ్లివలె వర్ణించినాడా అనే విషయాన్ని చర్చిస్తాను.

ఇప్పుడు నాఎదుట వాల్మీకి రామాయణం (మూలం), భాస్కర రామాయణం, రంగనాథ రామాయణం, తులసీ రామాయణం, జనప్రియ రామాయణం, రామాయణ కల్పవృక్షం ఉన్నవి.

వీటిలో సీతారాముల పెండ్లి ఘట్టాలను పునస్సమీక్షించినాను. విశదమైన తులనాత్మక పరిశీలన విశ్వవిద్యాలయ పరిశోధకులకు వదలి పెడతాను. మనకు కావలసిన విషయాలను మాత్రం టూకీగా వ్రాస్తాను. పై రామాయణాల్లో సీతారామ వివాహ ఘట్టంలో ఎన్ని పద్యాలున్నవో ఈ క్రింది పట్టికలో చూడవచ్చును.

| రామాయణం | సీతారామ కల్యాణ ఘట్టం లోని పద్యాల సంఖ్య |
|---|---|
| వాల్మీకి | 176 శ్లోకములు |
| భాస్కర | 32 పద్యములు |
| రంగనాథ | 140 ద్విపదలు |
| తులసి | 65 దోహాలు<br>300 చౌపాయీలు |
| జనప్రియ | 202 గేయాలు |
| విశ్వనాథ | 130 పద్యములు. |

శివ ధనుర్భంగం తర్వాత నుండి మగపెండ్లివారు అయోధ్యకు మరలివచ్చు వఱకూ గల రచనలన్ని ఎంచినాను. పరిగణనలో స్వల్ప లోపాలుండవచ్చును. ఐనా పై పద్య సంఖ్యలు వివిధ రామాయణాల్లోని సీతారాముల పెండ్లి వర్ణనల పరిమాణం తెల్పుతాయి. రామాయణ కల్ప వృక్షంలోని పద్య సంఖ్య ఇతర రామాయణాల్లోని పద్య సంఖ్య (''భాస్కరుడు'' మినహాయింపు) కంటే తక్కువే. ''భాస్కరుడు'' క్లాసిసిస్టు. అతనికి సెన్స్ ఆఫ్ ప్రపోర్షన్ ఎక్కువ. అందుకే అతని కవిత్వంలో సీతారాముల పెండ్లి కూడా క్లుప్తంగా జరుగవలసిందే. తక్కిన రామాయణాలు పరిశీలిస్తే నాకు తోచినదిది.

సీతారాముల పెండ్లిని వర్ణించుటను కవులొక మహాభాగ్యంగా పరిగణిస్తారు. దానినివిస్తారంగా ఆప్యాయంగా,గౌరవంగా వర్ణిస్తారు. వర్ణనల కేవేవో ''మిర్చి మసాలా'' చేరుస్తారు. అసలుకు పెండ్లి అంటేనే భారతీయులమైన మనకు ఖుషి. అటువంటప్పుడు సీతారాముల పెండ్లి అంటే చెప్పవలెనా? అందుకే సంక్షిప్తంగా, మాటలను ''పొసగ ముత్తైపుసరులో పోహళించిన లీల'' గూర్చే తులసీదాసు కూడా సీతారాముల పెండ్లి వర్ణనను గే అబాన్‌డన్‌గా ఆనందాతిరేకంతో పర్సనల్ ఇన్‌వాల్వ్‌మెంట్‌తో చాలా దోహాలలో, చౌపాయిలలో, ఛందములలో చేసినాడు. తన వాణిని పునీతం చేసుకొనేందుకు సీతారాముల మంగళదాయక వివాహాన్ని వర్ణించినానంటాడు తులసీదాసు.

(కవి కుల జీవను పావన జానీ, రామసీయ జస మంగళ ఖానీ, తేహితే మై కుఛ్ కిహా బఖానీ, కరన పునీత హేతు నిజబానీ.)

ఈ వర్ణన వాల్మీకిలోనే ఎంతో విస్తారంగా వుంది. సీతారాముల పెండ్లిని సంబరంగా వర్ణించడం భారతీయ కవులందరి ''హాబి.'' పుట్టపర్తివారు వివాహ వర్ణనలో స్పెషలిస్టులు కూడా. ''జనప్రియ''లో నల్గురు దివ్య దంపతుల వివాహ మహోత్సవాలను (అంటే నాలుగు పెండ్లిండ్లు) ''సకుటుంబ సపరివార సమేతంగా'' వర్ణించినారు. సన్నికల్లునూ వదలిపెట్టలేదు వారు.

సీతారాముల పెండ్లి వర్ణనలో విశ్వనాథ ప్రత్యేకత ఏమీ కన్పించదు. విశ్వనాథవారు వాల్మీకి పదజాలాన్నే వాడినారు. వాల్మీకి ''సువర్ణపాలికా'' అంటే విశ్వనాథవారు ''హైమపాలికలు''అంటారు. వాల్మీకి ''ప్రహముద్యైః'' అంటే విశ్వనాథవారు ''ప్రపాస్థాన'' అంటారు. వాల్మీకి ''ఛిద్రకుంభై'' అంటే విశ్వనాథవారు ''ఛిద్ర కుంభముల''అంటారు. తెలుగుదనం ఉట్టిపడేటట్లు ''ఓటికుండలు'' అనరాదా? వాల్మీకి ననుసరించి వ్రాసేటప్పుడు తెలుగు వారి పెండ్లి ఎక్కడిది? ఇది సనాతన వైదికాచారాలు పాటించేవారి పెండ్లి వర్ణన. హిందువులందరూ ఇట్లానే చేసుకుంటారు. నేపాలులో, బలిద్వీపంలో శ్రీనగరులో, జూనాగడ్‌లో, రామేశ్వరంలో హిందువులు పెండ్లి ఇట్లానే చేసుకుంటారు. హిందువుల పెండ్లి రివాజులు మహమ్మదీయులకూ అలవడ్డవన్న అతిశయోక్తి కాదు. గుజరాతు, కచ్‌లోని ముస్లిముల పెండ్లిండ్లు హిందువుల ఆచారాల ననుసరిస్తాయి. ఇట్లా పెండ్లి చేసుకోండని కాబోలు వాల్మీకి అంతటివాడు ఒక నమూనా పెండ్లిని (మోడల్ మ్యారేజ్) వివరంగా వర్ణించినాడు. కానీ సీతారాముల పెండ్లివలె ఆడంబరంగా చేసికొని హిందూ సంసారులు బుక్కా ఫకీరులగుట — రామప్పంతుల పరిభాషలో — అది వేఱే కథ.

తెలుగుదనం పేరిట వాల్మీకి వ్యతిక్రమం మంచిదా ? వాల్మీకి వ్యతిక్రమం రెండు రకాలు. అవాల్మీకాలైన విషయాలు జొప్పించడం (అవాల్మిసిక్ రైటింగ్స్), వాల్మీకి వ్యతిరేక విషయాలు వ్రాయడం (యాంటి వాల్మిక్ రైటింగ్స్). మొదటి రకం రచనలు కొంతవరకు క్షంతవ్యాలు. రెండవ రకమువి కావు. విశ్వనాథవారిలో రెండు రకాలూ ఉన్నాయి. తెలుగుదనం సీతారాముల వివాహంలో వుంటే అవాల్మీకం అవుతుంది. మూలంలో జనకుడు ''ఇయం సీతా మమ సుతా సహ ధర్మ చారీతవ'' అంటాడు. ఇది చదువుతూ వుంటే హిందువుకాని వానికి, పెండ్లి చేసుకోని వానికీ కూడా ఒక విధమైన దివ్యానుభూతి కల్గుతుంది. ఇట్టి చక్కని ''ఆల్ టయిమ్'' వాక్యం విశ్వనాథ రామాయణంలో లేదే! ''రంగనాథ'' నయం. ''నా పుత్రి సీత సద్ధర్మ చారిణీ గొను మగ్నిసాక్షిగా'' అని అనిపిస్తాడు. భారతీయ సంస్కృతి లేక తెలుగు సంస్కృతి వుంటుందా ? విశ్వనాథ రామాయణంలోని ఈ లోపం వాల్మీకి వ్యతిరేకం అని నా విన్నపం.

ఇంతకీ రామాయణ కల్పవృక్షంలో సీతారాముల పెండ్లి తెలుగు వారి పెండ్లివలె ముచ్చటగా ఉందా? నా మట్టుకు అది కన్పించలేదు

వధూవరుల సుఖ సంస్పర్శలు, "కచ సాన్నిధ్యాత్తరమణ"లు, నును సిగ్గు దొంతరలు మొదలైన వాటితో నాకు పనిలేదు. విశ్వనాథవారి సీతారాముల పెండ్లి వర్ణన బాగా వుందా లేదా అనే ప్రశ్నతో నాకు బనిలేదు. నాకు కావలసింది తెలుగువారి సంస్కృతిని ప్రతిబింబించే, ప్రతిధ్వనించే రచనలు. ఒకచోట, "ప్రతి చైత్ర శుద్ధ నవమికి, విత తంబుగఁ దెలుఁగు నేల విరిసెడు జల్లుల్" అని వస్తుంది. ఇదేనా డా. మురళీధర్‌గారికి కన్పించిన తెలుగుదనం? ఇంతకన్న మిన్నగా ఇంకొకచోట, "అలుకు గుడ్డకు వై కలహంబు జరిగె, జనక దశరథ గృహ పరిచారికలకు" అని వస్తుంది. అలికే గుడ్డలకై జగడమాడే ఈ పరిచారికలు తెలుగువాళ్లే అయివుంటారు. ఇదేనా డా. మురళీధర్ గారికి కనపడిన తెలుగువారి పెండ్లి ముచ్చట? తెలుగుదనమే ఒక సుగుణం అని భావిస్తే దాని కోసం "హంస వింశతి" చదివితే పోదా? రామాయణంలోనే తెలుగువారి పెండ్లి ముచ్చట కావలెనంటారా? "రంగనాథ రామాయణం" చదవండి. పెండ్లి కూతుళ్లను చేయుట, పెండ్లి కొడుకులను చేయుట తెలుగు వధూవరులకు వలెనే వున్నవి. "బవిరలు", "ముక్కాలు", "గురి గింజలు", "పేరంటాండ్రు", "పెండ్లి పాటలు", "నలుగులు" వర్ణించబడ్డాయి.

వధూవరుల నెత్తిపై బెల్లం, జీలకర్ర పెట్టుట వుంది. కల్యాణ వాతావరణం అంతా తెలుగుదనంతో గుబాళిస్తుంది "రంగనాథ"లో. "రమాయణ కల్పవృక్షం"లో ఇది మృగ్యం.

విశ్వనాథవారి రామాయణంలో కూడా తెలుగుదనం వుందవడానికి రెండు సాక్ష్యాలున్నాయి. ఒకటి—అది వ్రాసిన ఆయన తెలుగువాడు. రెండు—గ్రంథం తెలుగు భాషలో వుంది. ఇంకా ఏమైనా చూపించగలరా డా. మురళీధర్‌గారూ?

శ్రీ సర్దేశాయి తిరుమలరావు

# లేఖలు

## ఫాసిజమ్

'ఫాసిజం—ఒక పరిశీలన' వ్యాసంలో జనరల్ విల్ (జనేచ్ఛ సరియైన అనువాదంకాదు)ను వివరించి, జార్జి సెబైన్‌ను చదివిన కృష్ణారావుగారు, రూసో ఫాసిజాల సంబంధాన్ని అర్థం చేసుకోకపోవడం ఆశ్చర్యకరంగా వుంది.

అసలు ఫాసిస్టు సిద్ధాంతాలు కొన్ని ప్లేటో రిపబ్లిక్‌లో మొదటిసారిగా కనబడుతవి. ప్లేటో 'గార్డియనులు', 'ఫిలాసఫర్ కింగ్' పందొమ్మిదో శతాబ్దిలో విల్ ఫ్రెడో పారెటో కులీన (ఎలీటిస్ట్) సిద్ధాంతాన్ని ప్రభావితం చేశాయంటారు. ఏది ఏమైనా, ఇండియాలో ఫాసిజాన్ని గురించి పుస్తకం రాసిన అరుణ్ షౌరీ, యిప్పుడు కృష్ణారావుగారు అవగాహన చేసికోని విషయమేమంటే, చారిత్రకంగా హిట్లర్, ముస్సోలినీలు ఫాసిజాన్ని పైనుండీ రుద్దలేరు. ఆ యా దేశాల ప్రజలు, మేధావులు కూడా యీ సిద్ధాంతాన్ని ఆహ్వానించారు. వోల్టేర్, డిదిరో ఆదిగాగల ఫ్రెంచి మేధావులు హేతుయుగాన్ని (ఏజ్ ఆఫ్ రీజన్) ప్రారంభించారు. ప్రతి నమ్మకాన్నీ, ప్రతి వ్యవస్థను హేతువాదపు కొలబద్దతో పరీక్షించారు. ప్రేమ, ద్వేషం, విశ్వాసంలాంటి భావనలు యీ పరీక్షలో నెగ్గలేకపోయాయి. ముందు హేతువాదాన్ని ఆహ్వానించిన ప్రజలే రాను రాను హేతువాదంపట్ల విముఖతచూపారు. రూసో తన గ్రంథాల్లో హేతువాదమూ, నాగరికతా మానవుడిలో మంచితనం లేకుండా చేశాయన్నాడు. ఆలోచించడమే తప్పన్నాడు. హేతువాదానికి వ్యతిరేకంగా రొమాంటిక్‌యుగం ప్రారంభమైంది. ఈ యుగం హెగెల్‌లో పరాకాష్ఠనందుకుంది. ఫ్రెడరిక్ నీషే అందరు మనుషులూ సమానంకాదనీ, సూపర్ మాన్‌కోసం అన్వేషణ ప్రారంభం కావాలనీ వుద్బోధించాడు. ప్రజాస్వామ్యంలో అల్పులు పాలన కొనసాగిస్తారనీ, ప్రజాస్వామ్యాన్ని త్రోసివేసి ఒక గొప్పవ్యక్తి పాలిస్తేగానీ ప్రపంచానికి భవిష్యత్తులేదనీ నీషే వాదన. (కాదనగలమా?) మొదటి ప్రపంచ యుద్ధానంతరం ఇటలీ, జర్మనీలలో అధికారానికి వచ్చిన ప్రజాస్వామ్యాల చేతకానితనం ఫాసిజానికి దారితీసింది. కొన్ని తరాలుగ ప్రజలు వేర్వేరు సిద్ధాంతాలను అర్థంచేసికొని ప్రభావితులయ్యి ఆ కాలానికి ఫాసిజం తగినదని నిర్ణయించుకున్న తర్వాతనే హిట్లర్, ముసోలినీ పదవుల్లోకి రాగలిగారు. ఇక్కడ మనకూ, యూరప్‌కూ మౌలికమైన భేదం వున్నది. మనవంటూ ఏవీ సిద్ధాంతాలులేవు. అక్కడినుండీ, యిక్కడినుండీ అరువుతెచ్చుకుంటున్నాం, అన్ని సిద్ధాంతాలూ—మరి యివి కూడా అందరు చదవలేదు. చదివిన కొందరిలో ఎంతమంది అర్థంచేసుకున్నారన్న ప్రశ్న వుండనే వుంది.

ఫాసిస్టులయొక్క అతిముఖ్యమైన లక్షణం యూదులను ద్వేషించడం. లక్షలమంది యూదులు జర్మనీ, ఇటలీలలో తమ ప్రాణాలర్పించారు. ఒక జాతిని (ఆర్యులను) పొగడుతూ, మరొక జాతిని (యూదులను) హింసిస్తూవుండడం అందరు ఫాసిస్టులూ చేసినపని. ఈ విషయం గురించి ఒక్కమాటకూడా రచయిత అనకపోవడం శోచనీయం.

శ్రీ గోరంట్ల ఫణికుమార్
అనంతపురం.

## మినీ కవితలు - మెనీ ప్రశ్నలు

తూకంరాళ్లూ, కొలతస్కేళ్లూ మంచి కవితని సృష్టించలేవు. విషయం, విధానం ప్రధానం గాని పరిమాణంకాదు.

శ్రీ శ్రీ "కవితా! ఓ కవితా!", "దేశ చరిత్రలు", "శైశవ గీతి" మొదలయిన మేక్సీ కవితలు "ఆః", "అవతలిగట్టు", "పరాజితులు" లాంటి మినీ కవితలూ (మేక్సీ కవిత, మినీ కవిత అనే పేర్లు మినీ కవితోద్యమకార్లు పెట్టేరు. బహుశా యివి మేక్సీ, మినీస్కర్ట్ ఫ్యాషన్లమీద మోజుతో పుట్టేయి) తను చెప్పదలచుకున్న విషయం అర్థమయ్యే విధానాన్ని నిర్ధారించుకుని రాసేరు. పయిమేక్సీ కవితల్ని పాఠకుడికి అర్థమయ్యేలాగ మినీ కవితగా రాయడానికి వీలవుతుందా? యిన్ని లయిన్లే రాయాలి అన్ని అక్షరాలేవుండాలని పరిమాణ సంకెళ్ళు విధిస్తే ఆ మేక్సీ కవితల గతియేమిటి?

అంచేత కవి తాను చెప్పదలచుకున్న విషయం పాఠకుడికి అర్థమవడానికి తన కవితకి యెంత విస్తీర్ణం అవసరమో తనంత తానే నిర్ణయించుకోవాలి. అంటే మేక్సీ కవిత, మినికవిత అని భేదం

చూడ్డంగాని, అందులో వొకదాన్ని పట్టుకుని వేలాడ్డంగాని అనవసరం. అంతేగాని కవిత పది పంక్తులకి మించకూడదనడం, ఆయన కవితలో పదకొండక్షరాల్లో యింత భావముంది, యీయన రాసిన యిరవయ్యొక్కక్షరాల్లో అంత భావముందనడం అనవసర సంకెళ్లు తగిలించుకోడం కాదా ? యిలాంటి సంకెళ్లనే ప్రాచీన కవులు ప్రేమించి అక్షరాలూ, యతులూ, పంక్తులూ వగయిరా గుణించుకుని, ఛందసుతో చాలా తంటాలు పడ్డారు. అవన్నీ ఆ రోజుల్లో అవసరమేమోగాని ఆ సంకెళ్లే యిపుడూ అవసరమా ?

మరో విషయం, మినీకవిత పదిపంక్తులలోపు వుండాలట. పంక్తులు నిర్ధారించేరుగాని పంక్తి యెన్నక్షరాల పొడుగు సాగొచ్చో మినీకవితోద్యమకారులు యింతవరకూ చెప్పలేదు గాని యీ నిబంధనలు చూస్తుంటే ఆ బడితెమ కూడా త్వరలోనే ప్రయోగిస్తారనుకుంటే తప్పు లేదనుకుంటాను.

యికపోతే విహారిగారి "అబ్రకదబ్ర" సంభవమునాలుగు పంక్తుల మేక్సీ కవితనుంచి రెండిటిని విడగొట్టి యిది మినీకవిత అందం సరయిందేనా? యిలా కత్తిరించి చూపిస్తే యే మేక్సీనుంచయినా మినీ కనిపిస్తుంది. ఉదా:– "ప్రపంచమొక పద్మవ్యూహం, కవిత్వమొక తీరనిదాహం!"—శ్రీశ్రీ. మేక్సీలో బోల్డు మినీకవిత వుండగా మినీ కవితగురించి ఉద్యమం యెందుకు ? దండగ !

విద్యార్థులకి (యీ వుద్యమం వారికోసమేనట) మినీ కవితల్లోని "అల్పాక్షరముల ననల్పార్థం" చప్పున స్ఫురిస్తుందా ? "యిది యంత్రయుగం. తీరికలేని ప్రజలు హడావిడిగా తిని తమ పనులకి వెళ్లిపోతున్నకాలం. అలాంటివాళ్లకు పెద్ద పెద్ద కావ్యాలను చదవాలంటే తీరికతోపాటు ఆసక్తికూడా కలగడంలేదు. కాని 'మినీకవిత'ను చదవడానికి అంత పెద్ద సమయాన్ని వెచ్చించాల్సిన పనివుండదు"ట. నిజమే! అటువంటప్పుడు దాన్ని చదివి అవతల పారేస్తాడు గాని అల్పాక్షరాల్లోవున్న అనల్పార్థాల్ని" లాక్కోడానికి జుట్టు పీక్కునే సహనం సమయం వుంటాయని నమ్మకమేమిటి ? యీ అల్పాక్షరాల్లో అనల్పార్థంకోసం గింజుకుని భావం స్పష్టంగా తెలీకపోతే కవికి అనర్థమయిన కీర్తి రావడంగాని అనర్థమయిన అపకీర్తి వొచ్చే ప్రమాదం గానీ వుంది. యీ రెండూ వర్జింపదగినవే! భాష దేనికి ? భావం స్పష్టం కావడానికేగదా!

చూడండి—జయధీర్ తిరుమలరావు మినీకవిత "రేప్"—

ఆకాశం
చుక్కల రవికెను చించి
వెన్నెల బ్రా హుక్కు
చంద్రుణ్ణి పీకి
నీలం లంగా
నలుపోటీ లాగి పారేస్తే గాని
రేపు కాదు

రేప్ చెయ్యడానికి రవికెను చించింతర్వాత బ్రా హుక్కు పీకడమెందుకనే ప్రశ్నని అలా వొదిలి—యిందులో మినీకవి భావం మనకెంతవరకూ స్పష్టమయిందో చూద్దాం—రేపు (చీకట్లోంచి వెలుగులోకి వెళ్తున్నాం గనక, చీకట్లు తొలిగి సూర్యుడుదయిస్తాడు గనుక) ఆశని రగిలించే భవిష్యత్తుయొక్క బంగారు బాటని సూచించేమాట. అది ఆహ్వానించదగ్గ పరిణామం. మరి 'రేప్' కూడా అంతేనా? కాదు గదా! మరి యిక్కడీ మినీకవి యేం చెప్పాలనుకున్నాడో యేం చెప్పేడో పాఠకుడికి యేం తెల్సింది?

రేపు రేప్‌లాగ అసహ్యకర విషయమనా? లేక రేప్ రేపులాగ ఆహ్వానించదగ్గ పరిణామమనా? యెలా అర్థం చేసుకోవాలి దీన్ని?

డాక్టర్ మిరియాల రామకృష్ణ "రేపు!" (భారతి, ఏప్రిల్ 1980) చూడండి యెంత స్పష్టంగా అర్థమవుతుందో! అర్థంలేని, అర్థంకాని, అపార్థకమయింది అనర్థంకదా?

"మినీకవితలోని విషయం సమకాలీన సమాజాన్ని ఎక్కువగానే ప్రతిఫలిస్తున్నది కాబట్టి విద్యార్థులకు ఈ మినీకవితా పఠనం వర్తమాన సాంఘిక సమస్యల విజ్ఞానంకూడా అందజేయ గలదు." అంటూన్న రావి రంగారావుగారు, చంద్రసేన్ 'ముక్కంటి తెలివి'

"కన్ను తెరిస్తే జననం
కన్ను మూస్తే మరణం

రెప్పపాటేకదా ఈ ప్రయాణం!"లో హేతువు, రసానందానుభూతి, హృదయానందానుభూతి, ఔచిత్యం, దివ్యదృష్టి వున్నాయని తెగ మెచ్చుకున్నారు (జింబోగారు యీ కవితని నిరసించేరు), యిలాంటి మెట్టవేదాంతం చెప్పి, చెప్పినవార్ని పొగిడి యెవర్ని మోసగించాలనుకుంటున్నారీ మినీ కవితోద్యమకారులు ?

"మాయంటావా ?
అంతా మిథ్యంటావా?
నా ముద్దుల వేదాంతీ
పాలికాపు నుదుటి చెమట,
కూలివాని గుండె చెరువు,
బిచ్చగాని కడుపు కరువు
మాయంటావూ?" — శ్రీశ్రీ

మినీకవిత రాయకూడదనికాదు, అదొక వుద్యమమని అందులోనే రాయాలనీ అనడం, అక్షరాలూ పంక్తులూ లెక్కపెట్టడంతోనే పేచీ అంతా. తన భావాన్ని వ్యక్తపర్చడాని కవసరమయిన అక్షరాల్నీ పంక్తుల్నీ యేరికూర్చుకునే నిర్ణయ స్వేచ్ఛ కవికీ, కవిత అర్థమయ్యే అవకాశం నాలాంటి పాఠకుడికీ వుండాలనే నా కోరిక. తూనికలూ కొలతలూ వొద్దు. అక్షరాల లెక్కలు, పంక్తుల పొడుగులు మొదలయిన నిబంధనా బంధనాలూ, అర్థంకోసం మేం బుర్రలు బద్దలుకొట్టుకోడమూ వొద్దు.

భావ వ్యక్తీకరణకోసం కవిత వుండాలనీ, మినీకవితలో భావం వ్యక్తంకాదనుకుని కూడా మినీకవిత నియమాలకోసం భావాన్ని బలి పెట్టకూడదనే నా ఆందోళన అర్థంచేసుకుంటారనే నా ఆశ.

షమా
కాకినాడ

# గ్రంథ విమర్శలు

## నాలుగు కొత్త గ్రంథాలు

### చారుచర్య

[సంస్కృత మూలానికి ఆంధ్రానువాదం, అనువాదకులు శ్రీ మధునా పంతుల వేంకట పరమయ్య, పాకెట్ సైజు పీఠికాదులుకాక 20 పేజీలు. వెల : రూ 2లు. ప్రాప్తిస్థానం : శ్రీ మధునాపంతుల వేంకట పరమయ్య, రామారావుపేట, పెద్దాపురం, తూర్పు గోదావరి జిల్లా.]

సంస్కృత కావ్య కర్తలలో మహాకవి క్షేమేంద్రుడు మిక్కిలి ప్రసిద్ధుడు. ఆయన ఎన్నో గ్రంథాలు రచించాడు. వానిలో నూరు శ్లోకాల "చారుచర్య" అనే చిన్న పద్యకృతి ఒకటి. ఇందులో ప్రతీ శ్లోకంలోనూ ఒక దృష్టాంతంతో నీతులు బోధింపబడినవి. మానవులు ఎలా ప్రవర్తించాలో దీనిని చదివితే బాగా తెలుస్తుంది. ఆ శ్లోకాల అనువాదం నూరు గీత పద్యాలలో ఈ పుస్తకంలో ఉన్నది. మూలం ఇయ్యబడలేదు.

సంస్కృత చారుచర్య తెలుగు టీక తోను, దృష్టాంతాల వివరణంతోను ఇదివరకే పి. వి. రమణారెడ్డి (ఎం. ఏ) గారు ప్రకటించారు. హిందీలో ఉన్న దేవదత్త శాస్త్రిగారి వ్యాఖ్యలోని విశేషాలతో అది కూర్చబడింది. అది చాలా ఉపయుక్తంగా ఉన్నది. ఈ పుస్తకంలో ఆంధ్రానువాదంతో పాటు సంస్కృత శ్లోకాలు చేరిస్తే అనువాద పద్ధతిని తెలుసుకోడానికి ఎక్కువ అవకాశం ఉండేది.

రచన సులభగ్రాహ్యంగా పాఠకులకు అనుకూలంగాను, మూలాభిప్రాయాన్ని తెలిసికొనుటకు తగినట్లున్నూ ఉన్నది. ఒక్క ఉదాహరణ—

శ్లో. అల్పమప్యవ మన్యేత న శత్రుం బలదర్పితమ్
రామేణ రామః శిశునా బ్రాహ్మణ్య దయయోజ్ఝితః 49

దీని అనువాదం —

'అల్పుఁడయ్యుమ శాత్రవు నభిభవింపఁ
దగదు తన కెంత బలమును, దర్పమున్న
బాలుఁడని రాఘవుని మీఁది పలికి తుదకుఁ
పరశురాముఁడు కోరఁడే ప్రాణభిక్ష.''

### ఫల్గుణీ మాహాత్మ్యము

[పద్య కావ్యము. రచయిత్రి : శ్రీమతి వేదుల మీనాక్షీదేవి. క్రౌన్ సైజు : 100 పుటలు. వెల : 5 రూ. ప్రాప్తిస్థానం : రచయిత్రి, దానవాయి పేట, రాజమండ్రి.]

గయ నుంచి బుద్ధగయకు వెళ్ళుతున్నప్పుడు రోడ్డుకు ఎడమ ప్రక్క దారి పొడుగునా జలశూన్యమైన ఫల్గుణీ నది కానవస్తూవే ఉంటుంది. రచయిత్రి ఆ ప్రాంతానికి యాత్రకు వెళ్లినప్పుడు దీనిని చూచి ఆశ్చర్యపడ్డారు. తోడి యాత్రికులైన ఉత్తర దేశీయులు ఆ నది అలా ఉండడానికి కారణం చెప్పారట ! శ్రీరాముని వనవాస సమయంలో ఒకప్పుడుజరిగిన సంఘటనవల్ల సీతాదేవి ఫల్గుణీ నదిని శపించినదట! ఆ శాప ఫలితంగా అందులో నీరు లేకుండా పోయిందట! అగ్ని పురాణంలో గయా క్షేత్రాన్ని గురించీ, ఫల్గుణీ మాహాత్మ్యన్ని గురించీ ఉన్న విషయాన్నీ, పయి శాప వృత్తాంతాన్నీ గ్రహించి మీనాక్షీ దేవిగారు ఈ పద్య కావ్యాన్ని రచించారు. కవిత్వ పాండిత్యాలకు పేరు పడిన కుటుంబానికి చెందిన రచయిత్రి తన సహజ కవితాశక్తిని ఉపయోగించి యీ రచన సాగించారు. రచన రసవంతంగా ఉన్నది. మూడాశ్వాసాల యీ పద్య కావ్యంలో రమారమి మున్నూట యాభై గద్య పద్యాలున్నవి. మచ్చునకొక పద్యం —

మ.। నలు దిక్కుల్ రమణీయ చంద్రికల సు
స్నాతంబులై తోఁచె; చెం
గలువల్ శీత మయూఖు స్పర్శ గనుచున్
క్రమమ్ముగా విచ్చె; వా
కలుగా నింగిని నేలఁ బర్వుచు శర
త్కాలంపు జ్యోత్స్నల్ నిశా
జలజాతేక్షణి మేల్ముసుంగు పగిదిన్
జా నొప్పె చోద్యంబుగా

[ప్రథమాశ్వాసము, ప. 106]

సుప్రసిద్ధ విద్వత్కవులు మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రిగారు దీనిని పరిచయంచేస్తూ రచయిత్రిని గురించీ, గ్రంథ ప్రాశస్త్యన్ని గురించీ చాలా విషయాలు తెలియజేశారు.

### రాగరోచి

[ముక్తకములు. రచన : శ్రీరామచంద్ర కౌండిన్య. సంస్కృతాను వాద సహితము. అనువాదకులు డాక్టర్ పుల్లెల శ్రీరామ చంద్రులు. క్రౌన్ సైజు, 10 + 43 పేజీలు. వెల : 2 రూ. ప్రతులకు: డాక్టర్ ఓరుగంటి రామచంద్రయ్య, 60/ఎ, రమణానగర్, తిరువణ్ణామలై లేక మాధవీ బుక్ సెంటర్, ఆర్య సమాజమునకు ఎదురుగా, సుల్తాన్ బజార్, హైదరాబాదు.]

ఆంధ్ర విశ్వవిద్యాలయంలో చరిత్రాచార్యులుగా ఉండిన డాక్టర్ రామచంద్రయ్యగారు ఒక మిత్రుని ప్రోత్సాహంవల్ల శృంగార రసానికి సంబంధించిన 43 ముక్తకాలు వ్రాసి, వారి మిత్రులు డాక్టర్ రామ చంద్రుడుగారి సంస్కృతానువాదంతో కూడా ఈ "రాగరోచి"ని ప్రకటించారు. రామచంద్రయ్యగారు ఇదివరకే ఆధ్యాత్మికాన్నీ, భక్తినీ వెల్లడించే రచనలు సాగించి, ప్రకటించారు. శృంగార రసవర్ణనలోనూ తమ నేర్పును వెల్లడించడానికి ఈ ముక్తకాలను రచించినారా ? అని

తోస్తున్నది. పుస్తకం చిన్నదైనా విలువలో పెద్దది. కవి సమ్రాట్టు విశ్వనాథవారు దీనికి పీఠికను వ్రాసి, ప్రాశస్త్యాన్ని వెల్లడించడం, సుప్రసిద్ధ సంస్కృత విద్వత్కవులు డాక్టర్ రామచంద్రుడుగారు దీనిని సంస్కృతీకరించడం, ఇది డాక్టర్ దివాకర్ల వారికి అంకితం కావడం దీని ప్రత్యేకతకు నిదర్శనం. ఇలా నలుగురు మహనీయులను ఒకచోట కూర్చిన యీ పుస్తకం ప్రశస్తంగా ఉండుటలో వింతలేదు. ఇందులో పుటకొక పద్యం, దాని క్రింద సంస్కృతానువాదం ఉన్నది. అనువాద శ్లోకం దేవనాగరి లిపిలోనూ, తెలుగు లిపిలోనూ కూడా ఇయ్యబడినవి.

రచన జాను తెలుగు పదములతో ఇంపుగా నున్నది. సంస్కృతానువాదము సరళమైన భాషలో సాగినది. ఒక్క ఉదాహృతి — మూలం —

"ఒల్లదేని దెలియ గొల్లండ నేనాదు
వలచునేని యొల్ల బ్రహ్మపదము
కల్ల బ్రతుకులేల ? కలికి వాల్చూపుల
నురవడించు వలపుటురులొ ? మరులొ" (30)

అనువాదం —

యది న స్నిహ్యతి సాహం, గ్రామ్యఃస్యాం యది చ సా భ వేద్రక్తా!
న స్పృహయే బ్రహ్మపదా, యాస్యా దృగ్బంధ ఏవ మే రతియే.

కవి సమ్రాట్టు విశ్వనాథవారు చెప్పినట్లు — ఈ సూక్తులకు ముందు ఆయా సందర్భాన్ని తెలిపే వివరణ కూడా ఉంటే పుస్తకానికి ఇంకా ఎక్కువ ప్రయోజనం ఉండేది.

## విదురనీతి

[సుర భారతీ సాంస్కృతిక గ్రంథమాల. ప్రథమ కుసుమము. ఆంధ్ర టీకా తాత్పర్యములు: శ్రీమతి చిరువూమిళ్ల సుజాత, ఎం. ఎ. డెమ్మి సైజు 234 పుటలు. వెల: 10 రూ. కాపీలకు: కార్యదర్శి, సుర భారతీ సమితి, ఉస్మానియా యూనివర్శిటీ కాంపస్, హైదరాబాదు — 500 007.]

సంస్కృత భాషా ప్రచారానికి ఇప్పుడు ఎన్నో సంస్థలు స్థాపితాలయిఉన్నవి. వానిలో హైదరాబాదులోని సురభారతీ సమితి గ్రంథ ప్రకటన మూలంగా, సమావేశాల మూలంగా సురభారతీ ప్రచారం చేస్తున్నది. కేవలం సంస్కృత గ్రంథ ప్రకటనమేకాక — జన సామాన్యానికి సంస్కృత వాఙ్మయంలోని అమూల్య విషయాలు తెలియడానికి ఇతర పద్ధతికూడా అవసరమని సమితి కార్యకర్తలు గ్రహించారు. తెలుగు టీక తాత్పర్యాలతో ఉపయుక్త విషయాలను గ్రంథరూపంగా ప్రకటించడం ముఖ్యమని వారు గ్రహించారు. తత్ఫలితంగా రామాయణం, భారతం మున్నగు వానిలోని అమూల్యమైన శ్లోకాలు, ఉపనిషత్కథలు, సామాన్య ధర్మాలు మొదలైనవి టీకా తాత్పర్యాలతో సమితి పక్షాన ప్రకటింపబడుతున్నవి. అట్టివానిలో ఈ "విదురనీతి" ఒకటి.

విదురనీతి మహాభారతంలోని ఉద్యోగపర్వంలో ఉన్నది. తన కుమారుల ప్రవర్తనకు కలతపడిన ధృతరాష్ట్రునికి — అతని కోరికపయి విదురుడు చెప్పే మంచి మాటలే యీ విదురనీతి. ఈ నీతులు అందరికీ ఉపయోగించేవి. ఎనిమిది అధ్యాయాలలో ఉన్న యీ నీతులకు మూల శ్లోకాలతో సహా ప్రతిపదార్థ తాత్పర్యాలు ఇందులో ప్రకటింపబడినవి. ఇందలి అర్థ తాత్పర్యాలు చాలా సులభ పద్ధతిలో మూలాభిప్రాయాన్ని స్పష్టంగా తెలుపుతున్నవి. ఒక్క ఉదాహరణ -

"ఆత్మాన మేవ ప్రథమం, ద్వేష్య రూపేణ యోజయేత్,
తతోఽ మాత్యాన మిత్రాంశ్చ, సమోఘం విజి గీషతే.

ప్ర. అ. ప్రథమం = ముందుగా, ఆత్మానం ఏవ = తనను తానే, ద్వేష్యరూపేణ = ద్వేష్య (శత్రు) రూపములో, యోజయేత్ = కూర్పవలెను, శత్రువును జయించుటకై ప్రయత్నించినట్లు తనను తాను జయించుటకై ప్రయత్నింపవలెను. తతః = అటు తరువాత, అమాత్యాన్ = మంత్రులను, అమిత్రాన్ చ = శత్రువులనున్ను, సమోఘం = సఫలముగా, విజిగీషతే = జయింపదలచుచున్నాడు.

తా. ఇతరులను జయించుటకు ముందుగా, తనకు తానే శత్రువుగా దలంచి ఇంద్రియాదులను నిగ్రహించవలెను. ఆ తరువాత తనే మంత్రులను, శత్రువులను జయించు ప్రయత్నము సఫలము కాగలదు." (పుటలు 70, 71).

ఇది రాజనీతికి సంబంధించినది. తక్కినవి కూడ ఈ రీతినే ఉన్నవి. శ్రీ తిరుపతి తిరుమల దేవస్థానం వారి ఆర్థిక సహాయంతో ఈ కార్యక్రమం కొనసాగుతున్నట్లు సమితి అధ్యక్షులు, ప్రధాన న్యాయమూర్తి శ్రీ అల్లాడి కుప్పుస్వామిగారు తెలుపుతున్నారు. ఇట్టి ఉత్తమ సంస్థకు తోడ్పడుతున్న టి. టి. దేవస్థానం కార్యనిర్వాహకులూ, సుర భారతీ సమితివారూ, వ్యాఖ్యాత్రియు అభినందనీయులు.

శ్రీ బులుసు వేంకటరమణయ్య

## శ్రీ విష్ణుపురాణం

[అనువక్త : ఏలూరుపాటి అనంతరామయ్య. డెమ్మి 450 పారటలు, వెల రు. 10/— మాత్రమే. గ్రంథాలయాలకు రు. 13–32. ప్రతులకు : అనంత సాహితి, 3/3, అరండలుపేట, గుంటూరు- 522002.]

బహుగ్రంథకర్తలు—రెండుమారులు ఎం. ఎ. ప్యాసైన శాకికులు, పౌరాణికులు, పండితులు, ఉపన్యాసకులు, వ్యాసకర్తలు, ఉపాధ్యాయులు, ఇవీ ఈ ఏలూరుపాటి అనంతరామయ్యగారి విజ్ఞాన శతదళంలో కొన్ని ప్రజ్ఞాదళాలు. వీరు సామాన్య పాఠకులకు, మతతత్వ జిజ్ఞాసువులకు అందుబాటులో ఉండేదానికి సంస్కృతంలో ఉన్న పురాణాలను తెనుగులోనికి అనువదించి అందులో ప్రజల వ్యావహారిక భాషలో వ్రాయడం ప్రశంసనీయమైన విషయం. ఇతర భాషలలోనుండి విష్ణుపురాణ వ్యాఖ్యలను, మూలపాఠాలను పరిశోధించి వ్రాసి, ఆంధ్ర పురాణ వాఙ్మయానికి మరియొక అవలంబనాన్ని, ఆస్తికులకు ఒక

పట్టుకొమ్మను, భక్తులకు ఒక పారాయణ గ్రంథాన్ని, సమకూర్చి నారు. ఈ పురాణ ప్రచురణ వీరు తలపెట్టిన ధర్మోద్యమంలో మొదటిమెట్టు. మిగతా పురాణాలను గూడ వీరు అనువదించనున్నారు. దీనికి ఆర్థిక సహాయం చేస్తున్నవారి పూనిక మెచ్చదగినది. దీనిని ఒక పవిత్ర ప్రచారకధర్మంగా ఎన్నుకొని, మత గ్రంథాలను తక్కువ వెలకు అందజేసే దానికి సహాయపడుతున్న వదాన్యులు గూడ ధన్యులు.

ఈ రచన కుదింపు పెంపు మళ్లింపు లేకుండా, మూల విధేయంగా వ్రాయబడినది. భాష సరళ మనోజ్ఞంగా, కుంటలు దాటలు లేకుండా ప్రవహిస్తూ సాగిపోతున్నది. ఇందలి అధోజ్ఞాపికలు గ్రంథ కర్త పాండిత్య ప్రకర్షకములు. విపుల పీఠిక విషయపూర్ణము. ఇది చదువరి ఎరుక కలిమిని పెంచగలిగిన పరిశోధన.

పోతే ఇక పురాణాలను గూర్చి విమర్శదృష్టితో, ఈనాటి చూపుతో కొంత ప్రస్తావించుకోవలసి ఉన్నది :— బౌద్ధ జైనాలు వ్యాపించి, వేదమతాన్ని ఒకమూలకు నెట్టినవి. తన తల్రాతకు తానే కర్తనన్న సత్యం, నీ లోపల వెలిగేదే పరబ్రహ్మం అన్న శాశ్వత సర్వమత సార సిద్ధాంతం సామాన్యులు జీర్ణం చేసుకోలేకపోయినారు. మోక్షానికి సులభోపాయం కావలసి వచ్చినది; దానికిగా ఈ పురాణాలు వ్రాయవలసి వచ్చినది. సర్వశాస్త్రాలు వీటిలో ఇమిడ్చవలసి వచ్చినది. భారతం పంచమ వేదం చేయబడినది. స్వర్గ నరకాలు సృష్టింపబడినవి. స్తోత్రాలతో అనుగ్రహించే దేవతాగణం నెలకొల్పబడినది. ఈ పనిలో, దేవతలు ద్వేషం, స్పర్ధలతో నికృష్ట మానవులుగా చేయబడినారు. ఈ సందున పోలేరమ్మ బోటి క్షుద్ర దేవతలు గూడ దేవతా గణంలో చోటు చేసుకొన్నారు. దీని ఫలితంగా మూఢ విశ్వాసాలు, అంధ ఆచారాలు విజృంభించినవి. సామాన్యుడు కటిక చీకటిలో తపుడుకాడ జొచ్చినాడు. ప్రాయశ్చిత్తాల పేర తెలిసీ తెలియని మూక దోచుకోబడినారు. ఇట్టి అంధ విశ్వాసాన్నే తర్వాతి మత సంస్కర్తలు నిరోధించినది. ఇది ఉపనిషత్తుల మతం కాదని వారు చాటినారు.

కొన్ని పురాణాలు కొంత పాతవైనా, ఎక్కువ సంఖ్య క్రీస్తు శకారంభంలో వ్రాయబడినవి. గుప్తుల హిందూమత పునర్వికసన స్వర్ణయుగంలో మార్పులు చేర్పులు పొంది, పౌరాణిక మతం గచ్చపాద అయినది. బౌద్ధమత ప్రాబల్యంతో అవతారాలు పుట్టి, చివరకు బుద్ధునే అవతారాలలో చేర్చినారు (మొదటహంసావతారం). కొందరు ఈ బుద్ధుడు వేరే బుద్ధుడని పిడివాదం చేస్తారు. దీనితో రామాయణ భారతాలలో ప్రక్షిప్తాలు దూరినవి. కాని భక్తిమార్గం—పూజా విధానం దక్షిణాదిన పుట్టి, ఉత్తరాది యాగ మతానికి అడ్డు తగిలి, ఆధ్వాంత వాతావరణంలో కొన్ని క్షణ ప్రభలను కలిగించినవి.

పురాణాలు సృష్టి విషయాలను, భిన్న రీతులలో సూత్ర ప్రాయంగా సూచించి ఉన్నవి; కాని అవినేడు తిరస్కరింపబడుతున్నవి. బైబిల్, కొరానులకు గూడ ఇదే గతి పట్టుతున్నది; అయితే మాత్రం ఏమి ? మూఢ విశ్వాసాలు వదలిపోవడం లేదు. ఇది మతం గాదు — సైన్సు. అయినా, మన ఉపనిషత్తులు సనాతన మూల సత్య విషయాలను వెల్లడించి, ప్రపంచ మతాలకు సర్వజనీన మార్గం చూపుతున్నవి.

చాలా పురాణాలు చరిత్రాంశాలను చెపుతున్నవి. ఈ విషయం భవిష్యత్తు అని, భవిష్యత్తు క్రియతో భూత విషయాన్ని అనేక నాలుకలతో చెపుతున్నవి. అందువల్ల చరిత్ర తారుమారైనది. ఉదాహరణకు ఒక చిన్న విషయం :— శాతవాహన రాజుల కాలం—మత్స్య పురాణంలో 460 ఏండ్లు, బ్రహ్మాండంలో 456, వాయు పురాణంలో 411, విష్ణు పురాణంలో 300 ఏండ్లు అని గుణింపబడినది. రాజుల సంఖ్య 19 మొదలు (వి. పు.) 30 వరకు పెరిగినది. పార్గ్ గిటార్ అనే జర్మన్ పండితుడు, మన పురాణాలు మొదట ప్రాకృతంలో వ్రాయబడి, ఆవల సంస్కృతీకరింపబడినవని అంటాడు.

ఈ గ్రంథ విపుల పీఠికలో, హేతువాద బుద్ధికిగాని, ఈనాటి అభిరుచికిగాని నచ్చని, గిట్టని చాలా విషయాలున్నవి. కొత్తవాసనలలో ఊరిన ఈ పండితుడు పాత వాసనలలోబడినాడు. పరస్పర భిన్నమైన అన్ని పురాణాలు బ్రహ్మసూత్రాలు భారతం వ్రాసినది ఒకే వ్యాస భగవానుడంటాడు. (వ్యాస అనేది బిరుదనుంటూనే) ఇంకా విడ్డూరపు మాట — ప్రతి నాలుగు యుగాల పరిభ్రమణ చక్రంలో ఈ వ్యాసుడే పుట్టుతాడనడం హాస్యాస్పదం. ఈ గ్రంథకర్త మనమందరితోబాటు, పూర్వయుగ చతుష్టయంలో ధరించిన ఆ అవతారానికి డూప్లికేట్లమే అన్నమాట ! ఇటువంటి పాత పాచి పాటలు ఇందు చాలా ఉన్నవి.

"తిరు అనంతపురంలో వేంచేసిఉన్న అనంత పద్మనాభస్వామి" అని ఒక చిత్రం చేర్చినారు. ఇది ఆ స్వామి రూపంకాదు. ఆ స్వామి అందరు శయననారాయణులవలె భక్తులకు ముఖం చూపకుండా, ఎల్లకింతల పండుకొని ఉన్నారు. 30 అడుగుల శిలా విగ్రహం (శ్రీరంగం మూలవరులు సైకతమూర్తి). మూడు అడుగుల కిరీటం —మూడు అడుగుల ముఖం— కోటేరు వేసినట్లు చక్కటి ముక్కుతో అందచందాలతో గాంభీర్యాన్ని తొణికింపజేస్తూ, చూపరిని తన్మయుని జేసి, భక్తి రసంలో ముంచి, తాదాత్మ్యం అనుభవించేటట్లు చేస్తున్నది. అది తనివిదీరని తేజోమయ దృశ్యం !

కళాప్రపూర్ణ మరుపూరు కోదండరామరెడ్డి

## భారతీయ సంస్కృతి

(ద్వితీయ భాగము)

[నవరాత్రి పూజాది వివరణ సహితము. గ్రంథకర్త : వేద విద్యా విశారద, విద్వాన్ శ్రీ షడ్దర్శనం సోమసుందరశర్మ, శ్రీరాములు పేట, ప్రొద్దుటూరు, కడపజిల్లా. వెల : అయిదు రూపాయలు.]

ఈ పుస్తకంలో నవరాత్రి పూజాది వివరణము, సాలగ్రామ స్వరూప కథనం, వ్రత స్వరూపం, పూజాదుల కధికారులు, వ్రత పూజాదులకు సామాన్య ధర్మముల వంటి ఉపశీర్షికలున్నాయి. విజయ దశమి గురించి యీ పండితుడు వ్రాసిన వివరాలు యీతరం యువతీ యువకులు తెలుసుకొనదగినవి. లక్ష్మీ పూజా విధానము, సరస్వతీదేవి పూజా విధానము వంటి వాటిని ఆచరించటం వల్ల కలిగే ప్రయోజనా

ంను యీ గ్రంథకర్త చక్కగా వివరించారు. నమ్మకం వున్నవారు నిత్యానుష్ఠానం చేయడానికి ఉపయోగపడే పెక్కుమంత్రాలు యీ పుస్తకంలో వున్నాయి. నమ్మకం లేకపోయినా వాటిలో యేమున్నదో, వాటిని ఆచరించితే యేమి జరుగుతుందో చూద్దాం అనే జిజ్ఞాస కల వారు కూడా చదవదగిన పుస్తకం ఇది.

శ్రీ వి. ఎస్. అవధాని

# జీవరహస్యం

అందమైన గెటప్ పెద్ద గుణంగా ఉన్న 'జీవరహస్యం'లో రహస్యంలేదు. అద్భుత రహస్యాలెన్నో రహస్యంగా ఉండిపోయాయి.

'తెలుగులో సాంకేతిక పదజాలం పుష్టిగా లేదుకదా అని నిస్పృహ చెందవలసిన అవసరంలేదు'—అని ఈ రచయిత ఆధారం ఏమిటో చెప్పకుండ అనడం సమంజసంకాదు. తెలుగులో కావలిసినంత సాంకేతిక పదజాలముంది. పదజాలముందికదా అని యిష్టమొచ్చిన పదాలను ఉపయోగించడంవల్ల నిస్పృహేకాదు, నీరసంకూడా వచ్చి అంతులేని నిరాశలో ముంచివేస్తుంది. 'నేను వాడిన సాంకేతిక పదాలు పదిమందికీ నచ్చకపోవచ్చు'—అంటే చాలదు. 1973లో రాసిన ప్రతిని 1980లో అచ్చువేసేటప్పుడైనా తెలుగు అకాడెమీని సంప్రతించి ఉండవలసినది.

మాతృభాషలో శాస్త్రాధ్యయనంవల్ల ప్రయోజనముంటుందని భావించడం సబబుగానే ఉంది. అయితే మితిమీరిన దేశవాళీయత ప్రదర్శించడంవల్ల శాస్త్రీయత బాగా దెబ్బతింది. ఇందులోని ఉపమానాల ప్రయోగాలూ, సామెతల వాడకాలూ—రెండూ "సైంటిఫిక్ టెన్షన్"ను తగ్గించడమేకాక ఒకరకమైన వెగటును పుట్టిస్తున్నాయి.

రచయిత భారతీయ విశిష్టతను సాధ్యమైనంతవరకు చెప్పకొంటూ వచ్చారు. అంతవరకు రచయిత అభినందనీయులు. సిద్ధాంతాల విశదీకరణలో సంయమనాన్ని పూర్తిగా కోల్పోవడంవల్ల శాస్త్రజ్ఞుల కృషితాలూకూ ప్రజ్ఞాపాటవాలు మరుగున పడిపోయాయి. ఉదాహరణకు—'భార్యామణి ఇంటిదగ్గర లేకుండా చూసి ఒకరోజు షోన్‌బయిన్ వంటయింటిలో చొరబడి పొయ్యిదగ్గర ప్రయోగాలు మొదలుపెట్టేరట' (42వ పేజి) అని రాసి రచయిత ఏం సాధించినట్లు? అలాగే 'స్ట్రెకర్ ఆనే మరొక ప్రబుద్ధుడు' (43వ పేజి)

—[ఇది హాస్యమో! పరిహాసమో! నాకు తెలియడంలేదు]. రైబోస్ ఆనే చక్కెరకు ఆ పేరెలా వచ్చిందో చెప్పేటప్పుడు కూడ (51వ పేజి) యిదే ధోరణి కొనసాగింది.

డి. ఎన్. ఎ. నిర్మాణాన్ని గురించి యింకా చాలా చెప్పి ఉండవచ్చు. ప్యూరినుల మధ్యా, పిరమిడినుల మధ్యా ఎన్నేసి ఉదజని బంధాలుంటాయో చెప్పలేదు. జెనెటిక్ కోడ్ విపులీకరణ సంతృప్తికరంగా లేదు. "ఒపేరాన్ కన్సెప్ట్‌ని" వదలిపెట్టడం బాధను కలిగిస్తుంది. టెస్ట్‌ట్యూబ్ బేబీ, టెస్ట్‌ట్యూబ్ ప్లాంట్‌లాంటి అపూర్వమైన అపురూప విషయాలు 1980 లో ప్రచురించినా విస్మరించడం ఆవేదనను కలిగిస్తుంది.

121 పేజీల జీవరహస్య సారంలో 40 అచ్చు తప్పులు నా కంట బడ్డాయి. 41, 44 పేజీల్లోని గ్లూకోజ్ మాలెక్యూల్ కెమికల్ ఫార్మ్యూలాకు 49వ పేజీలోని అదే మాలెక్యూల్ కెమికల్ ఫార్మ్యూలాకు తేడా ఉంది. ఎందుకో తెలియచెయ్యలేదు. 59వ పేజీలోని సిస్టీన్ ఫార్మ్యూలాలో కార్బన్‌కు 5 వేలెన్సీ లుండడం ఆశ్చర్యం. 61వ పేజీలో పటం 2 లో ల్యూసిన్‌కీ, ఐసోల్యూసిన్‌కీ ఏ విధమైన భేదమూ లేదు. 69, 72 పేజీల్లో హిమోగ్లోబిన్ అణుభారం (రచయిత బణు భారం అన్నారు) 556 ఐతే, 74 వ పేజీలో 550కి దిగిపోయింది. ఇది అచ్చు తప్పుకాదు అని తెలిపేందుకు 85వ పేజీలో మరోమారు 550 అని పేర్కొనబడి ఉంది. 81వ పేజీలో వాసో ప్రెస్సిన్ నిర్మాణక్రమంలో తప్పు ఉంది. 98వ పేజీలో బ్రాకెట్‌లలో 'ఇలాగే **R W** ముక్కలు కూడా!' అని ఉంది. నిజానికి **W R** అని ఉండాలి. అచ్చు తప్పంటే సరిపోదు. 107 వ పేజీలో అడినిన్ నిర్మాణక్రమం తప్పు. థైమీన్ నిర్మాణ క్రమం తప్పు. యురేసిల్ నిర్మాణక్రమం తప్పు.

'దూరాలోచన లేకుండా నగరం నిర్మించిన అక్బర్ చవటతనానికి ఫతేపూర్ సిక్రీ ఒక మాన్యుమెంటు'--(38వపేజీ) ఇది నిజమా!

'సామాన్యుడికి అందుబాటులో లేకుండా విజ్ఞానాన్ని ఒంటి స్తంభపు దంతపు మేడలలో ఉంచి, మన పూర్వీకులు మనని యీ దీనస్థితికి తీసుకొని వచ్చేరు'—ఇదెంతవరకు నిజం? పైగా కులతత్త్వ కుతర్కవినాదాలు 'జీవరహస్యం'లోఎందుకు? (55వపేజీ చూడండి)

'గ్రీకు భాష నుండి తెలుగు శబ్దాన్ని తీసికొని దాని చివర యీన్ తగిలిస్తే, యీమారు ల్యూసీన్ వచ్చింది' – దీని భావమేమి వేంకటేశా? (56వ పేజీకి రండి.)

'ప్రశ్న అడగ్గలిగే ధైర్యం మన విద్యార్థులకి వుగ్గుపాలతో నేర్పవలసిన బాధ్యత ఎంతయినా మన వుపాధ్యాయుల మీద ఉంది' — అని (82వ పేజి). ప్రశ్నలడిగితే రూమ్‌కు పిలిచి వార్నింగు లిచ్చే స్టాఫ్ మెంబర్లున్నారని తెలియజేస్తున్నాను. ఇది స్వానుభవం! 'నీవు క్లాసుకు రాకు. అయినా నీకు నేను అటెండెన్సు యిస్తాను'— అని చెప్పేవారిని ఏం చేయాలంటారు?

రచయిత ఉపయోగించిన సాంకేతిక పదజాలంపై సమీక్షించ దలుచుకోలేదు. అలా చేయాలనుకొంటే నేను మరో జీవరహస్యాన్ని సృష్టించవలసి వస్తుంది. తెలుగు అకాడెమీని సంప్రతించి ఈ పుస్తకాన్ని పునర్ముద్రీకరిస్తే సర్వజనామోదాన్ని పొందగలుగుతుంది.

ఈ పదహైదు రూపాయల అందమైన పుస్తకాన్ని చదివి ఆనందించటం వలన కలిగే హాయి కన్నా, చదవకపోవడంవల్ల కలిగే కష్టమే నయమనిపిస్తుంది!

'సహృదయంతో చదివి చూడండి'—అని రచయిత అన్నారు.

ఆ తరువాత పాఠకుల యిష్టం!

శ్రీ గుమ్మనూరు రమేష్‌బాబు




"సాంప్రదాయ సిద్ధమయిన
భారతీయ ఔషధాలకి
ప్రత్యేకమయిన శక్తివుంది.
ఉదాహరణకి,
అమృతాంజన్."

ప్రకృతిలో లభించే అత్యంత
శక్తివంతమయిన పది మూల
ఔషధాలతో అమృతాంజన్ తయారు
చేయబడుతోంది. అంటే అమృతాంజన్
చాలా శక్తివంతమయినది.

అందుచేత అమృతాంజన్
తలనొప్పులకు, జలుబులకు,
వంటినొప్పులకు, బెణుకులకు
శీఘ్రంగానూ, నిశ్చయంగానూ
ఉపశమనం కలిగిస్తుంది.
అంతేకాదు అమృతాంజన్
సురక్షితమయిన బాధా నివారిణి.

అమృతాంజన్ :
80 సంవత్సరాలకు పైబడిన
నమ్మకమైన దివ్య
ఔషధము

AM-2148

# అమృతాంజన్
## తలనొప్పులకు .జలుబులకు.
## వంటినొప్పులకు.బెణుకులకు

